# పీఠిక

నేనీ గ్రంథమును ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము వారి కోరికపై మ. రా. రా. శ్రీ బి. వేంకటాచారిగారి కన్నడభాషా గ్రంథమునుండి యాంధ్రీకరించితిని.

కన్నడము మా స్వభాషయే యగుటవలనను, చాలకాలము నుండి మేమాంధ్రదేశమునందే నివసించియుండుట వలనను నాకీ రెండు భాషలయందును కొంచెము కొంచెముగఁ బరిశ్రమ కలిగి యుండెను. ఇంతేగాక నాకీ గ్రంథ రచనయందు నా మిత్రులగు వేంకటపార్వతీశ్వరకవులు చాలవఱకు తోడ్పడుచే నేనీ గ్రంథమును నిరంతరాయముగ రెండు మాసములలో సంపూర్ణముగ నాంధ్రీకరింపఁ గలిగితిని.

ఇది నా ప్రథమ ప్రయత్న మగుటచే నిందేమైన దోషము లున్నయెడల మన్నించి గుణగ్రహణపారీణులగు పండితు లిందలి గుణములనే గ్రహించెదరు గాక.

ఈనవలను ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయమునకు చతుర్థ పుష్పముగఁ బ్రకటించుట కానిలయమువారు కోరుటచే నా నిలయము వారికీ గ్రంథమును కాపీరైటు మొదలగు సంపూర్ణ స్వాతంత్ర్యములతో నొసంగితిని.

తణుకు
24—10—11

ఇట్లు విన్నవించు విబుధవిధేయుఁడు
సాళ్వాయంతుల సుబ్బారావు.

# మృణాళిని

## మొదటి ప్రకరణము

### తటినీతటము.

"వినాసీతాదేవ్యా కిమివ హి న దుఃఖం రఘుపతేః
ప్రియానాశే కృత్స్నం కిల జగ దరణ్యం హి భవతి"
(భవభూతి–ఉత్తరరామచరితే)

వంగదేశశకముయొక్క యేకాదశశతాబ్ద ప్రథమభాగమునందు సుప్రసిద్ధుండును, నీతికుశలుండును, ఉత్తరహిందూదేశ మంతయుఁ బరిపాలించిన చక్రవర్తియు నగు నక్బరు పాదుషాకు తరువాత జహాంగీరు చక్రవర్తి రాజ్యమునకు వచ్చెను. ఆతని ప్రభుత్వకాలమున ఫాల్గునమాసమునం దొకదినంబున సంధ్యాసమయమునకుఁ గొంచెము పూర్వమున సప్తగ్రామ సామీప్యమునందలి నదీతీరమునం దొకయౌవన పురుషుఁడు చెక్కిటఁ జేయిఁ జేర్చుకొని యేమియో యాలోచించుకొనుచుఁ గూర్చుండి యుండెను. పగలంతయును దుస్సహాకిరణజాలంబుల బ్రసరింపఁజేసి విశ్వసంసారమును శొందరపెట్టి యిప్పుడు విశ్రామలాభమును గోరి సూర్యభగవానుఁడు తన పశ్చిమ గృహముం గూర్చి పోవుచుండెను. సాయంకాలము కావచ్చెను. ఏ స్థలమునం దా యౌవనస్థుఁడు చింతామగ్నుఁడై కూర్చుండి యుండెనో, సప్తగ్రామమునందలి యా భాగము దట్టమైన యడవిచేఁ గావరింపఁబడి యుండెను. అచ్చట వచ్చుపోవు జనులయొక్క సమ్మర్ద మేమియును లేదు. ఆతఁ డేకాగ్రచిత్తముతో నొంటరిగఁ గూర్చుండియుండెను.

అతని చూపులును ఏకాగ్రములై యుండెను. ఇట్టి స్థలమునందు, ఈ సమయమున, ఈ విధముగాఁ గూర్చుండి యాతఁడేమి యాలో చించుచుండెను? సాయంకాల మయిన దని తెలిసికొని సమీపమునఁ గలకలధ్వనులు సేయుచున్న పక్షులసుస్వరములపై మనసుంచి యాల కించుచున్నాఁడా? లేదు. అతని చరణసమీపమునఁ దరంగ కల్లోల ములచే నుచ్చలితమై ప్రవహించుచున్న పర్వతపుత్రిక యగు భాగీ రథీనదిని తన్మయుఁడై చూచుచుండెనా? అదియై యుండదు. అంధ కారసూచకంబు లగు ఛాయలచే దట్టముగ నలమికొనుచున్న సం ధ్యాకాలసమాగమమును జూచి తమ తమ గుహలనుండి బయటికి వచ్చి గుంపులై యొండొరులని నాకికొనుచు సమీపమున నిలువఁబడి యున్న వన్యమృగంబుల నవలోకించుచుండెనా? అదికాదు. వచ్చు చున్న భర్తం జూచి లజ్జచే నాలుగడుగులు వెనుకకు వైచి, మరల ముందునకు రెండడుగులు వచ్చి వెనుక ముందులకు నడయాడుచున్న క్రొత్త పెండ్లికూఁతురు నడవడిని సూచించుచు గంగాతరంగమాలికా చలనంబున వెనుక ముందుల కూఁగులాడుచున్న మనోహరలతావిలా సముం దిలకించుచుండెనా? అదియును కాదు. సాయంకాల సమీ వేళమును సేవించు నాశచే క్షణక్షణము నీటిపైఁ దేలియాడుచు ఆ యుత్తరక్షణముననే అతలకుతలములై కనఁబడకుండ నీటియందు మునుఁగుచున్న మొసలి మొదలగు భయంకర జలజంతువులఁ జూచు చున్నాఁడా? లేదు. ఇది యేదియునుగాదు. ఆ సుందరుఁడు దారుణ మైన చింతాసాగరమున మునిఁగియుండెను. ఆ విషాద మేమియో యాతనికే తెలియును. ఆ పురుషుని ప్రశాంతస్థలాంతరమున స్వేదబిందు వులు దోఁచుచుండెను. మాటిమాటికి ప్రకాశమానములైన యాతని కను దమ్ములనుండి తెలియకుండఁగనే రెండు కన్నీటిబిందువులు జారి పడిపోవును. అతఁడు స్వభావ సుకుమారుఁ డగుటచే బాష్పక

పట్టునఁ గూర్చుండియుండెను. కన్నులు చలించుట లేదు. ఆతని యెడమచేతిపైఁ జెక్కిలి చేర్పఁబడి యుండెను. కుడిచేయి మోకాలిపై నానుకొని యుండెను. శరీరమును చలియించుట లేదు. నడుమనడుమ వెడలుచుండు నిట్టూర్పు లాతనిసజీవత్వమును దెలియఁజేయుచుండెను. ఆయవస్థలో నున్నయాతని నెవ్వరైనఁజూచుటతటస్థించెనేని సాక్షాత్కరించినయొకానొక దేవమూర్తి యనియు, ఆనదీతీరమునఁ బ్రతిష్ఠింపఁబడి యుండె ననియు ననుకొనక మానరు.

ఇట్లుండఁగా సమీపవృక్షాంతరాళమునుండి జగన్మోహినియగు నొకరమణీయమూర్తి బయలుదేఱి మెల్లమెల్లగ నాతనికడ కరుదెంచుచుండెను. ఆనిర్జనారణ్యమున నయ్యసమానసుందరీసమాగమనమును మనముదిలకించితిమేని యామె తప్పక వనలక్ష్మియే యని తలంపక మానము. మందగమన యగునాసుందరి మెల్లమెల్లఁగ పాదముల నిడుచు నాపురుషునిసమీపించి యాతనిపార్శ్వంబునఁ గూర్చుండి యుండెను. పురుషునిదృష్టియు నామెపైఁ బ్రసరించెను. ఆచూపులలో వైరాగ్యమును, విసుగును వ్యక్తమగుచుండెను. సుందరి నిశ్శబ్దముగనే యుండెను.

చాలసేపటికి "పద్మావతీ! నీ విక్కడి కెందులకు వచ్చితివి?" అని యాతఁడు ప్రశ్నించెను.

"నవకుమారా! నిర్భాగ్యురాలగు నీభార్య నెన్నిదినము లింకను కష్టపెట్టెదవు!"

"నీవు పదింబదిగ నిట్లే మాట్లాడి నాకు విసుఁగు పుట్టింపకుము. నావలన నీ కేమికష్టము కలిగినది?"

"నాథా! నీవు నన్ను కష్టపెట్టుటలేదా? నేను నీ ధర్మపత్నిని. నీవు నన్నుఁ ద్యజించితివి. నాకష్టముల కెల్ల నిది కారణముకాదా?"

నవకుమారుఁడు చాల విసుఁగుజెంది "అది నాకుఁ దెలియదు. నీవునన్ననుసరించి యేల వచ్చితివి ?" అనెను.

"నీవు నిత్యము నిటకు వచ్చుచుండుట నీతో మాటలాడుట కీస్థల మనుకూలముగా నున్నదని నేను చాల శ్రమపడి వెదకికొనుచు వచ్చి యుంటిని. ఇఁక నన్ను కష్టపెట్టకుము" అని పలుకునప్పుడు పద్మావతి కనుదమ్ములు బాష్పజలపూరితము లయ్యెను. వానినాపురు షుఁడు చూచియుండ లేదు.

"నీవు నన్నుఁ బెండ్లియాడినదాన వని నేనొప్పికొందును. కాని నేను నిన్ను మరలఁ బరిగ్రహింపఁజాలను. నీవు యవనస్త్రీవనియెవ్వ రెఱుంగరు ?" అని నవకుమారుఁడు పలికెను.

పద్మావతి యీమాటలను విని చీరచెఱఁగు మొగమునఁగప్పి కొని యేడువఁదొడంగెను. నవకుమారుఁడు దానిని తెలిసికొనియెను. చాలసేపైనవెనుక నాయువతి కన్నీళ్లను దుడిచికొని "ప్రాణేశ్వరా ! నేను యవనస్త్రీనే. ఔను—కాని, నేను యవనినైననేమి ? మఱి యెవ్వతెనైన నేమి ? నేను నీపత్నిని—నీదాసిని—ఆఁడువారలకు పతియేగతి. పతియే పాలకుఁడు. పతియే శిక్షకుఁడు. నాథా ! సతికిఁ బత్యనుసరణమే సర్వసుఖములకు మూలకారణ మని యీ మందభాగ్యురాలికి మొట్టమొదటఁ దెలిపినవా రెవ్వరును లేరైరి. నీయొద్దనుండి ఆధర్మనీతు లన్నియు నీయుపదేశముచేఁ దెలిసికొనుటకుఁ బూర్వమే యాపాడువిధాత నీపవిత్రసంసర్గమును విచ్ఛిన్నముం జేసి నన్నుఁనీకు దూరముగాఁ జేసివైచెను. నాకైనను ఆజ్ఞానము కలుగ లేదు. ఒక యబల యజ్ఞానముచే నెంతయపరాధమునకుఁ బాల్పడునో అంతయపరాధమునకు నేను లోఁబడిపోయితిని. అజ్ఞానకృతంబగుపాప మునకుఁ బ్రాయశ్చిత్తమే లేనియెడల నేనునీపవిత్రచరణసామీప్యమున నాప్రాణములను విడిచి పాపపంకిల మగునీదేహమును విసర్జించెదను.

నేనిప్పుడుస్వామి సేవాసుఖమును దెలిసికొంటిని. మరలదానిని విడువఁ జాలను. నేనుఅజ్ఞానాంధ కారముచేదిక్కు తెలియక విభ్రాంతనై నానావిధపాపమార్గములలోఁ బడిపోయినమాట సత్యము. కాని, హృదయేశ్వరా! ఉన్నట్లుండగాఁ నామనస్సున జ్ఞానతేజము గాఢసూపినది. నాహృదయమను తాపముచే దహించుకొని పోవుచున్నది. ఇప్పుడు నీవు దయార్ద్రహృదయుఁడవై తిరిగి నన్ను నీపత్నిగాఁ బరిగ్రహింతువేని విశృంఖలమై, నిర్లజ్జమై సముద్ధతమై పోయిన యీ నాచిత్తము సంతోషసము జ్జ్వలము కాఁగలదు. జీవితేశ్వరా! నాకు నీ పాద సేవదక్క వేఱుగతిలేదు. నేను నీచరణకమలములను వక్షస్థలమునం జేర్చుకొని కలుష దూషితమైనయీశరీరమును పవిత్రము చేసికొని నాపాపములనుండి పరిశుద్ధురాల నగుదును.''

పద్మావతి యిట్లుపలుకుచుఁ దిరిగి తనముఖమును గప్పికొనియెను. నవకుమారుఁ డిదియంతయును వినియెను. ఆతఁ డేమియు మాటాడలేదు. తరువాఁత నవకుమారుఁడు నిట్టూర్పు విడిచి, హృదయ వేగమును కొంచెము శాంతిపఱచుకొని ''పద్మావతీ! నేను నరాధముఁడను. నేను చేసినపాపమునకుఁ బ్రాయశ్చిత్తమే లేదు. నిరపరాధినియు, సంసారజ్ఞానవిహీనయు, సాధ్వియుధర్మపత్నియు,నైనమృణ్మయియొక్క యకాల మృత్యువునకు నేనే మూలకారణుఁడ నైతిని. నీచమైన యీ పాపపుజీవనము తుదముట్టువఱకునాదారుణశోకము నన్నుదహించి వేయుచున్నది. నేనింతకంటె వేఱుగ నేసుఖము నపేక్షించుటలేదు—— మృణ్మయియీరూపమును ధ్యానించుచు నరకులకళంకమైన యీ నాదేహమునుండి ప్రాణవాయువులను దీసివేయుమని నిన్నుఁ బ్రార్థించుచుండగా ఓతల్లీ! భాగీరథీ! నీవు భవిష్యజ్జ్ఞానశూన్యురాలవై నిరపరాధినియైన మృణ్మయిని నీకడుపునఁ బెట్టికొంటివా? ఇంకను నీమందభాగ్యుని నేల కష్టపెట్టెదవు తల్లీ! నన్ను నీయొడిలోఁ

జేర్చికొని, ఈసంసారయా తననుండి విరుగడఁజేయు మని వేఁడుకొను చున్నాఁడను'' అనియెను.

ఇట్లు పలుకునప్పుడు నవకుమారునికన్నులనుండి నిరర్గళాశ్రు ధారలు కురియనారంభించెను.

ఆతఁడు కొంచెమూఱట నొంది "పద్మావతీ! సంసార మిప్పుడు నాకు విషస్వరూప మైనది. నాకు మఱిదేనిమీఁదను, ఇంచుకైనను దృష్టిలేదు. మృణ్మయీ మరణమున నాకు సంసారమే యంధకారమ యమై నాశరీరమును,-మనస్సును శూన్యమైపోయినవి. పద్మావతీ! నీవింక నిష్ప్రయోజకుఁడనైన నాకొఱకు కష్టపడవలదు. నీవిదివఱ కెట్లుంటివో అట్లే సుఖముగనుండుము. వ్యర్థములైన యాశాపాశము లం దవిలి యెందుల కీక్లేశముల ననుభవించెదవు? నీవు యవనస్త్రీ వని నాకంత యాక్షేపణమును లేదు. కాని నేను తిరిగి సంసారినగుట లేదు నేనిట్లే కాలమును గడపుచుఁ బ్రాణములను విడువవలయునని స్థిర పఱచుకొంటిని. మఱియేరమణినైనను, అసహ్యాకరమైన నాజీవితము నందు సహచారిణిగాఁ గైకొన దానినిగూడఁ గష్టపెట్టుటకు నాకిష్ట ములేదు. పద్మావతీ! నీవు నాసంసర్గముచేఁ గేవలమును కష్టములపా లగుదువు. నాయాశను వదలుకొనుము''

ఈవాక్యపరంపరను వినుచున్న పద్మావతి ముఖము వైవర్ణ్య మును బొందెను. ఆమె నిట్టూర్పు విడిచి "నాథా! నీవు నాకధర్మము ను బోధించుచుంటివి. నేను నీకు మొదటనే చెప్పితిని. ప్రాణము పో యినను పోనిమ్ము. నీసంసర్గమువలన నాకు కష్టములు వచ్చినను రాని మ్ము నేను నీదాననై యుందును. నీవు నన్నుఁ ద్యజించినను, నేను నిన్ను త్యజింపలేను'' అనియెను.

నవకుమారుఁడు దీనికేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు, ఆత డించుక విచారించి "పద్మావతీ! చీఁకటి పడినది. ఇంటికిఁ బొమ్ము,

ఈ విషయమును గూర్చి తరువాత నాలోచింప వచ్చును.'' అనియెను.

ఇట్లు చెప్పుచు దీర్ఘనిశ్వాసముతో నాతఁడటనుండి లేచెను. పద్మావతి ''ప్రాణేశ్వరా! ఈ యధమురాలి యొక్క ప్రార్థనమును మనసు నందుంచుము. జేపాక.పారి నా యునికిపట్టునకు రాఁగోరెదను.'' అని పలికెను.

''ఇప్పుడు దానికై వాగ్దానము చేయఁజాలను'' అని నవ కుమారుఁడు బదులు చెప్పెను.

ఇదివఱకు నిద్దఱును బాహ్యజ్ఞానశూన్యులై మాటలధోరణిలోబడి యన్యమనస్కులై యుండిరి. అట్లగుటచే వనమంతయు ఘోరాంధకారముచే నిండియుండుటను వారిరువురును చూచి యుండలేదు. ఇద్దఱును లేచిరి. పద్మావతి ''నాథా! నన్ను మఱువవలదు. ఇదియే నా ప్రార్థనము'' అనియెను.

ఇట్లు మాట్లాడుకొనిన పిమ్మట వారిరువురును తమ తమ గృహంబులం గూర్చి పోవుచుండి, స్వల్పకాలములోనే వారు భయంకరమయి, యంధకారమయిన యా యరణ్యమునం దదృశ్యులైరి.

---

## రెండవ ప్రకరణము

### కృతనిశ్చయము.

..............................................."lucky joys
And golden times, and happy news of price''
shakespeare.

వెనుకటి ప్రకరణమునఁ జెప్పఁబడిన యరణ్యమును దాటిన పిమ్మట రెండంతస్థుల పురాతన మందిర మొకటి కానబడును.

అదియే నవకుమారుని వాసగృహము. వనమునకుఁ జేరియే యుండెను. అంతఃపురాంగణము మిగుల మనోహరమై యుండెను. ఆ నడుమ నొక పెద్ద చింతచెట్టు కలదు. పండ్రెండు గంటలయినది. ఆ సమయ మున నాచెట్టునీడ నిరువురు కాంతలు మాటలాడుకొనుచుఁ గూర్చుండి యుండిరి. ఆ సుందరులలో నొక్కతె రూపయౌవనసంపన్న యగు వంగదేశాంగనవలె నుండెను. ఆమెధరియించిన వస్త్రము రమణీయ మగు స్వదేశవస్త్రమువలె నుండెను. రెండవవాని దుస్తులను బట్టి యామె యవనదేశ స్త్రీ యని తెలియ వచ్చుచుండెను. ఆమె మొదటిదాని కంటె వయస్సునఁ గొంచెము పెద్దది. మొదటి యువతి నవకుమారుని సోదరి. ఆమె పేరు శ్యామసుందరి. రెండవ దాని పేరు పేష్మని. ఈమె పద్మావతి పరిచారిక.

"పేష్మనీ! నీవు చెప్పినది నిజమేనా? పద్మావతి నిజముగా నిక్కడనే యున్నదా? నా కది తెలియలేదు." అని శ్యామసుందరి యడిగెను.

"అక్కా! నేను ఆ సమాచారమును చెప్పుటకే వచ్చితిని. ఇప్పుడామె యేడు మాసములనుండి యిచ్చటనే యున్నది."

శ్యామసుందరి నిట్టూర్పు విడిచి "పేష్మనీ! ఈసంగతి నాకె వ్వరును చెప్పలేదు. అహా! ఆమెను చూచి యెన్నోదినములయినది. ఆమె యిప్పుడు నల్లే యున్నదా? అది నీకెట్లు తెలిసినది? అమెను చూచుట కేమియు నుపాయములేదా?" అనియెను.

పేష్మని యేయుద్దేశ్యముతో నచ్చటికి వచ్చియుండెనో దాని కనుకూలముగనే మాటలాడెను. ఆమె యానందముతో "నిన్నా మాట నడుగుటకే వచ్చితిని. ఆమె యొకసారి నిన్ను చూచుటకు చాల నిష్టపడుచున్నది. నీయాజ్ఞయయ్యేనేని యామెయే యిచ్చటకు రాగలదు. ఆమె నాతో నెల్లప్పుడును నీమాటలే చెప్పి దుఃఖపడుచుం డును" అనియెను.

శ్యామసుందరి యానందములోఁ బ్రపంచమంతయును మఱచి పోయెను. పద్మావతి యవనసుందరి యని యామెకుఁ దెలియును. ఆమె తనయింటికి వచ్చుట లోకాపవాదమునకుఁ గారణమగుననియు ను, తనయన్నకు విసుగు గలుగుననియును తలంప లేకపోయెను. సం తోషవికాసముతో "ఆమె వచ్చుటకు వేఱుగ నాజ్ఞ యెందులకు? పేష్మవీ! దానికి బ్రార్థింపవలయునా? అవసరమయ్యేనేని యామెను చూచుటకు నేనే వచ్చెదను. కాని, యది యసంభవము. నీవు పోయి యిట్లని చెప్పుము. ఆమె కెప్పుడు సమయమో, యెప్పు డిష్టమో అప్పుడు రావచ్చును" అనియెను.

"ఆజ్ఞాప్రకారమే" అని పేష్మని వెడలిపోయెను.

శ్యామసుందరి గృహమునఁ బ్రవేశించెను. అటఁ గొంచెమ స్థిరభావముతో నిలిచియుండెను. ఆమె ముఖకాంతి గంభీరమై యుం డెను. కాని, వెంటనే వ్యాకులతను పొందెను. చూచుచుండగనే ఇం దీవరసదృశంబులగు విశాల నయనంబులనుండి పెద్దపెద్ద ముత్యముల వలె నశ్రుబిందువు లామెకుఁ దెలియఁబడకుండ దొరలుచు వెలువడి నేలను దడుప నారంభించెను. శ్యామసుందరి తన యన్నభార్యయైన మృణ్మయియందుఁజాలఁ బ్రేమ గలిగియుండెడిది. ఆమెను తనప్రాణము కంటెను బ్రియమైనదానిగాఁ జూచుకొను చుండెడిది. ఆమెయందలి గౌరవముచే నామెకు మృణ్మయి యని పేరుపెట్టిరి. ప్రాణపదమైన మృణ్మయియకాలమృత్యువువాతంబడియెననుదుఃఖమామె హృదయ మును సంతసింపజేయుచుండెను. ఈదినంబున జరిగిన మాటలసందర్భ మున శ్యామసుందరి కావృత్తాంతమంతయు హఠాత్తుగ జ్ఞాపకమునకు వచ్చెను. మృణ్మయి మనోహర వదనమండల మామెకుఁ దలపునకు వచ్చెను. ఆమె మరణముగూడ మనసునకుఁదట్టెను. ఆమెయదియంత యు నుస్మరించుకొని చాలసేపు దుఃఖించెను. క్రమముగా నామెమనసు

కుదుటఁబడుచుండెను. ఇప్పుడామె ముఖము చూడుఁడు! అందు హర్షచి హ్నము లెట్లు పొడసూపుచుండెనో! ఇది యేమి? యువతీమణియగు శ్యామసుందరియున్నాదినియా? అట్లైయుండదు. ఇప్పుడామె మానససరోవరంబున వేఱువిధమైన భావప్రవాహ ముదయించినది. ఇప్పుడామెకు దన సోదరుని మొదటిభార్య జ్ఞాపకమునచ్చెను. పెండ్లియయినతరువాతనొక సారిమాత్రము పద్మావతి మూఁడు నెలలుమాత్రమే యత్తవారింటనుండెను. అప్పటికామెవయసు—పండ్రెండు—లేక పదమూఁడు వత్సరములుమాత్రమే. అదియిప్పటి కెన్ని సంవత్సరములక్రిందటిమాట! అది యైనతరువాత నామె జీవనమునం దెన్ని మార్పులు జరిగినవి! ఇప్పుడు పద్మావతికి యౌవనమంతయును పోయినది. పద్మావతి తండ్రి రామ గోవిందఘోసాలుఁడు సపరివారముగ మహమ్మదీయమతమును స్వీకరించెను. ఆకారణమునఁ బద్మావతియును యవనస్త్రీయై యుండవలయును. నాఁడు మొదలు పద్మావతిసమాచారము నెవ్వరు నెఱుఁగరు. పద్మావతియనుసంబంధమే వదలిపోయినది. ఇది యెంతికాలమునాఁటి మాట! ఇన్నియుగాంతరములైనపిమ్మట పద్మావతి తిరిగి యీ దేశమునకు వచ్చియుండెను. ఆమె యెట్టిదైననేమి? అన్నపెండ్లామే. ఆకారణముచే నామెను ప్రేమింపవలయును. ఇంతకాలమునకుఁ దిరిగియామెను చూచుట అపరిమితానందదాయకముకాదా! శ్యామసుందరి యిట్లు యోచించుకొని యానందముచే నుప్పొంగిపోయెను. హృదయమునందలి యానందము ముఖబింబమునఁ బ్రతిఫలించుచుండెను. ఆమె మెల్లమెల్లగ నవ్వుకొనియెను. ఇదియే యానందకరమైన మార్గము. ఆనందము వృద్ధులనుగూడ యౌవనులనుగఁ జేయఁగలదు. విచారము యౌవనులను వృద్ధులఁ జేయుచుండును. యువతీమణియగు శ్యామసుందరి యానందభరితయై బాలికాభావమును వహియించెను. ఆమె తనశరీరమును కదలించుచుంటిననియు, చేయాడించుచుంటిననియుఁ దెలి

సికొని మనసులోనే నవ్వుకొనియెను. ఎవరిహృదయమందీవిధముగా మాటిమాటికి నానందోన్మాదము కలుగుచుండునో అట్టివారు మనశ్యామసుందరి ప్రకృతమందు పిచ్చిదై యిట్లుండలేదని తెలిసికొనఁగలరు.

మున్ను పద్మావతి యత్తవారింటికివచ్చినప్పుడు ఆమెయెవ్వరితోడను మాటలాడలేదు. ఆమెతల్లి, అత్తమామలు మొదలగు గురుజనమునొద్దఁగోడలుమాటలాడఁగూడదని చెప్పియుండెను. పద్మావతి తల్లి చెప్పినట్లుగనే నడచుకొనియెను. ఆమెతనయాఁడుబిడ్డ యగుశ్యామసుందరితో మాత్రము కూడియుండెనుగాని మఱియెవ్వరితోడను మాటలాడలేదు. బాల్యసఖులైన శ్యామసుందరీ పద్మావతులకు వారి వారి బంధుభావసంబంధమేకాక మఱియొక యనుబంధముగూడఁ గలిగి యుండెను. ఆయనుబంధము పరస్పరానురాగమే. అప్పటికి వారేక మతమునందే యుండిరి. ఈమొదలైన కారణములచేఁ గలిగినయనుబంధము స్వల్పముగ శిథిలమగుచువచ్చెను. ఈదినమున నప్పటి యెల్ల సమాచారములును తలంపునఁ బాఱెను. శ్యామసుందరిప్రణయరజ్జువుచే నాకర్షింపఁబడి పద్మావతీదర్శనలాలసయయ్యెను. శిథిలమైనయా యనుబంధము దృఢమయ్యెను. ఆమె పద్మావతియెంతసేపటికివచ్చునో యని వికసితహృదయారవిందయై ప్రీతితో నెదురుచూచుచు వేచి యుండెను. శ్యామసుందరి యీవిధముగ నానందరససముద్రమున నోలలాడుచున్నసమయమున నవకుమారుఁడు ప్రవేశించెను. నవకుమారుఁడువచ్చుటనుజూచి శ్యామసుందరి కానందము మఱింతవృద్ధియయ్యెను. ఆమె "నాయన్నకు పద్మావతి యీదేశమునకువచ్చినసమాచారము తెలియదు. వానికీసమాచారమును చెప్పెదను. వలదు— ఆతనికిఁ జెప్పుటవలనఁ బ్రయోజనమేమి? ఆతఁడాక్షేపించెనేని ఆమెను జూచుటకు విఘాతముకలుగునుగదా! అయినను దీనివలన మాకు

న్నకుఁగలిగిన కష్టమేమి ? సరే. చెప్పి చూచెదను—'' అని యోచించు కొని—

''అన్నా ! మా పెద్దవదినె వచ్చినది'' అని చెప్పెను.

నవకుమారుఁడా మాటలను విని యాశ్చర్యపడక ''శ్యామా ! ఇదియేమి ? క్రొత్తసమాచారమా !'' అనియెను.

''అట్లయినని వెఱుఁగుదువా ? మాకేమియు నింతవఱకు గుఱుతు తెలియలేదు. నేఁడే తెలియవచ్చినది''

''ఎవ్వరు చెప్పిరి ?''

''ఆమె దాసి''

''ఎందులకుఁ జెప్పినది ?''

''ఆమె వచ్చి నన్నుచూచుట కాశపడుచున్నదట ! అందుకొఱకు రావచ్చునాయని వార్తపంపినది. నేను రానచ్చునని తిరిగి ప్రత్యుత్తరమంపితిని''

నవకుమారుఁడేమియును జెప్పలేదు. ఈమౌనమంగీకారమును సూచించుటలేదు. అదివిరక్తివ్యంజకముగనుండెను. ఆతఁడు మెల్ల మెల్ల గనవ్వలికరిగెను.

శ్యామసుందరి నవకుమారుని హృదయభావమును తెలిసికొనలేక పోయెను. ఆకారణమున నాతని మౌనభావ మంగీకారసూచకమేయని యనుకొని పరమానందమునుపొందెను. మృణ్మయి గంగయందుఁబడిపోయినది మొదలు నవకుమారుఁడే కార్యమునందును ఉత్సాహమును కనఁబఱచుటలేదు. శ్యామసుందరియు నట్లే భావించెను. ఆమె సిద్ధాంతిమన్యాయముగానున్నది—అదియెప్పటికినన్యాయముగాదు. ఎవరి హృదయములందు చాతుర్యమును, చాకచక్యమును, ఉండనో ప్రపంచమునందు వారేసుఖులు.

శ్యామసుందరి నిర్మలమైనమనసుతో గృహకార్యములయందుఁ బ్రవేశించెను.

---

# పాతివ ప్రదీపము

---

## విగతచింతనము.

"న పతివ్యతిరేకేణ స్త్రీణా మపరా గతిః."

సప్తగ్రామమందలి విశాలమైనరాజవీథిలో నొకప్రక్కను రమణీయమైన రెండంతస్థుల మేడ కన్పట్టుచుండెను. దానిమీఁద నొకగదిలో నిద్దఱు సుందరీమణులు కూర్చుండియుండిరి. ఇద్దఱును యవనదేశస్త్రీలదుస్తులను ధరించి యుండిరి. వారిభవనమునందలి యలంకారపద్ధతియు మహామ్మదీయమతానుసారముగనే యుండెను. పాఠకమహాశయు లాసుందరుల నిద్దఱ నెఱిఁగియే యుందురు. గంగాతీరమందు నవకుమారుని సమీపనకు వచ్చిన పద్మావనిగూడఁ జూచియుందురు గదియందుఁ గూర్చుండియుండిన సుందరియే పద్మావతి. పద్మావతి యిప్పుడు చిరపరిచితము లగుయవనదేశపుదుస్తులనే ధరించియుండెను. ఆమెవదన బింబమునఁ దేజోగర్వములు ప్రకాశించుచుండెను. ఆమెరూపమున కేలోపమును లేదు. ఇప్పుడామె ప్రసన్నురాలయియుండెను. ఆనంద మామె దేహమునం దంతటనుపూర్ణీభవించి యుండెను. ఆదినమున మీరు చూచిన మలినయు, భయభ్రాంతయు, అలంకారవిహీనయు, విచారగ్రస్తయు నగుపద్మావతి నీదినమునఁ జూచితిరేని గుర్తింపఁజాలరు. తరుణీమణియగు పద్మావతి శరీరము నందలి యాభరణములన్నియు, నమూల్యమణులచే మిలమిలమెఱయుచుండెను. నేఁడామె యేయే యవయవములయం దేయేవస్తువులు తగియుండునో ఆయాయవయవములం దాయాయలంకారములనుధరించియుండెను. ఆమె తాంబూలచర్వణము సేయుచుండెను. నడుమనడుమ వదనమండమునందలి స్వేదబిందువులను కరవస్త్రముచే నొత్తుకొనుచుండెను. ఆమెదాసియగు పేష్మనియును గూర్చుండి యుండెను.

పద్మావతి సప్తగ్రామమునకు వచ్చి యీ గృహమునందునివ సించి యుండెను. ఇక్కడకు వచ్చినతరువాత నామెభర్త నవకుమా రుఁడు ఆమె నిర్బంధమునకు లోనై ఒకటిరెండుపర్యాయము లాయిం టికి వచ్చి యామెను చూచెను. కాని యందువలన పద్మావతిమనో రథ మేమాత్రమును సంపూర్ణముగ సిద్ధింపలేదు. పాఠకమహాశయులు గంగాతీర మందు పతి ప్రేమాకాంక్షిణియై, భర్తయొద్ద నేకాన్పుండి యున్న పద్మావతిని చూచియున్నారు. ఆసందర్శనము వలనఁబద్మావ తిమనోరథము ఎంతవఱకు ఫలించినదో తెలిసికొనియేయున్నారు భర్త యొక్క యస్పష్టమైన ప్రణయమహిమ నుద్ధరించుకొనుటకు సౌదర్యవ తియైన పద్మావతి వివిధగుణగణంబులచే ననేకప్రయత్నములను చేయు కయే చేయుచుండెను. కాని, కొంచెమైనను గార్యసిద్ధి కాకపోయెను నేఁడామె తిరిగి యాయుద్దేశముతో నూత్నసాధనోపాయము లను కనిపెట్టి యుండెను. ఇవి యన్నియు నెట్లు ఫలించునో అది క్రమముగాఁ దెలియవచ్చును. తనచుఱుకుదనమును, చాక చక్యమును, తంత్రమును, ఈనూఱు వ్యర్థముకావను నమ్మకము తోఁ బద్మావతి నేఁడు కొంతవఱకు సంతోషమును పొందుచుండెను.

పేష్మనియుఁ జాలసే పన్యమనస్కురాలై యుండెను. అవంతర మామె పద్మావతినిగూర్చి "నీ వీసప్తగ్రామమం దింక నెన్నిదినము లుందువు? ఆగ్రా సమాచారము లన్నియు మనస్సునకుఁ దెచ్చికొని యోచించి చూడుము—నీవక్కడ నెంతసుఖముగానుంటివి! ఇక్కడ నేమిసుఖముగా నున్నది?" అనియెను.

పద్మావతి చిఱునవ్వునవ్వి "పేష్మనీ! ఇఁక మిగిలిననాయాయు శ్శేషమంతయును సప్తగ్రామమునందే గడపివేయుదును. ఇక్కడఁ బ్రతిముహూర్తమందు నేసుఖము ననుభవించుచుంటినో, అసుఖము లోసహస్రాంశమైన నాగ్రాచక్రవర్తి యంతఃపురమం దనేకదాసదాసీ

జనసేవితనయ్యును అనుభవింపఁజాలను. పేష్మనీ! ఇంద్రియ సుఖభోగముల యనుభవ మెంతవఱకు లభియించునో, దానిలో నణుమాత్రమును నాకు లభియింపలేదు. పాపసముద్ర మందెంతవఱకు మునిఁగిన దానియడుగు ముట్టఁగలనో నేనంతవఱకును పోయియుంటిని. ఇఁక నీ పాపమునకుఁ బ్రాయశ్చిత్తమే లేదు. ఈపాపమునుండి తరించుటకిఁక నాకేయుపాయమును లేదు. పేష్మనీ నీవు తెలిసికొనలేవు—నాహృదయమందు ఒక్కొక్కమాఱు వేయాఱు తేళ్లు గుట్టినట్లగుచున్నది. అనుతాపానలమున నాహృదయము కాలిపోవుచున్నది. అది యంతయును జెల్లిపోయినది. ఇప్పుడు శాంతికొఱకు భిక్షుకురాలనై వచ్చియుంటిని. పేష్మనీ! విశ్రాంతియెఱుంగని పాపపంకిలమున నామనసు, బుద్ధి, దేహము, ప్రాణము— అన్నియు మాసిపోయినవి. నేను వానిని తెలిసికొనవలయునని కోరిక గలిగియుంటిని'' అనియెను.

''భర్తయే పరమదైవము'' అనుదానినెట్లు తెలిసికొనగలరు! పేష్మనియు మఱియేమి చెప్పుటకును ధైర్యము లేనిదయ్యెను. అప్పుడు పద్మావతి ''పేష్మనీ! వదినెగారిని చూచుట కింకను సమయము కాలేదాయేమి?'' అని యడిగెను.

''సమయమైనది—ఇప్పుడు పోయినను పోవచ్చును.''

పద్మావతి లేచెను. ఆమె మనసున కేమియో తోఁచెను. కొంచెముసేపాలోచించి ''పేష్మనీ! ఒకచీరను దీసికొని రమ్ము'' అనియెను.

పేష్మనియు నాజ్ఞాప్రకారము చేసెను. పద్మావతి సుందరమైన విజాతీయ వస్త్రములను వదలివైచి వంగదేశ వస్త్రములను ధరియించెను. పేష్మనింగూర్చి ''నేనిప్పు డెట్లున్నాను? ఆపాదమస్తులను ధరియించి యెంతచెడ్డదానివలె నున్నాను?'' అనియెను.

పద్మావతియు, పేష్మని బాగుగాలేదని చెప్పినమాటలనమ్మక యొక నిలువుటద్దమునకెదురుగఁ బోయి నిలిచి తనరూపమును జూచి కొనియెను. ఆమెముఖకాంతి చాలగంభీరముగ నుండెను. ఆమెదారుణమైనవిచారములలో మునిఁగిపోయెను. కొంచెమునే పైనతరువాత నిట్టూర్పువిడిచి "సాయంకాలమైనది నడువుము" అని చెప్పెను.

ఇద్దఱును లేచిరి. పేష్మని కాలికి జోడు తొడిగికొనలేదు—అట్లే నడువు" మని చెప్పెను.

పద్మావతి నవ్వి "ఇఁక నాకాలము పోయినది. ఇప్పుడెంతయు నుమారినది" అనియెను.

ఇద్దఱును గృహమునుండి బయలుదేరిరి.

---

## నాల్గవ ప్రకరణము

"రోగ శోక పరీతాప బంధన వ్యసనాని చ
ఆత్మాపరాధవృక్షస్య ఫలా న్యేతాని దేహినాం"

(హితోపదేశము.)

శ్యామసుందరి సంధ్యాసమయమందు మేడమీఁది భాగము నందుఁ దిరుగాడుచుఁ బ్రీతిదాయకమైన వసంతసంధ్యా సమీరమును సేవించునప్పుడు క్రింద నిద్దఱు సుందరు లింటిలోఁ బ్రవేశించుటను చూచెను. అప్పుడు పద్మావతి జ్ఞాపకమునకు వచ్చెను. వేగముగా మేడ దిగివచ్చి చూడఁగా నిజముగాఁ బద్మావతియే వచ్చియుండెను.

ప్రథమ దర్శన మాత్రముననే యిరువురి హృదయములు నానంద రసపరిప్లుతము లయ్యెను. ఆనంద ముద్దీపించుటవలన వారిద్దఱును మాటలాడలేక పోయిరి. ఎవరి నోటినుండియు నొక్క మాట

యును బయలు వెడలలేదు. కన్నులు మనస్సుయొక్క యస్థిరత్వ మును ప్రకటింపఁ జేయుచుండెను. ఇద్దఱి కన్నులనుండియు నశ్రు ధారలు గురియ నారంభించెను. రోదనము శోకముయొక్క చిహ్న మని యందఱును చెప్పుదురు. కాని, యీ రోదన మట్టిదికాదు. ఇది యానందసూచకమైనది. దీని ప్రతిచిహ్నమును అశ్రుబిందువుల నడుమ నానందలీలను ప్రకటించుచుండెను. ఇది యంతయు నానంద మయమై యుండెను.

క్రమక్రమముగా హృదయావేగము మందగించుచుండెను. ఇద్దఱును గూర్చుండిరి. శ్యామసుందరి పరీక్షించి చూచెను. పద్మావతి యొక్క యసమానసౌందర్యము కొంచెమైనను కొఱవడియుండలేదు. ఆమె యౌవనముతోఁ గూడ శరీర సౌందర్యమును వృద్ధిపొంది యుండెను. అంతే కాదు. దేహావయవములు సంపూర్ణావస్థను పొంది యున్న కారణముచేత నామె యనుపమాన రూపరాశియు మఱింత వర్ధిల్లుచుండెను.

క్రమముగా నానందోల్లాసములు తక్కువ యగుచుండెను. అప్పుడు పద్మావతికి భావాంతరము కలిగినది. ఆమె ముఖమండల మందు ఆనందరసమింకి పోవుచుండెను. ఆమె తిరిగి యేడువఁ దొడఁ గెను. ఇది యానందదుఃఖము కాదు. హృదయమునం దుదయించిన యాతనా దుఃఖమైయుండెను. పద్మావతి చాలకాలమునకుఁ దరువాత దిరిగి తన భర్త భవనమును జూడఁగలిగెను. అదృష్ట మామెవిషయ మున వక్రించియే యుండకపోయినయెడలఁ దన భర్తయొక్క యీ భవనమందామె సమాహితయై యుండివలసినదే. ఆమె గౌరవ మున కెక్కడను లోపము లేకుండ నుండియుండును. ఆమె భర్తగాని వదినెగాని, లేక యింటియందలి యితర జనముగాని యామెతో మాటలాడుటకు సందేహించి యుండరు. స్వధర్మమునందే యుండి

స్వామి సేవయే సేయుచుండినయెడల నామె హృదయమం గెట్టి సుఖముంనుట శటస్థించునో అది యంతయు నీ దినమున నామె మన సునకుఁ దట్టెను. ఈ సుఖములు కన్నిటికిని మాఱుగ నామె మొదట క్షణికమై తాత్కాలిక మనోహరమైన యెటువంటి సుఖము ననుభ వించినదో అదియంతయుఁ దలంపునకుఁ దెచ్చికొనియెను. ఈ రెంటి తారతమ్యమును ఆమె చాల దినములక్రిందటనే తెలిసికొనియుం డెను. ఈ సందర్భమందదియంతయుఁ దిరిగి సంపూర్ణమై హృదయ మున నిండియుండెను. అప్పు డామె యసహ్యమగు యాతన నను భవింప నారంభించెను. యాతననుస్వల్పముగ నుపశమింప జేసికొను టకై పద్మావతి చీరచెఱగుచే మొగమునుగప్పికొనియధోముఖయైచాల సేపేడ్చెను.

కొంతసేపైనతరువాత నిరువురును మాటాడ నారంభించిరి. ఆమాటలకు లెక్కలేదు. శ్యామసుందరి పద్మావతి యున్నస్థలము గుర్తు తెలియకపోవుటవలనఁదనయన్న కెట్లుండునో యది యంతయు జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనియెను. పద్మావతియొకటిరెండుసమాచారము లుదక్క మిగిలినతనవృత్తాంత మంతయును వర్ణించి చెప్పెను. శ్యామ సుందరి 'నీవిన్ని దినము లిక్కడ నుండి నాకు సమాచారమును పంప వద్దటే!'' అనియెను.

పద్మావతిసిట్లనుచ్చువిడిచి'' నిన్నుఁజూచుటకుఁగాని, లేక సమా చారమంపుటకుఁగానినాకేమియును నిష్టములేదు. కాని నేనేమొగము పెట్టికొనిపంపుదును? నావంటి నిర్భాగ్యురా లింకొకతె యీభూమిపై నున్నదా? తుదకు నావలననైన మీవిచారమునుగురించి జనులు చెప్పికొన నారంభింతురనుభయముచే నిన్నిదినములునుమీకు నేనగ పడలేదు. సమాచారముకూడఁ బంపమానితిని. కాని యింతకాలము నొకయూరియందే యుంటినా చెప్పు! అందుమీఁదయోచించిచూచితిని.

అదృష్టదినములు తిరిగిపోవునని యోచించితుదకునీకు సమాచారమం పితిని. నీవేదిమంచిదని చెప్పెదవో యట్లుచేయుదును'' అని చెప్పెను.

శ్యామసుందరినిట్టు ల్పువిడిచెను.

పద్మావతితిరిగి చెప్పఁదొడఁగెను—సమాచారమునుపంపుటకు మఱియొక విశేషకారణమేమనఁగా—మీయొద్దకు సమాచారమం పినను మీరునన్ను పేక్షింతురు—నేనుమీయొద్దకు వచ్చినను మీరు మాటలాడరు—నేను మీయింటికివచ్చి నందులకు మీరందఱును లజ్జింతురు—ఈమొదలైన భయసందేహములవలన మీకు సమా చారమును పంపకూఱకుంటిని. అనంతరసమాచారమును తెలిపినయె డల దోషమని తలంచితిని. మీరుపేక్షించినప్పటికిని, మీరు మాట లాడకపోయినను ఈపాపినైన నాయొక్క అసంఖ్యాకమయిన పాపము లకు,దగినశిక్ష యైనదని తెలిపికొనవలయుననుకొంటిని. తిరిగినేనుమీ యింటికి వచ్చినను మునుపటివలెనే నన్నుఁ బరిత్యజింతురు. నాభ ర్తృగృహమందు స్వామితోఁగూడి మాటలాడుటయును లేకపోవు ను—నేనంటరానిదాసినై యుండవలయును—ఇదియంతయు నైన యెడల వచ్చినఫలమేమని యనుకొంటిని. ఇప్పుడు మనస్సునందు ఈ పాపపూరితమయిన ప్రాణమునింకనిలువనీయఁగూడదని నిష్కర్ష చేసి కొంటిని. ప్రాణముతో నున్నయెడల నేమిసుఖమో అదియంతయు ననుభవించితిని. స్వామిచరణసేవ దొరకుటకంటె నాఁడుదాని కింక వేఱుసుఖము లేదని బాగుగఁ దెలిసికొన్నదాననైతిని. ఆయాశకునీళ్లు వదలుకొన్నయెడల నింకప్రాణములతోనే నుండిన ఫలమేమి? చచ్చు టకు ముందు నిన్నుఁజూచి మఱిపోవలయునని మనసుపడితిని. నిన్ను విశేషముగఁ బ్రేమించుచుండుదానను. నిన్నుఁ జూడవలయుననియాశ యుండెను. అదినేఁడు సఫలమాయెను. చచ్చుటకు నా కింకేమియును తొందరలేదు. కానియింక నొకయాశ యున్నది మరణమునకుఁ బూ

ర్వము స్వామి చరణకమలములను వక్షమునందుఁ జేర్చుకొనవలయు నని—అయిన నాయాశకూడఁ గేవలము దురాశ—'' అని చెప్పి ముందేమి చెప్పవలయుననుకొనియెనో అది యంతయుఁ జెప్పలేకపో యెను. హృదయపుటభేదనంబులగు పద్మావతి మాటలనన్నిటినివినిన శ్యామసుందరి సుందరనయనాంచలంబుల నశ్రుబిందువులు మెఱయు చుండెను. ఆమెదీర్ఘనిశ్వాసమును విడిచి "కావలసినదంతయునైనది. అదృష్టమట్లున్నది. వదినే! ఇంక దానికొఱకను తాపమును జెందకుము. చావవలయునంటివా? చచ్చినయెడలఁ బాపమునుండి విముక్తురాలవగు దువా? ఆత్మహత్యచేసికొనుటమఱింత పాపము. దేవుఁడునీకేమిబుద్ధిపు ట్టించెనో అంతపనిజరిగినది. దానివలననైన పాపముతోడిలోఁ బెట్టుకొ నియెంటివిగదా! వచ్చినవాడుచచ్చిననుపోదు. అట్లగుటవలననిఁక ప్రాణ ములనువిడుచుటవలనఁ బ్రయోజనమేమి? ఇంకనున్న కాలమంతయును బాగుగ గడపిన యెడల నది యెంత మంచిది ? ఇంక పాపస్పర్శము కాకుండ మాత్రము చూచుకొనుము. నా యభిప్రాయ మేమనఁగా ఇప్పుడు నీవు సప్తగ్రామమందున్నట్లే యుండుము. ఇఁక అగ్రాకుగాని మఱియొక చోటికిఁగాని పోవకుము. దీని వలన మఱియేమి కాకపోయి నప్పటికి నొక్కొక్కసారి మాత్రము చూచుకొని మనస్సున కెంతో హర్షమును తెచ్చుకొనవచ్చును.'' అని చెప్పెను.

పద్మావతి చాలసేపు అట్లే చింతించుచు, తరువాత "వదినే ! ఇంక సంతకంటె మఱేమి చేయవలయును. మఱి యే యుపాయమును లేదు. నా యదృష్ట మందింతకంటె నతిశయ మేమున్నది ? '' అనియెను.

ఈ సమయమందు పేష్మని "రాత్రి చాలనైనది'' అనియెను. పద్మావతి మా మాటను విని శ్యామసుందరి వంకఁ జూచెను.

"నిజము ! చాలరాత్రియైనది. అయినను నిన్ను వదలియుండుటకు మనసొప్పకున్నయది" అని శ్యామసుందరి పలికెను.

"నిన్ను చూచితిని. సప్తగ్రామము నింక విడువను. ఇంతటి నుండి నిత్యమునువచ్చి చూచికొనుచుఁ గాలక్షేపమును చేయుదును"

అని పద్మావతి కంటఁ దడివెట్టుకొని పోయివచ్చెదనని యాజ్ఞను వేఁడుకొనియెను. శ్యామసుందరి "యత్నము లేనిదే జరుగదు" అనియెను.

పద్మావతితోఁ గూడ పేష్మనియు బయలుదేఱెను. మఱియే పరిచారికలును రాలేదు. అందువలన శ్యామసుందరి తన పరిచారిక నొకతెను వారితోఁ గూడఁ బోయిరమ్మం యాజ్ఞాపించెను.

పద్మావతి కిష్టముండెనేని దాసదాసీజనమును, యానాదులను గూడఁ దీసికొని రాఁగలదు. కాని యామె కాబాహ్యాడంబరముల యందిఁక నిష్టము లేదు. ఇప్పు డామె తాను సామాన్య గృహస్థుని పత్నినని తెలిసికొని యందులకుఁ దగినట్లుండుటకై యభ్యాసము చేసికొనుచుండెను.

రాత్రి పది గంటలయ్యెను. జగమంతయుఁ బరిపూర్ణ జ్యోత్స్నామయమయి ప్రకృతిశాంతమయి నిశ్శబ్దమయి యుండెను. అంతటను గాంభీర్యము విరాజమానమగుచుండెను. ఈ సమయమందు పద్మావతి స్వామిభవనమునుండి బయలుదేఱెను. శ్యామసుందరి యామె కంటికగపడునటకు చూచుచు తరువాత నేమో యోచించుకొనుచు నింటిలోనికిఁ బోయెను.

---

## ఐదవ ప్రకరణము

### తర్కవితర్కములు.

"Jela plains jela balme et je suis sou appui." *

Voltair

సప్తగ్రామముయొక్క యంగడివీధికి సమీపమున నొకవిశాల ప్రదేశముకలదు. అదియంతయును పచ్చనిపచ్చికతో మనోహరముగ నుండెను. అక్కడక్కడ నొక్కొక్క చింతచెట్టును, ఒకొక్క రావి చెట్టును, ఒక్కొక్క మఱ్ఱిచెట్టును గలవు. ఈ ప్రాంతమునకు చివర భాగమున నిద్దఱుయువకులు కలిసి తిరుగాడుచుండిరి. అందొకడు మనకుఁ బరిచయుఁడైన-నవకుమారుఁడే. మఱియొకఁడు నవకుమారునకుఁ బ్రాణప్రియుఁడైన ఉమాపతి చక్రవర్తి. నవకుమారుని యొక్కవిపత్తునందును సంపత్తునందును ఉమాపతి పరామర్శించు చుసమస్తకార్యములును నెఱవేర్చుచుండును. ఉమాపతియొక్కఁడే యాతనిస్నేహమును విడువనివాఁడు. ఇద్దఱిస్వభావమునొక్కటియే ఇద్దఱు నొకేవిధమయిన గుణములను గలిగియుండిరి. ఇద్దఱును సరళస్వభావులు. ఇద్దఱును వివిధగుణసంపన్నులును విద్వాంసులునై యుండిరి. అందువలన వారియొక్క పరస్పరప్రేమము దృఢపడుట యేమివిచిత్రము? ఉమాపతి నివాసమును సప్తగ్రామమే. బాల్య మందే యాతనితండ్రి చనిపోయెను. అతని పిత్రార్జితసంబంధమయిన యాస్తివలన సంసారము సుఖముగాగడుపుకొనుచుండెను. బాల్యము నుండియు నాతనికి విద్యయందు విశేషానురాగము కలదు. అందు చేతఁ దండ్రి లేకపోయినను అతఁడు విద్యావ్యాసంగమునకు వ్యతిరేక ముగనుండుటలేదు. ఉమాపతి కిరువదియైదు సంవత్సరముల వయసు

* I pity her, I blame her, and am her support.

కంటె హెచ్చులేదు. ఈ చిన్నవయసునం దాతఁడు యథేచ్ఛముగ జ్ఞానమును సంపాదించియుండెను. అతఁడును నవకుమారుఁడును సహాధ్యాయులుగానున్నప్పటినుండియు స్నేహితులుగా నుండిరి.

ఉమాపతి చూచుటకు మిగుల సుందరుఁడయినవాఁడు. అతని యొక్క నీలమేఘవర్ణముగల కుంతలములును, ప్రశాంతసుందరవదన మండలమును, విశాలనేత్రములును, లలితచంపకకుసుమసదృశంబగు దేహచ్ఛాయయును, అమనోహర సౌందర్యమును ప్రకటించుచుండెను.

నవకుమారుఁడు సముద్రయానము చేసి వెనుకకుఁ దిరిగి వచ్చుచున్నప్పుడరణ్యమునందు దిగి యొకరహస్యప్రదేశమందొక కాపాలికుని చూచుటయును, కపాలకుండలవలన నవకుమారుఁడు రక్షింపఁబడుటయును, తోడనే యామెను వివాహమాడుటయును, భార్యాసమేతుఁడై పోవుచు మార్గమందున్న యొకపల్లెయందు అపరిచితురాలైన ఉత్ఫుల్లనిసాను చూచుటయును, ఉత్ఫుల్లనిసా సప్తగ్రామమునకు వచ్చుటయును, ఆమెకును నవకుమారునకును గలసంబంధమును కాపాలికుఁడు వచ్చుటయును, అతనిప్రేరణముచేతను, పద్మావతికౌశలముచేతను నవకుమారునకు కపాలకుండల ప్రవర్తనవిషయమునఁ గలిగినయనుమానమును, ఆయనుమానము నివారణమయినతోడనే ఆకస్మికముగా గంగాప్రవాహమునంబడిన కపాలకుండల యకాలమరణమును మొదలైనవిచారములన్నియు నుమాపతికిఁ దెలిసియేయుండెను. అతఁడు నవకుమారునియవస్థనుగూర్చి చింతించి విశేషమయిన దుఃఖముకలవాఁడయ్యెను. శోకముచేత వికలమయియున్న నవకుమారునిచిత్తమును పదిలపఱచుటకు ఉమాపతి సర్వదా ప్రేరేపించుచు హెచ్చరించుచుండెను. అయినను ఆబోధనములన్నియు వ్యర్థములగుచుండెను. నవకుమారుని హృదయము మృణ్మయితోనే గంగాగర్భమున విడువఁబడియుండెను. అతనికి హృదయశూన్యమయిన దేహము

మాత్రము మిగిలియుండెను. అట్టి దేహమం దుపదేశబీజమును నాటిన యెడల నది యంకురించుననునాశ యెక్కడిది? ఈసంగతి ఉమాపతికి తెలియును. అయినను చాలకాలము బోధించినయెడల నుపకారము కలుగునని యోచించి యాతడుపదేశించుటలో విసుగుజెందుటలేదు. తిరుగ వివాహమయి గృహస్థుడవుకావలయుననియాతడునవకుమా రుని ననేకములగు యుక్తులచే బలవంతపఱచుచుండెను. కాని యింత వఱకు నాతని ప్రయత్నములు ఫలింపలేదు.

నేడు నవకుమారుడు గంగాతీరమునందు పద్మావతిని జూచి తినని ఉమాపతికి వివరముగాఁజెప్పెను. ఆమెతోను తనకును నడచిన సంభాషణమును కూడ సవిస్తరముగఁ దెలియపఱచెను, తన యింటికి పద్మావతి వచ్చుటయును, ఆమె శ్యామసుందరితోనాడినమాటలును, ఆమె యభిప్రాయము మొదలైన సంగతులను శ్యామసుందరి వలన తానెట్లువినెనో అవియన్నియును యథార్థముగ నుమాపతికిఁ దెలియ పఱచెను. ఉమాపతి చాలసేపు యోచించి తరువాత 'నవకుమారా! పద్మావతి మనోభావమును తెలిసికొంటివా? పద్మావతి మొదట కేవల మసతియైనను ఇప్పుడామె మనసు సంపూర్ణముగ పరిశుద్ధమై యున్నది, అట్టి నిశ్చయమునందు నాకులేశము నుసందేహము లేదు' అనియెను.

నవకుమారుడు నేను నట్లే సిద్ధాంతము చేసికొంటిని. పద్మావతి మనసిప్పుడు శుద్ధమై మార్పును చెందియుండెను, పూర్వమునం దది చేసిన పాపకార్యము లత్యంత హేయములైనవవి యిప్పుడు దాని యనుభవమునకు వచ్చియున్నవి. ఆపాపములకుఁ బ్రాయశ్చిత్తము చేసికొనుట కది సిద్ధముగా నుండెను. ధర్మమును వేడుకొనుచున్నది, పతి పాదభిక్షమును వేడుకొనుచున్నది. ఇందుకొఱకది యాగ్రాయందలి రాజభోగములను త్యజించినది. దాని మానసికావస్థను యోచించి చూచినయెడల దయగలుగుటమాత్రము నిజము. కాని ఒక

కారణముచేత పద్మావతి నాకన్నులకు శూలమువలె నున్నది. పద్మావతియే మృణ్మయి యకాలమృత్యువునకు కారణమైనది. అది బ్రాహ్మణవేషమును ధరించి మృణ్మయి యసతీత్వసంబంధమును గూర్చి లేనిపోనియనుమానమును కలిగించినది. అది యట్లు చేయకపోయిన యెడల నీదుర్దశలన్నియునుసంభవింపవుగదా! అదేమో! యాకాపాలికునికితో దురాలోచనము చేసి యీ యశుభమును తెచ్చి పెట్టినది. అన్నా! నీవు ఇదియంతయు నెఱుంగుదువు. నాహృదయమం దావృత్తాంతము శల్యమై బాధించు చున్నది'' అనియెను.

ఉమాపతి ''నీవు చెప్పినదంత యునసత్యము. పద్మావతి యీ విషయమున నపరాధినియే. సరే! అందులకు నేనొప్పుకొంటిని. కాని యోచించి చూడుము! ఎవ్వరియపరాధమధికము! నీచిత్తభ్రమణమే యీదుర్ఘటనమునకు ప్రధానకారణము కాదా! కాపాలికుఁడొసంగిన మద్యమును సేవించుటచే నీ కజ్ఞానము కలిగి హితాహితవివేకశక్తి పోయినది. కాపాలికుని నీవునీయిష్టదైవముగా భావింపనారంభించితివి. ఆతనిమాట దేవవచనమని నమ్మితివి. ఆతఁడు చెప్పినదంతయు నీవు చేసితివి. ఆతఁడు మృణ్మయి దుశ్చరిత్రయనియు, ఆబ్రాహ్మణునియం దు ప్రేమగలిగియున్నదనియు చెప్పెను. నీవు దానిని నమ్మితివి. నీవు మృణ్మయి నింక నింటికి నీతోఁ దీసికొని పోవద్దని కూడ నాతఁడు చెప్పెను. అందులకు నీవంగీకరించితివి. ఇప్పుడు యోచించి చూడుము. ఎవరి యపరాధ మధికమో! యిప్పుడు నీవు యోచించి చూడుము! చెప్పుము! చూతము!—కాపాలికుఁడు—బ్రాహ్మణవేషమును ధరించిన పద్మావతి—వీరిద్దఱిలో నెవ్వరియపరాధ మధికమైనది? నీవు మృణ్మయి నేమియు నడిగి తెలిసికొనవైతివి. మృణ్మయియొక్క దోషము నిజముయినదా కాదా యని నీవు ఆలోచింపలేదు. తుదకు నీవు యోచించి నీసందేహము తీర్చికొనినవెనుక విధాత మృణ్మయినిల మొజన్మ

శ్లేశమునుండియు దారుణాపవాదము మొదలగు వానినుండియు తప్పించుటకొఱకు దయాపూర్వకముగ నెత్తికొనిపోయెను. మృణ్మయివిధివిధానముచే గంగాజలములోఁ గలసిపోయెను. అప్పటికినీకు సురాపానమత్తతయును దొలగినది. అప్పుడు నీకు తెలివి వచ్చినది—నీవు "హా! మృణ్మయీ!" అని యఱచుచు నీటియందు దుమికితివి— కాని చేయి జాఱినతరువాత నేమిచేసిన నేమిప్రయోజనము? నీకు మృణ్మయి యెట్లులభియించును? ప్రవహించుచున్న గంగానదిలోఁ బడిపోయిన యబల నుద్ధరించుట యసంభవముకాదా? కాపాలికుఁడు ప్రయత్నించి నీటినుండి నిన్ను బయటికిఁ దీసెను. నీవప్పుడు "మృణ్మయీ మృణ్మయీ!" అని పలవించుచు విలపింపనారంభించితివి. ఆవిలాపము వలన నేమిలాభము? ఇప్పుడు యోచించి చూడుము! పవిత్రమైన మృణ్మయీ మరణవిషయమున పద్మావతి యపరాధ మెంతయల్పమైయున్నదో చెప్పుము! పద్మావతి తిరిగి తనభర్తనుపొందు మార్గమును జూచికొనుచుండెను. ఆమార్గమందు మృణ్మయి ప్రధానమైన కంటకమైయుండెను. ఎట్లైనను జేసి మృణ్మయిని భర్తృప్రేమమునుండి వంచించినయెడల నామె యుద్దేశము సిద్ధించునను సిద్ధింపవచ్చునని యనుకొనెను. అప్పుడామె మృణ్మయి మరియొక వేటగానికి గుఱియైయున్నదని తెలిసికొనియెను. ఆవేటగాఁడు కాపాలికుఁడే. పద్మావతి వాని యొద్దకుఁ బోయెను. పద్మావతి ఘోరతరమైన దుశ్చరిత్రముకలదియో అందునను సందేహము లేదు. అయినను ఆమె యూఁడుది ఒకసారిగా మృణ్మయి జీవనమును హరించి తీరవలయునని పద్మావతి యభిప్రాయము కాదని తోఁచుచున్నది. మృణ్మయిని భర్తృప్రేమనుండి వంచించి విడిచి పెట్టుటకు మాత్రమే పద్మావతి యభిప్రాయము ఉండియుండునని ఖండితముగాఁ జెప్పవచ్చును. నీకెట్లుతోఁచుచున్నది?' అనియెను

నవకుమారుఁడు ఈమాటలన్నియును మనసుంచి వినియెను. ఆతఁడు చమకితుఁడయ్యెను. ఆతనికి భ్రాంతిమూలమైన సంసారమహి తమయ్యెను. ఆతఁడు దీర్ఘనిశ్వాసము విడిచి 'ఉమాపతీ! నీవు నిజము చెప్పితివి. ఈవిషయమందు పద్మావతి దోష మతిస్వల్పము. దోషము లేదని చెప్పినను చెప్పవచ్చును. నేను దానిమీఁద నన్యాయముగా దో షారోపణములు జేసితిని నేనే పాపిని—పద్మావతి కాదు. పద్మావతి తన యుద్దేశమును సాధించుకొనుటకుఁ బ్రయత్నము చేసెను. ప్రపం చమందుఁ దమయభీష్టసిద్ధికొఱ కెవ్వరు ప్రయత్నింపకుందురు? నాపాప మునకు బరిమితిలేదు. దానికిఁ దగిన ప్రాయశ్చిత్త మేమున్నది? నాకు నరకమునందుఁ గూడ స్థలములేదు.'' అనియెను.

ఉమాపతి నవకుమారుఁ డత్యంతశోకాకులితచిత్తుఁడై యున్న ట్లుకనిపెట్టెను. అందుకొఱకాతని కావిచారమునందు విశేషాలోచన మున కవకాశ మీయకయే ''నవకుమారా! పద్మావతి నిజమయిన యపరాధిని కాదని నీకు దెలియును—విధాత యామె నిప్పుడు అను తాపానలమునందుఁ గాల్చుచున్నాడు. ఆమె హృదయమునకు విషస ర్పములు కఱచి బాధించుచున్నవి. ఈయాతనకు పారములేదు. ఆమె కీజన్మమం దేదైన స్వల్పశాంతి కావలయునేని అందునకు నీవొక్కఁడ వే కారకుఁడవు—పతిలాభమే ఆమె ముఖ్యాభిప్రాయమయి యుండును ఆకారణమున నామె యవస్థను గూర్చి యించుక యోచింపవలసి యుండును. ఆమె విపులదుఃఖభారమును కొంచెమయినఁ దగ్గించుట కేదైన నొక యుపాయమే యున్నయెడల దానిని నెఱవేర్చుట నీకు గర్తవ్యము కాదా? అనియెను.

నవకుమారుఁడు ''ఉమాపతి! నేను దానిని తెలిసికొంటిని. అయినను ఆప్రతీకారమున కుపాయ మేదియో నాకుఁ దెలియలేదు. నే నామె పాపముల నన్నిటిని క్షమించుటకు సిద్ధముగా నున్నాడను.

దానియపవాదములు నన్నిటిని నేనును నీవును మఱచిన మఱవవచ్చును కాని జనులు మఱచిపోవుదురా? అది యవని మ్లేచ్ఛ; ఆచార భ్రష్ట దుశ్చరిత్ర ఇతరు లిది యంతయు నిష్ఫలము క్షమింతురా? లోకము నెట్లు మూయఁగలము? పద్మావతి కొఱకు ఆత్మీయులను, సబంధులను, బాంధవులను, స్వజాతీయులను, విడుచుట మంచిదని నీవు చెప్పఁగలవా?' అనియెను.

ఉమాపతి "అది నిజము అయినను శ్యామసుందరినంగీకరింపఁ జేయుట కష్టములోనిది కాదు. నీవు పద్మావతిని పత్నిగా నాదరించి పదింబదిగ నెంమొవచ్చి నిన్ను చూచుటకు మాత్ర మవకాశ మిచ్చితివేని, ఆమె తరించును, చరితార్థయగును. ఇదే యామె యాశ యని తోఁచుటలేదా? ఇదే శ్యామసుందరి యిష్టమయి యుండును. అట్లు చేసినయెడల నేమియును గొఱంత యుండదు. పద్మావతి యిప్పుడే యింట నున్నదో యాయింటనే యుండనిమ్ము" అనియెను.

---

ఆఱవ ప్రకరణము

సిద్ధసంకల్పము

> "Live while ye may, yet happy pair; enjoy
> Short pleasures, for long woes are to succeed."
>
> Milton.

ఈసమీపమున మనోహరముగఁ గానవచ్చుచున్న సౌధమును పాఠకమహాశయులిదివఱకే బాగుగ నెఱిఁగియుందురు. అందే పద్మావతి వాసముచేయుచున్నది. దానిలో నొక గదియందు, ఇప్పుడొక యౌవనుఁడు మంచముమీఁద గూర్చుండి యుండెను. సౌందర్యవతి యగు యువతి యొకతె యాయౌవనుని రెండుపాదములమీఁదఁ దన

వదనమండలమును జేర్చి కన్నీటిధార ప్రవహింపఁ జేయుచుండెను. అయువతీయువకులిద్దఱును పద్మావతీనవకుమారులని వేఱ చెప్పవలసిన పనిలేదు.

నవకుమారుఁడు పద్మావతిచేయిఁబట్టుకొని లేవఁదీసి తనపార్శ్వమునఁ గూర్చుండఁబెట్టికొనియెను. పద్మావతికి దుఃఖము పొరలిపొరలి వచ్చుచుండెను. పద్మావతి తన కరపల్లవములచే ముఖమును మూసికొని యేడువఁ దొడఁగెను. అశ్రుబిందువులు ముక్తాఫలములవలె, మృణాళములనిందించు నామె బాహువల్లరులమీఁదుగ పొరలిపొరలి వచ్చి జారిపడుచుండెను.

నవకుమారుఁడు "పద్మా! వృథారోదన మేమి ప్రయోజనము? చేయిజారినపిమ్మట యోచించుట యనర్థమునకుఁ గారణము. ఇప్పు డున్నస్థితినిబట్టి యుపాయమేదైనఁ జూచికొనవలయును. ఇఁకముందు జీవితకాలము నెట్లు సుఖముగా గడుపవలయునో అట్టిప్రయత్నమును జేయుము" అనియెను.

పద్మావతి యేడ్చుట మాని "నాథా! ఉపాయానుపాయము లన్నియు నీచేతిలో నున్నవి. ఈదాసినైన నాజీవనము నీపాదముల కర్పించియుంటిని. ఇష్టమున్నయెడలనుంచికొనుము. ఇష్టములేనియెడలఁ ద్రోసివేయుము. దానివలన నాకేమియును విచారములేదు. పాపభూయిష్ఠమైన యీజీవనమునం దొక దినమునందైన పతిపాదములను సేవింపవలయుననునాసయుండెను. ఆయాశ యీదినమున ఫలియించినది. ఇంకఁ బ్రాణములమీఁద నాశయునులేదు. మరణమన్న భయమును లేదు. ఇప్పుడు నాకు మరణమేయున్నయెడల సంతోషపూర్వకముగ మరణించెదను. ఎందుల కేడ్చెదవని యడిగెదవేని చెప్పెద వినుము. నాథా! ఈదినము నీపాదపద్మములసన్నిధిని పడి యెట్టి సుఖమును బొందియుంటినో, ఈ నాయాయుష్కాలమం దట్టిసుఖమును నే

ననుభవించియుండలేదు. అంతటను సర్వసుఖములకంటెను శ్రేష్ఠతర మయినసుఖమని దేనిని చెప్పుదునో నేనట్టి సుఖేచ్ఛకులోనై అధికతర మయిన పాపపంకములోఁ బడిపోయితిని. పతిపదసాన్నిధ్యమును బొం దినసతిసుఖముతోఁ బోల్చి చూచినయెడల నాసుఖము లన్నియు నెంత యసహ్యాకరములుగా నుండును! ఎంతనికృష్టములుగా నుండును! జీవితేశ్వరా! నేను అసహ్యాకరమయిన సుఖేచ్ఛకులోనై ప్రధానజీవ నకాలమంతయుఁ గడపినైచితిని. అందువలన నిహలోకమందును బర లోకమందును గలసుఖమును బోఁగొట్టుకొని ఉభయభ్రష్టనైతిని. నే నిదియే తలంచుకొనిదుఃఖించుచుంటిని. నేనీపాపభూయిష్ఠమగు దేహ మును, త్యజించివైచెదను. ఏయాశచేత నింతవఱకుశరీరమును నిలిపి కొనియుంటినో యాయాశతీరిపోయినది. నాకు మఱియేయాశయును లేదు. నీవీదినమున నాపైఁ గనబఱిచినయనుగ్రహమునకు సంతుష్టు రాలనైతిని. ఇంతకంటె హెచ్చుదయనుగోరను'' అనియెను.

పద్మావతి యిట్లుచెప్పి మఱిమాటాడలేదు. ఆహ్లాదముచేతను శోకముచేతను,సంక్షోభముచేతను, మనస్తాపముచేతను, అనుతాపము చేతను, దానిమనమునందొకభావచండమారుతము రేఁగి విసరనారం భించెను. ఒక్కమాఱుగ వేలువేలుభావములు మనసునందాధిపత్య ము సేయుచుండ సహించియుండుట యెంతసామర్థ్యముగల వివేకికై నను సాధ్యముకాదు. ఒకసామాన్యస్త్రీ తానెట్లు సహింపఁగలదు. పద్మావతికి నోటమాటరాలేదు. తల తిరుగుచుండెను. స్థిరముగా నుం డుట కామెప్రయత్నించి చూచెను. కాని సాధ్యముకాలేదు. ఆమె చైతన్యవిహీన యగుచుండెను. మెల్లమెల్లగ చైతన్యవిహీనయైనపద్మా వతి జడప్రాయమగు దేహము నవకుమారునిసామీప్యమునఁ బడిపో యెను. నవకుమారుఁడు పద్మావతిని లేవదీయుటకై చేతులు సాచెను. చూడఁగా పద్మావతి చైతన్యశూన్యయై యుండెను. ఆకస్మికముగా

నిదియొక క్రొత్తవిపత్తు సంభవించినదని తెలిసికొని నవకుమారుఁడు చాల విచారగ్రస్తుఁడై దాసీజనమునుగూర్చి కేకవైచెను. వెంటనే నీటినివిసనకఱ్ఱలను గొనివచ్చి మూర్ఛితయైయున్న పద్మావతికుపచారములు సేయఁదొడంగిరి. నవకుమారుఁడు పద్మావతి తెలివొందుటకనేకప్రయత్నములను జేసెను.

ఎన్నిప్రయత్నములు చేసినను తెలివి వచ్చునట్లు కన్పడలేదు. నవకుమారునికన్నులనుండి యశ్రుబిందువులు పొరలి పొరలి గండస్థలములనుండి ప్రవహింప నారంభించెను. చాలసేపటికి పద్మావతికూపిరి యాడెను. నవకుమారునివదనము వికసించెను. క్రమక్రమముగాఁ బద్మావతికిఁ దెలివిరానారంభించెను. ఆమెపెదవులనుండి రక్తముసంచరించుచుండుట నాతఁడుకనిపెట్టెను. ఎప్పటివలెనామెచెక్కిళులెఱుపెక్కెను. క్రమముగాఁగన్నులమూఁత విడిపోయెను. నవకుమారుఁడుపద్మావతికి తిరిగి తెలివివచ్చుచున్నదని తెలిసికొని యాయానముచేఁ బూర్వాపరములను మఱచిపోయెను. పద్మావతియం దాతనికిఁగల విద్వేష మీసందర్భమునఁ దిరోహిత మయ్యెను. ఆతఁడానందముతోఁ గూడినగద్గదస్వరముతో "ప్రాణేశ్వరీ! నీయపరాధము లన్నియుక్షమియింపఁబడినవి. ప్రియా! నీవు రమణీకులమునకు రత్నమవు. నేను నీకుఁజాల దుఃఖమును గలిగించితిని. సంసారము పోయినఁ బోనిమ్ము! లోకమంతయు నిందించిన నిందింపనిమ్ము! అదృష్టము పోయిన పోనిమ్ము! ఈదినము శుభదినము. పద్మావతీ! నీవు నాపత్నివి. నిన్నింకఁ గష్టములపాలు సేయను" అనియెను.

పద్మావతి కొంచె మూఱడిల్లి దాసీజనమున కాజ్ఞయిచ్చినవసి తమృదుళంబులగు తనబాహువల్లులచే నవకుమారునికంఠమును కౌగిలించుకొని యాతనివక్షస్థలంబున శిరముంచి "నాథా! ఈనిర్భాగ్యురాలి మొగమున కింతసుఖము కలుగునని స్వప్నమందైనను తలఁచుకొన

లేదు. నేను స్వప్నమందుంటినో, లేక భూమిమీఁద నుంటినో కలఁగను చుంటినో, మాయామోహానశక్తిరూపైన నాకన్నుల గప్పివేయుచున్న దో తెలియఁగను''అనియానందముచే నుప్పొంగిపోవుచుఁబలికెను. అప రాధియయ్యును సరళభావముచేఁ దానుచేసిన యపరాధముల నొప్పి కొనక, వానికొఱకు లజ్జింపక, వినీతభావముతో మంచి కార్యములు చేయకయుండెనేని ప్రపంచమునం దాతని దుర్దశ కంతమే లేకయుం డును. ఒక్కనిదోషమును చూచి నష్టము కలిగినను కలుగకపోయి నను, అందఱు నాతనిమీఁద క్రోధమును వహించి విరక్తులగుదురు. అయినను దోషము చేసినవాఁడు లోకనిందలను సహించి, తిరిగి తన మంచినడవడిని కనఁబఱచుచు, పూర్వాపరాధము నొప్పుకొనుచు, వినయభావముతో సంసారయాత్రను నిర్వహించుకొనుచుండెనేని వానిమీఁద కోపమును విరక్తులైన వారుకూడ ననురక్తులగుదురు. జనులు తిరిగి వానిని చూచి రేని యసహ్యతను చూపరు. అతని యప రాధము కాలము గడచినకొలఁది విస్మృతి సాగరమందు మునిఁగి పోవును. అతని సుగుణములచేతఁ గళంకము తొలఁగిపోవును.

పద్మావతీ సంబంధమైన ఘటనయే దీనికి సముచితమైన దృష్టాంతస్థానమై యున్నది. పద్మావతిని చూచుటకూడ నవకుమారు నకు సిగ్గుగా నుండెను, అతఁ డామెను విచారముతోఁ దిరస్కరించు చుండెడివాఁడు. ఆమె ప్రవర్తనమును గూర్చి జ్ఞాపకమునకు వచ్చి నప్పుడు చాల విచారించుచుండెడివాఁడు. కాని, నిరంతరము పద్మా వతి చేయుచున్న పతిపాదచింతనమును పూర్వకృతములగు పాపముల కయి యామె పడుచున్న యతిశయమైన యనుతాపమును, సతీ ధర్మానుష్ఠానముకొఱకు చేసిన సకల సుఖభోగత్యాగమును, ఇవి యన్నియును చూచి నవకుమారుని మనసు తిరిగెను. దానిమీఁద దయ గలిగెను. పద్మావతి నవకుమారుని నత్యంతమును ప్రేమించుచున్న

దని చెప్పుటకు సందేహము లేదు. ప్రేమ నందికొనుటకు ప్రేమయే యావశ్యము. పద్మావతి నవకుమారుని ప్రేమించినయెడల నవకుమారుఁడును ముఖ్యముగా నామెకు ప్రేమ నొసంగవలయును. అతఁడట్లు చేసియుండ లేదా ? నవకుమారుఁడు నిశ్చయముగ నట్లే చేసెను. కాని మఱియొక విధముగాఁ జేసియుండెను. ఆతని హృదయమందు పద్మావతినిగూర్చి తిరస్కార ద్వేషాభిమానాది భావంబు లుదయించె. అవి యన్నియును ప్రేమయొక్క రూపాంతరములయి పోయెను. ప్రణయమే యీ భావములకు బీజము. ఏ సంసర్గమును లేనియొక మనుష్యుని గుణదోషములనుగూర్చి తెలిసికొనుట కెవ్వరు ప్రయత్నింతురు ? ఎవ్వరు మనస్సునకుఁ దెచ్చుకొందురు? అట్లగుటవలన నవకుమారుని ప్రణయము వాని హృదయమునందే యుండెను. ఇతరులు తెలియఁగలవారు కారు.

ప్రియుఁడగువాఁడు మొదట నేనామెను ప్రేమించుచుంటినని మాత్రమే తెలిసికొనును. కాని, దానిపరిమాణ మాతఁడు గ్రహింపఁజాలఁడు. ఒకవేళ నాకస్మికముగా ప్రణయాస్పదమైన యామెతో వియోగము కలిగినను, లేక అట్టిదాని కేదేనొకవిపత్తు సంభవించినను, అప్పుడు హృదయము శోకాకులమై ప్రియురాలిపైనున్న ప్రేమతత్త్వము బయలుపడుచుండును. నేఁడు పద్మావతికి కలిగిన మూర్ఛావస్థవలన నవకుమారుని హృదయమునందు దాఁగియున్న ప్రణయము బయటఁబడియెను.

ఏ నవకుమారుఁడు కొన్నాళ్ళకుముందు పద్మావతిని తిరస్కరించుచుండెనో అట్టి వానిహృదయమును పరిభ్రమణశీలముగల కాలము క్రమముగా నాశ్చర్యకరమగుమార్పునుబొందించెను. ఆకాలముక్రమముగా నాతనితిరస్కారమును దయగను, అశ్రద్ధనుశ్రద్ధగను, పరివర్తింపజేసెను. నవకుమారునకుఁ దెలియకుండగనే యాతనిహృదయ

మూ మెయందు లగ్నమయ్యెను. మరియు—ఇప్పుడా నవకుమారుఁడు పద్మావతికొఱకు విచారించును. ఆమెకొఱకు, ఆత్మీయులను, ఆచారమును, జాతిని, మతభేదమును, కుటుంబమును, బంధుజనమును అన్నిటిని త్యజించుటకు సిద్ధముగా నుండెను. ఆమెనానందముచే నాలింగనముచేసికొనియెను. ఓ కాలమా! నీ వేధన్యవు!

కపాలకుండలా! (మృణ్మయీ?) ఈసమయమందు నీవెక్కడ నున్నావు! అతజలమున మునిఁగిపోయితివా?——చూడలేను——ఒకదినము కాపాలికునిభయంకరఖడ్గమునుండి యెవ్వరిని రక్షించితివో, ఆకృతఘ్నుఁడైనవ్యక్తి యొకసారి నీకుదానముచేసినమనస్సును నిన్నుండిలాగికొని నిరుపాధికమైనదానిని మఱియొకతెకు దానముచేసెను. నవకుమారుఁడు నిజముగాపద్మావతి ప్రణయమునందు ముగ్ధుఁడైపోయికపాలకుండలను మఱచిపోయెనా? లేదు—అట్లుకాదు. సంపూర్ణచంద్రునిచేఁ ప్రకాశించుచున్న నభోమండలమునం దాకస్మికముగ నొకమేఘము ముదయించి క్షణికమాత్రమున జగమంతయు నంధకారముగాఁజేసినైచును కానిప్రపంచమంతయును నంతమాత్రమున చిరకాలమంధకారమయమై పోవునా? అట్లెన్నటికినిగాదు. ఏంతసేపు మేఘముండునో అంతవఱకుమాత్రము ప్రపంచ మంధకారమయమయి యుండును. మబ్బువిడిపోయినపిమ్మటఁదిరిగి ప్రపంచము వెన్నెలచేఁప్రకాశింపఁగలదు. తిరిగి చంద్రుఁడు తారకాగణముతోఁ దనచల్లనికిరణములఁ బ్రసరింపఁజేయుచుండును. మబ్బుగ్రమ్మినంతమాత్రమున చంద్రుఁడుగాని, తారలుగాని నిలిచిపోవునా? అట్లెన్నఁటికిని గాదు. చంద్రుఁడును తారకాగణమును అదృశ్యమయియుండును. నవకుమారుని హృదయాకాశమునందలి యవస్థయునిట్లే యుండెను. అక్కడ మృణ్మయీప్రణయచంద్రిక ప్రశాంతమయియుండెను. పద్మావతీప్రణయము మేఘస్వరూపమయి దాని నావరించెను. ఇది యెంతసేపుండునో అంతసేపుమాత్రము అది

బయలుపడదు. కాని దానిప్రచారమునిలిచిపోదు. అదిమేఘావృతమైన చంద్రరేఖవలె నదృశ్యభావముతోఁ దనకార్యమును చేయుచుండును

నవకుమారుఁడు పద్మావతియు బాహ్యజ్ఞానవిరహితులై భావ సాగరమునఁ దేలియాడుచున్నసమయమున నిట్టిదని నిర్దేశింపరానిశబ్ద మేదియో వారియానందమునకు విఘాతము కలిగించెను. పార్శ్వమందున్నయొకగదియందు ఉమాపతి నవకుమారుని బిలిచినట్లయ్యెను. శబ్దము చెవినిబడగనే పద్మావతి కొంచెము తొలఁగి నవకుమారుని కంఠమును జుట్టుకొనియున్న హస్తములను తీసికొనియెను. ఈసమయమందు పేష్మనివచ్చి "యేదోయొకతొందరపనిమీఁద నెవరో వచ్చి మిమ్ముఁ బిలుచుచున్నారు" అని చెప్పెను.

నవకుమారుఁడు లేచి పద్మావతితో "పోయివచ్చెదను" అని చెప్పెను. పద్మావతియునుపాయాభావముతో నిష్టములేకున్నను "పోవచ్చు"నని చెప్పి నాథా! ఈదాసిని మఱవకుము! ఇదియే మీచరణకమలములకు విన్నవించు ప్రార్థనము" అనియెను.

నవకుమారుఁడుపద్మావతినిసమాధానపఱచి"నన్నుఁబిలిపించినవా రెవ్వరో తెలిసికొనియెదను" అని వెడలిపోయెను.

పద్మావతి సుఖసూర్యమండల ముదయించెనో లేదోగానిఅంతలో మేఘజాలమునఁ బడిపోయెను. ఆమె యతికష్టముచే నేర్చికూర్చినకుసుమమాలిక కంఠమున ధరియింపకుండఁగనే తెగిపోయెను. ఆమె కష్టపడి నిర్మిచుకొన్నయంత్రము కార్యారంభమునందే యేదో లోపముచే నాఁగిపోయినది.

# ఏడవ ప్రకరణము

## నూతన విపత్తు

——"deep troubles toss,
Loud sorrows howl, envenom'd passions bite,
Ravenous calamities our vitals seize,
And threatening fate wide opens to devour."

Young.

నవకుమారుఁడు బయటికి వచ్చిచూడఁగా నుమాపతికాన్పింప లేదు. అక్కడివారి నడిగి యాతఁడు వెడలిపోయెనని తెలిసికొనియెను. నవకుమారుఁడు వ్యాకులచిత్తుఁడై యింటికి వెళ్లెను. అక్కడ ఉమాపతియుండెను. ఆతఁడు విచారముకలవాఁడై యుండుటను జూచి నవకుమారుఁడు ఆవేగముతో అన్నా! ఏమైనది? ఎందులకు నన్నుఁ బిలిచితివి? ఎందులకు నీవు విచారించుచున్నావు?" అని యడిగెను.

ఉమాపతి "నిన్నుఁ బిలుచుటకుఁ గారణమున్నది. చెప్పెదను నడువుము" అనిచెప్పి యిద్దఱు నింటిలోనికేగి యొకగదిలోఁగూర్చుండియుండిరి. ఉమాపతియు "ఇంతకుముందే నవద్వీపమునుండి యొక వర్తమానము దెలుపునుత్తరము వచ్చెను. నీచెల్లెలిభర్తయైన మధురానాధుఁడు చాలా జబ్బుగానుండెను. అతనియుత్తర మిదిగో! చదివినచో సమస్తసంగతులును తెలియును. ఈసమయమునం దేమిచేయవలయునో దానిని నిశ్చయించుకొనుటకై నిన్ను పిలిచితి" నని చెప్పి యాయుత్తరమును నవకుమారునిచేతికిచ్చెను. నవకుమారుఁ డుత్తరమును విప్పి చదువనారంభించెను.

"శ్రీచరణములకు

ప్రణామపూర్వకముగా నివేదించునది యేమనగా——

ఇక్కడ నేను మిక్కిలి చిక్కులలోఁ దగుల్కొని వ్యాధిగ్రస్తుడనై యుంటిని—ఈవ్యాధి కుదురునను నాశ లేదు. అంత్యకాలమునందు మిమ్మును, మీసోదరిని జూడవలయుననునాశయున్నది. మీకు వేఱె కొందరపనులు లేకున్న యెడలనీయుత్తరమును జూచినవెంటనే మీరిద్దఱునువచ్చిదరిసెనమిచ్చి నాకోరిక నెఱవేర్పఁగోరుచున్నాఁడను. ఇంతకన్న నింకేమియును వ్రాయఁజాలను—చాల కష్టముమీఁద నీయుత్తరమును వ్రాసితిని.

"చైత్రబహుళ ద్వాదశీ శనివారము"

నవకుమారుఁడు త్తరమును జదివెను. నిలిపినను నిలుపక ఆతని కన్నులనుండి యశ్రువులు ప్రవహింపఁ జొచ్చెను. ఈ యుత్తరమును జదువుచుండఁగా శ్యామసుందరియు చాటున నిలుచుండి యెల్లసంగతులను వినెను. కాని యామె దానికిదుఃఖింపలేదు. ఆమెచిత్తమునందు దుఃఖసూచన యేమియునులేదు. సహింపరానిమనఃక్లేశము కొంచెము తగ్గినప్పుడు ఏడుపువచ్చును. శ్యామసుందరి అప్పుడు పొందుచున్న యాతనచేత నామెకు దుఃఖమువచ్చుటలేదు. ఇంతకుముందే యామె యీసమాచారము నుమాపతివలనఁదెలిసికొని యొకసారి యేడ్చెను. ఆకారణమున నామెకన్ను లెఱ్ఱగలువపూవులవలె నుండెను.

ఉమాపతి "నవకుమారా! అధైర్యమునుబొందకుము.ఊఱట బొంది,యిప్పుడుచేయవలసినదేమోదానిని యోచింపుము"అనియెను.

"వెళ్ళి తీరవలయును".

"నేఁడు భోజనమైనపిమ్మట నవద్వీపమునకుబయలుదేరుము"

"అట్లుచేయుటయే మంచిది. ఇప్పుడొక పడవను జూచికొనవలయును."

"నేను చూచివచ్చెదను. నీవు సిద్ధముగా నుండుము".

ఉమాపతి వెడలిపోయెను. వెంటనే నవకుమారుఁడును శ్యామసుందరియు సత్వరముతోఁ బ్రయాణసన్నాహము గావించుకొనిరి. కొలఁదిసేపటిలో నుమాపతి పడవనుగుదుర్చుకొని వచ్చెను. నవకుమారుఁడును శ్యామసుందరియు ప్రయాణమైరి. ఉమాపతి పడవ వఱకునువారితో నేగిఁ "నవకుమారా! శీఘ్రముగ వర్తమానమును దెలియఁజేయుము" అని చెప్పెను.

అట్లేచేయుదు నని చెప్పి నవకుమారుఁడు ఆతని చెవి యందు "అనుకూలముగా నుండినయెడల పద్మావతి కీసమాచారమును తెలియఁజేయుము" అని చెప్పెను.

ఉమాపతి యందుల కంగీకరించెను. నవకుమారుఁడును శ్యామసుందరియును, ఒకపరిచారకుఁడును నవద్వీపమునుండి వచ్చినమనుష్యుఁడును, ఒకదాసియును వీరందఱును పడవ నెక్కిరి. పడవ సప్తగ్రామమును విడిచిపోయెను.

ఇక్కడ మేము శ్యామసుందరి యత్తవారింటిసంబంధమైన యొకటిరెండుమాటలు పాఠకమహాశయులకు విన్నవించుట ముఖ్యావసరము. శ్యామసుందరికి తొమ్మిదిసంవత్సరముల ప్రాయమునందు ఆమెనునవద్వీపనివాసి యగు శ్రీయుతమధురానాథచట్టోపాధ్యాయునకిచ్చి వివాహమును జేసిరి. మధురానాథున కప్పుడు పదునాల్గువత్సరముల ప్రాయము. మధురానాథునితండ్రికూడ మంచికులాభిమానముకలవాఁడు. ఆతఁడు శ్యామసుందరివివాహ మయినపిమ్మట, మధురానాథునకు మఱిరెండువివాహములను గావించెను. శ్యామసుందరిజరగుబాటుగల యింటివారియాడుఁపడుచు. ఆమెకు అన్నవస్త్రములకు లోపములేదని మధురానాథునితండ్రి తెలిసియున్నవాఁడగుటంజేసి ఆమెను దనయింటికిఁ దీసికొనిపోలేదు. మధురానాథుఁ డప్పుడప్పుడు సప్తగ్రామమునందలి మామగారియింటికి వచ్చుచుండెడివాఁడు. మధురానాథుని తక్క

నయిద్దఱుభార్యలను వానియింటనే యుండిరి. ఈయిద్దఱుసుందరులును పరస్పరమును విరుద్ధస్వభావముకలవారై యుండిరి. అదియునుగాక వారిద్దఱును సవతులు. అట్లగుటచే నిత్యము జగడ మాడుకొనుచుం డిరి. రెండుసంవత్సరములకు ముందు మధురానాథుని రెండవభార్య పరలోకమున కేగిసవతిపోరును దప్పించుకొనియెను. మధురానాథుని మూఁడవభార్య కుముదిని. కుముదిని చాలసౌందర్యవతి. ఇప్పు డామె వయసు పదునాలువత్సరములు. ఆమె మిగుల సుగుణవతి యయినను శ్యామసుందరి గుణగణములతోఁ బోల్చిచూచినయెడల కుముదిని గుణములు తీసిపోవునని చెప్పవచ్చును.

మధురానాథుఁడు శ్యామసుందరిసౌందర్యము నెన్నఁడును మఱచియుండలేదు. ఆతఁడు తండ్రియభిప్రాయమునకు విరోధముగా నడచుకొనుపాటిధైర్యముకలవాఁడు కాకుండుటచే, నాతని కెప్పుడును శ్యామసుందరిని జూచుట కవకాశము చిక్కకుండెను. ఆతనిద్వితీయ భార్య మరణించినసంవత్సరమునందే వానితండ్రి గూడఁ బరలోకమున కేగెను. తండ్రిపోయినపిమ్మట నొకదానిపై నొకటిగ చాలపనులు కలిగి యింతవఱకును శ్యామసుందరిని జూచుటకయిన నవకాశము లేకయుండి, ఇప్పుడు మంచముపట్టినవాఁడై యామెను జూడవలయు ననునభిలాషకల వాఁడాయెను.

మధురానాథునిసంసారమునకు పెద్దదిక్కు నాతనితల్లి యుం డెను. ఆమె మొదటికోడలైనశ్యామసుందరి నొక సారిమాత్రముజూ చెను. అప్పుడు శ్యామసుందరి చాలచిన్నది. నవకుమారుఁ డొకటి రెండు పర్యాయములు నవద్వీపమునకుఁ బోయియుండెను. మధురా నాథునితల్లి వానిని మిక్కిలివిశ్వాసముతోఁ జూచుచుండెను. మధురా నాథుఁడు మిగుల సౌందర్యము కలవాఁడు చాల విద్వాంసుఁడు ఇది యునుగాక యాతఁడు మితభాషి. చాలసరసుఁడు.

---

## ఎనిమిదవ ప్రకరణము

### నిర్జనారణ్యము.

చ. "సకియలు నవ్వుటాలకును ♦ జారుశిరీషమృదుప్రసూనకం
దుకములఁ గొంచు వ్రేయుటకె ♦ తూలివెసంగ సుగంధు మేనిపై
నొకటపదార్థమై యుడిద ♦ ముంచిన నీకున కాలకాలదం
డకమయి నేఁడిదే పడెడు ♦ నాభుజదండము నీశిరంబుపై.

మాలతీమాధవము."

ఈ కథాసందర్భమున ఏకాలపు చరిత్రములు వర్ణింపఁబడుచున్నవో ఆకాలమందు సప్తగ్రామమునకు దక్షిణమున మూడుక్రోశములదూరమున గోపాలపురమను నొకగ్రామముకలదు. గ్రామమంత నరణ్యమయమై యుండెను. అందు జనసంఖ్యయు స్వల్పముగ నుండెను. ఆవైపునకు జనుల రాకపోకలు కూడ లేవు. గోపాలపురమున కుత్తరమున నరక్రోశముదూరమున నొక మహారణ్యముకలదు పగటియందుఁ గూడ నావనమునఁ బ్రవేశించుటకు జనులు భయపడుచుండిరి. ఈగ్రామ సమీపమునుండి యటకుఁ బోవుట కొకమార్గము కలదు. దొంగలు క్రూరజంతువులు మొదలగు వానిచే భయసంకులమైన యామార్గమందుఁ బథికు లెవ్వరు నొంటరిగాబోవరు. పనిలేకపోయినను చాలమంది ప్రయాణికులు చేరి ఆదారినుండి పోవుదురు.

ప్రొద్దుగ్రుంకలేదు. సూర్యభగవానుఁడు యజ్ఞవేదిఁ జేరుటకుఁ బ్రయత్నించుచుండెను. పక్షులు కడుపునిండించుకొని నలుదెసలనుండి తమతమ గూండ్లకుఁ జేరుకొనుచుండెను. ఇట్లుండఁగా గ్రామ మధ్యమునందు కుక్కలన్నియు నొకదానివెనుక నొకటి మొఱుగుట యారంభించెను. వానియఱపులు ప్రతిధ్వనించుచు నరణ్యమంతటను వినబడు

చుండెను. రాధాకృష్ణుల ప్రియవ్యంజకమైన గీతమును పాడుచు నిర్వి చారుడగు సదానందుఁడను నొక కృషికుఁడు తన పశువుల నింటికిఁ దోలుకొని పోవుచుండెను. వనమునకు ముందు స్వల్పదూరమున తప్పి పోయి దారి తెలియక యొకయావు భయముగొని నలుదెసల బెదరి బెదరి చూచుచు నటునిటు గంతులు వేయుచు నటనిలువఁబడిపోయెను ఆవును పోఁగొట్టికొనిన యాతఁడు భయమును వదిలి కొంచెముదూర మడవిలోనికిఁ బోయి "గౌరీ! గౌరీ!" అని పిలుచు చుండెను. గౌరియుఁ దనపాలకుని కంఠధ్వని నానవాలు బట్టి "అంబా" యని యఱచుచు నాదెసకుఁ బరువెత్తెను. ఒక పొదరింటి పార్శ్వమునం దొకనక్క యేదో యాలోచించుదానివలె నలుదెసలఁజూచుచుఁ గూర్చుండియుండెను. నడుమనడుమ తనమేనిపై వ్రాలుచున్న మక్షికములఁ దోలికొనుటకుఁ దనతోఁకను విసరుకొనుచుండెను. శరీరావ యవములను కోరలచేఁ గోకికొనుచు దారికడ్డముగ బరుగెత్తుచుండెను ఇట్టిసమయమున నరణ్యప్రకృతిని భావించి చూచితిమేని మనస్సునఁ బ్రీతియు భయము మొదలగు పరస్పరవిరుద్ధములగు భావములొక్క కాలమునందే పుట్టును.

ఈ సమయమం దామార్గముగ నొకయావనుఁడు పోవుచుం డెను. ఇట్టిసమయమున నిట్టి పెద్దమార్గమునం దేకాకియైయాపురుషు డొంటరిగ నెందులకుఁ బోవుచుండెనో? ఏమార్గము మనుష్యసంచా రము లేక వనమయముగా నున్నదో యట్టిమార్గమున సాయంకాల మున నొంటరిగ నొక మనుష్యుఁడు సంచరించు టెంతయాశ్చర్యము! యావనుఁ డతి త్వరితముగ గ్రామాభిముఖుఁడై పోవుచుండెను. ఆతనికి దేనిమీఁదను దృష్టిలేదు. ఏ కారణముననో యాతడప్పు డాకస్మికముగ నిలిచిపోయెను. ఆతని చెవి కేదియో యొకశబ్దము వినఁబడియెను. ఆతఁడు తిరిగి యా శబ్దమును వినుటకొఱకు

చెవియొగ్గి నిలుచుండెను. కొంచెముసేపటికే భయముతోఁగూడిన రోదనధ్వని యాతనికివినఁబడియెను. అదిస్త్రీకంఠధ్వనివలెనుండెను. పురుషుఁ డింక నూరకుండ లేకపోయెను. భయంకరమైనట్టియు, విపజ్జనకమైనట్టియు నాఘోరారణ్యమం దెవ్వరో యొకయబల యాపదలో మునిఁగి రోదనము చేయుచుండెను. ఆయేడ్పువిని యెవ్వఁడూరకుండఁగలఁడు? యువకుఁడు శబ్దమును గుర్తించుకొనుచు నాదిశకుఁ బరుగెత్తెను. అతఁడు దగ్గఱదగ్గఱగఁ బోవుచున్నకొలఁది నామె కనబడకపోయినను హృదయభేదకంబగు నార్తనాదము మఱింతస్పష్టముగ వినవచ్చుచుండెను. యువకుఁడు వేగముగఁ బోవుచుండెను. అక్కడక్కడ నాతని కాళ్ళకు ముండ్లుగ్రుచ్చుకొనుచుండెను. వానిని సులభముగఁ దీసివైచి వేగముగ నడచుచుండెను. మేనంతటను ముండ్లడొంకలు గీసికొని పోవుటచే రక్తము చిమ్ముచుండెను. అంతమాత్రమున నాతఁడు లక్ష్యము సేయుటలేదు. ఒక్కనిమిషములో నాతఁడాస్థలము చేరెను. అక్కడ జరుగుచున్న పనిని చూచినతోడనే యాతని యొడలు జల్లుమనియెను వికృతాకారుఁడును, క్రూరుఁడునగు నొకమనుష్యుఁడు భయభ్రాంతయై విలపించుచున్న యొక సుందరాంగియగు తరుణీమణిని చేయిఁ బట్టికొని లాగుచు బలవంతము సేయుచుండెను. తరుణియు వెక్కి వెక్కి యేడ్చుచు నాక్రూరరాక్షసుని కాళ్ళమీఁదబడి వేఁడికొనుచుండెను. ఆపామరుఁ డామెప్రార్థనలను సరకుసేయక యువతీమణింగూర్చి గర్జించి కేకలువేయుచు భయంకరమయిన నీచప్రస్తావముం జేయుచు నామె యసుమతిని పొందుటకు వివిధలోభజనకములైన విస్తారపు మాటల నాడుచుండుటవింటి రేని యెట్టినెమ్మదిగలవారికైనను కోపావేగమున రక్తనాళములనుండి వెచ్చని నెత్తురతివేగముగఁ బ్రవహింపకమానదు. ఆపసిబాలిక నిట్టూర్పువిడుచుచుఁ బండ్లుగొరికికొనుచు అనేకవిధముల బెదరింపులచేతనుదీనాలాపములచేతను వేఁడుకొనినను ఆపాషండుని

హృదయము కరఁగలేదు. ఆనరాధముఁ డాతరుణీమణి నోట గుడ్డలు గ్రుక్కుక నిలువనిచ్చినయెడలఁ దనకార్యము నెఱవేఱదని తెలిసికొని యామెనోరు గట్టుటకుఁ బ్రయత్నించెను. యువకుఁ డింక సహించి యూరకుండలేకపోయెను. అతనిచేతియం దొకకఱ్ఱ యుండెను. అప్పుడాతఁడు సమీపమునకుఁబోయి యాదురాత్ముని దుర్వృత్తిమును దొలగించుట కాతనితలకు గుఱిపెట్టి నేలకంటునట్లు బలవంతమయిన దెబ్బను గొట్టెను. ఆకఱ్ఱ ముక్కముక్కలై పోయెను. దెబ్బ బలము గాఁదగిలినది. వెంటనే యాతఁడు సొమ్మసిలిన దేహముతోఁ గూలఁబడియెను. యువకుఁ డాతనికి, ఊపిరివిడుచుటకైన నెడమీయకుండ నాతనిపొడవైన వెంట్రుకలను బట్టి వెంటనే యెదురొమ్ముపై మోకాలదిమి కూర్చుండెను. ఆపామరుఁడు నెత్తురు గ్రక్కుచున్న కన్నులను ద్రిప్పుచు నాయువకుని చూచుచుండెను. ఆకన్నులయొక్క ప్రతివీక్షణమునందును ఏదోయొకవిధమయినపగదీర్చుకొనుభావమే వ్యక్తమగుచుండెను. ఆతరుణుఁడు వానికి భయపడియుండలేదు. భయముచేఁ దొట్రుపడుచున్న యాసుందరిని కష్టములనుండి విడిపించితి నని యాతని కపారమయినసంతోషము కలిగెను.

ఆసుందరీమణి రావియాకువలె సంచలించుచుండెను. పురుషుఁ డామెను చూచెను. ఆతనిఁజూచి యాసుందరి తలవంచుకొని యేడువ నారంభించెను. ఆమెయనుపమానసుందరియు, నభినవయౌవనోన్మత్తయునగు బాలికయై యుండెను. ఆమెయసాధారణసౌందర్యము కన్నులఁబడినతోడనే కుసుమశరునివాఁడిబాణము చురచురవచ్చి యాయౌవనునిహృదయమున గుఱితప్పకుండ గాఢముగ నాఁటికొనియెను. అప్పుడాతఁ డాయువతిఁగూర్చి "ఇంక నీకు భయమెందులకు? ఇంకను గడగడలాడెదవేల? నీకాక్షేపణము లేకున్నయెడల సందేహింపక నీ

వృత్తాంతమును జెప్పవచ్చును. నిన్ను భద్రముగ నీయింటికిఁ దీసికొని పోయెదను'' అనియెను.

ఈసమయమందు అవకాశము చిక్కినదని తెలిసికొని యాదురాత్ముఁడైన దుర్వృత్తుఁడు ఆయాపవనునిభయంకరమయిన యాక్రమణమునుండి వదలించికొనుటకుఁ బ్రయత్నించెను. సుందరుఁడు వజ్రగంభీరమయిన కంఠధ్వనిచే "దురాత్మా! నోరు మూయుము! లేకున్న యెడల నిప్పుడే నిన్నును నీనీచజీవనమును యమసదనమునకుఁ బంపి ప్రపంచముయొక్క పాపభారమును తొలఁగించుటకు వెనుదీయను'' అని చెప్పెను.

ఇట్లు చెప్పి పురుషుఁడు మొదట వానికాళ్ళను గలయఁగట్టెను. తరువాతఁ జేతులరెంటిని బట్టి దగ్గఱనున్నయొక చెట్టున కాతనిశరీరమును చుట్టబెట్టి యాపాపమునికాలుసేతులను చేర్చి భద్రముగఁ గట్టెను తరువాత "నేను నీనీచజీవనమును నాశనము చేసి నాయీతనువును కలుషితముగఁజేసికొనఁజాలను. మఱియొకయుపాయముచేనీయసహ్యకరమైనప్రాణము పోయినయెడల నాక్షేపణమేమియును లేదు. దేవుడు దయఁజూచినయెడల నేను నిన్నేయవస్థయందు విడిచిపోతినో ఆయవస్థ యందే పడియుందుము. లేకున్న నీకిదియే యంత్యకాలము'' అని చెప్పెను.

ఈసమయమందాతరుణి యాసుందరుని మనోహరదేహకాంతి నిజూచుచుండెను. ఆతఁడు చేసినయుపకారముయొక్క చాయయామె హృదయపటమందు మనోహరముగా నంకితమగునను నాశచేతనో, అట్టిరూపమును వెనుక నెప్పుడును చూచియుండకపోవుటనో, ఉపకారముచేసినవానియెడ స్వాభావముగానత్యంతభక్తియుండుటం జేసియో ఆతరుణీమణి, కన్నులఱెప్పమిట్టుగొలుపుచున్న యాసుందరమూర్తి నతిక్రమింపలేకపోయెను. అప్పుడు పురుషుఁడు ఆపాపాత్ముని బాగుగ

బంధించి నిర్విచారుఁడై యానందముచే నాయువతీమణిని సమీపించెను. ఆసుందరి సిగ్గుచేఁ దలవంచికొనియెను. ఆమె నేత్రములు బాష్పజల పూరితము లయ్యెను. శరీరము కంపించెను. పురుషుఁడు "భయకారణము సంపూర్ణముగఁ దొలగిపోయినది. ఇంక భయ మెందులకు?" అనియెను.

ఆబాలిక యందులకుఁ బ్రత్యుత్తర మేమియు నీయలేదు. పురుషుఁడు తిరిగి యాసుందరి బరిచయము చేసికొనుటకుఁ బూర్వము, జరిగినవృత్తాంత మేమని యడిగెను. ఆబాలిక మెల్లమెల్లగ మధురస్వరముతో సంక్షేపముగఁ బూర్వవృత్తాంతమును దెలియఁజేసెను.

పురుషుఁ డదియంతయును విని కంపించి "ఇప్పు డెక్కడకు బోయిన భద్రముగ నుందువు?" అని యామె నడిగెను.

"మాయిల్లు గోపాలపురమున నున్నది"

"గోపాలపురమం దేనా? నేనక్కడి కెప్పుడును బోవుచుండెడి వాఁడనే! నీతండ్రి పే రెవ్వరు?"

"కాళిదాసభట్టాచార్యుఁడు."

యువకుఁడు కొంచె మదరిపడి యాశ్చర్యముతో "దైవమాఁ రక్షించితివి—భాగ్యవశముచేత నేను సమయమునకే వచ్చితిని. భట్టాచార్య మహాశయులు నన్ను బాగుగ నెఱుఁగుదురు. నీవాయన కుమార్తెవా? నేను నిన్నెన్నఁడును చూడలేదు" అనియెను.

అప్పుడు చంద్రుఁ డాకాశమార్గమును భేదించుకొని తనబంగారురథమును నడపించుచుండెను. తారకాగణ మొకదానివెనుకనొకటి వేగముగాఁ దాము విరహిణులమయ్యెదమనుభయకారణముచే "పోవద్దు! పోవద్దు!" అనిప్రార్థించుచు చుట్టుముట్టి స్వామియైనచందమామ వెలుతురులం బడిపోవుచుండెను. హాసన్ముఖియగుభూదేవి సకలజనన యానందకరముగనుండెను. విహంగమము లప్పుడప్పుడు కిచకిచమని రొదసేయుచుండెను. రాత్రియు దలి యీమనోహర చంద్రికా

విలసనముం జూచి పక్షులన్నియుఁ బట్టపగలని భ్రమించి తెల్లవారె నని యుచ్చైస్స్వరమునఁ గూయుచున్నవేమో యని తోఁచుచున్నది.

పురుషుఁడు "ఇంక నాలస్య మెందులకు? చీకటిగూడఁ బడు చున్నది. నిన్నుఁ దీసికొనిపోయి నీగృహమున విడిచి నిశ్చింతతోఁ బోయెదను" అనియెను.

యువతియు మౌనముచే సమ్మతిని దెలియపఱచెను. యువకుఁ డు ముందు బయలు దేఱెను. సుందరియు నాతని వెనుదవిలి పోవు చుండెను. కొంచెముసేపటిలోనే వారిద్దఱును దట్టమయిన వనమందు మునిఁగిపోయిరి.

ఈపురుషుఁడెవ్వఁడో పాఠకమహాశయు లెఱుఁగుదురా? ఈతఁ డు మనచెలికాఁడగు నుమాపతియే. గోపాలపురమం దాతనిమేనమా మయుండెను. ఆకారణముచే నాతఁ డక్కడకుఁ దఱచుగ వచ్చుచుఁ బోవుచుండును. ఏదోకార్యమునకయి యాతఁ డీదినమున, నాకష్టపథ మున నొంటిరిగఁ బోవుటతటస్థించెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

### గృహము

ఆ. వె. "జనన మైనదాదిఁ ♦ గనుల పండువుసేసి
గడియ కొక్కముద్దు ♦ నడపియింపుఁ
బెంచు నీదు చిన్నె ♦ లెంచంగ నవియెడల్
దగులఁ బెట్టు; గుండె ♦ పగులఁ గొట్టు.
మాలతీమాధవము"

గోపాలపురము నిశ్శబ్దముగ నుండెను. జనులందఱును సుకుమా రమైన నిద్రచే విశ్రమించుటకుఁ బ్రయత్నించుచుండిరి. కొంతమెల్లమె

డల విరాజిల్లుచుండెను. గ్రామమధ్యమం దొకయింటియందలిజనమిం
కను నిద్రించి యుండలేదు. ఆయింటినిచూచినమొదల ధనవంతుల
గృహముగా నగపడుటలేదు. అదిమేడయిల్లుకాదు. అయినను పరిశు
భ్రముగాను, అందముగాను నున్నది. ఇంటియందు నాల్గుగదులుమా
త్రము కలవు. ఎదుటనున్నముంగిలి యంతవిశాలముగ లేదు. అందొ
కప్రదేశముననొకపూరిల్లుకూడ నుండెను. ఒకగదిలో దీపము వెలుం
గుచుండెను. ఆదీపపువెల్తురున నిద్దఱుకూర్చుండి యేడ్చుచుండిరి. వారి
లో నొక్కఁడు పురుషుఁడు. మఱియొకతె యాఁడుది. ఈపురుషునకి
కొంచెమెచ్చుతగ్గుగ నేఁబది సంవత్సరములవయసుండెను. ఆయాఁడు
ది యాతనిభార్యయే. ఆమెకునలువదిసంవత్సరములవయసునకుఁదక్కు
వ యుండదు.

"నేనింకేమి చేయను? చెప్పు! సాధ్యమయినంతవఱకు వెదకుట[illegible]
లోపమేమియును చేయలేదు. ఇఁకమీఁద [illegible]వ మున్నది. ఈరా[illegible]
యందొంటరిగ నెక్కడకుఁ బో[illegible]? పోయి చేయవలసి[illegible]దే[illegible]
న్నది? విచారింపకుండు టెట్లు? జనులందఱును వెదకుటకుఁ [illegible]
నితోఁ బోయియుండిరి. వారికంటె నే నెక్కువగ వెదకఁగలనా? [illegible]
యట్లనుకొని నిర్విచారముగ నుండఁజాలను. భగవంతుఁడు నానుదుట
నిట్లు వ్రాసియున్నాఁడు. పోయి చూచెదను—ఇఁక నొకసారి పోయె
దను" అని పురుషుఁడు పలికెను.

"వలదు! నీవు పోయిన నేమి ప్రయోజనము! అదృష్టముతిరిగి
పోయినది. తేపటిదినమునఁ బ్రజల మొగమెట్లు చూడఁగలను" అని
యామె యనెను.

"హా! దైవమా! ఇదియంతయును సిపిలానసముగదా! సంఘ
మునుండి విడిపోయితిని. సంసారమును వదలిపోయినది. ఉన్నదొక్క
కుమార్తెయుఁ గూడఁ బోయినది. అన్నిటికిని సహించితిని. మిగిలిన

యొక్క కుమార్తెను గాచుకొనుచు జనులకు మొగము చూపింప కుండ నీయింటఁబడియుంటిని. దైవమా! అదియుఁగూడ నీకిష్టములేక పోయెనా? ఈదురదృష్టవంతున కింతకష్టముంగూర్చుటకు నీకింత యానందమెందులకు? కష్టపెట్టుము! అందులకునాకేమియు విచారములేదు. నాకెంతకష్టమైనఁ గలిగింపుము. ఎట్లో సహించితిని. ఇంకను సహియించెదను. కాని నాబిడ్డ కష్టముల నెఱుంగదు. ఓ దయామయా! ఆమెకుఁ గష్టములంగూర్చుట నీకు ధర్మమా! నీకార్యమును నీవే యెఱుఁగుదువు—— ఆహా! దాని కేమి విపత్తు సంభవించినదో నీకే యెఱుక'' అని విచారించుచుండెను.

ఈసమయమున మందింటికి వెనుకవైపున జనులు నడచుచున్న శబ్దము వినవచ్చెను. ఇద్దఱును కన్నులువిచ్చి ముంగిటివంకఁ జూచిరి. చీఁకటిని భేదించుకొని యిద్దఱు మనుష్యులు లోపలికి వచ్చుచున్నట్లు స్పష్టముగ నగపడియెను. ఆదంపతు లిరువురు నావంకకుఁ బోయి ''ఎవరుమీరు? ముక్తకేశినియా?'' అని ప్రశ్నించిరి.

ఈప్రశ్నలకుత్తరము రాలేదు. ఒకనిముసములో ముక్తకేశిని వచ్చి తల్లిని కౌఁగిలించుకొనియెను. పోయిన కుమార్తెను తిరిగి పొందినతల్లిదండ్రులకుఁ గల యానందమపారమైయుండెను. దానినివర్ణించి వ్రాయలేము. వారక్కడనే నిలిచియుండి శోకాశ్రుధారలను,ఆనంద బాష్పములను గురియించిరి. తుదకు ముక్తకేశిని ''తండ్రీ! ఈతఁడే నన్నీదినమునరక్షించినవాఁడు''అనిచెప్పుచు నుమాపతిని చూపించెను.

వృద్ధుఁ డుమాపతిం జూచి యానవాలు పట్టెను. మఱియు నానందముచే ''ఎవరు! ఉమాపతియా?'' అనియెను.

''ఔను మహాస్వామి!''

''ఇంతసేపు నన్యమనస్కుఁడనై యుంటిని. నిన్ను చూడలేదు. నీవు మఱియొకలా గనుకొనకుము''

ఇట్లుచెప్పి తనభార్యతో "నీవెఱుఁగవా? ఈతఁడు మనవాఁడే. మనహరిహరుని చెల్లెలికొడుకు" అని వృద్ధుఁడు చెప్పెను.

ఉమాపతి—నే నిప్పుడు వెళ్లెదను. రాత్రి ప్రొద్దుపోయినది. మాయింటియొద్ద నగత్యములైన పనులున్నవి.

వృద్ధు—ఔను చాల రాత్రియైనది. నేఁడిక్కడ నుండఁగూడదా? మా కీదినమునఁ గలిగిన యానందమునకు నీవే కారణమైతివి. కాఁబట్టి చాలసేపు నీతోఁ గలిసి యీసంగతులన్నియును ముచ్చటించితిమేని మాయానందము మఱింత యధికము కాఁగలదు.

ఉమాపతి కొంచెమాలోచించుకొనుచు కొంతసేపూరకుండెను. అతఁడేదో తొందరపనిమీఁద మేనమామయింటికి వచ్చుచుండెను— మార్గమునందు ఈ విపత్తు తటస్థించెను. అంత యగత్యము లేని యెడల నాతఁ డెప్పుడు నొంటరిగ నంతరాత్రికాలమున నానిర్జనమైన మార్గమునందు వచ్చువాఁడు కాఁడు. కారణమున రాత్రి యిక్కడనే యుండి కార్యభంగము చేసికొనుట సరికాదని యాతనికి దెలియును. ఇప్పుడు వానిమనస్సునందు, ముక్తకేశిని సన్నిధియయ్యెను. ఆమెను జూచుచు నెంతసేపుండిన నంతసేపును నానందమయముగా నుండునను నాశచే నామెను విడువ నసాధ్యమని యోచించునుమాపతి, యెదుట నున్న ముక్తకేశనిముఖమును జూచెను. అప్పుడాసుందరి వాని నేకాగ్ర దృష్టితోఁ జూచుచుండెను. ఆదృష్టియందు కృతజ్ఞతయు, ఆనందము, మోహము లీయమైయుండెనని యుమాపతికి బోధపడియెను. ఉమాపతి సర్వమును మఱచెను. ఆతనికి తన తొందరపని కూడఁ గేవలసామాన్యమైన కార్యముగాఁ దెలియవచ్చెను. ఆతని కాస్థలమునకుఁ బ్రతిగా నెవరైన నక్షయమైన స్వర్గరాజ్య సింహాసనము నిచ్చుటకు సిద్ధపడినను ఆతడు దాని నంగీకరించునో, లేదో! ఉమాపతి కృతనిశ్చయుఁడై "అట్లే కానిమ్ము—ఈ దినమిక్కడనే యుండెదను" అని చెప్పెను.

ఆతఁడు తిరిగి ముక్తకేశిని యొక్క నిష్కళంక ముఖచంద్ర మండలమును జూచెను. ఆమె యానందముచేత నవ్వుచున్నట్లు తెలిసికొనియెను. ఆతడు మనశ్చక్షువుచేఁగాక కల్పనాబలముచేత ముక్తకేశినివదనమునందలి నానావిధభావములను జూచినట్లు తెలిసికొనియెను. భ్రాంతుఁడైన యుమాపతి వాస్తవముగాని భావములను కల్పనాబలముచే వాస్తవములుగా భావించి సుఖించెను.

వృద్ధుఁడానందముచేత నుమాపతిహస్తమును బట్టుకొని యింటిలోనికిఁ దీసికొని పోయెను. ముక్తకేశిని యామె తల్లి వెనుకనే పోయెను. దీప ప్రకాశమందందఱును వేరు వేరు చోట్లఁ గూర్చుండి యుండిరి. ముక్తకేశినియు నామె తల్లియు నొక్కచోఁ గూర్చుండిరి. ముక్తకేశిని తన తల్లిభుజముమీఁద శిరస్సునుంచుకొని మాటిమాటికి చమకితయగుచు వడఁక నారంభించెను. ఆమెతల్లియు చీరచెఱఁగుచే నామె కన్నులొత్తి యెడమచేతిని నడుమునకుఁ జుట్టి పట్టికొనియెను.

భట్టాచార్యుఁడు—ఇంక భయమెందులకు? తల్లీ! ఏమైనది? చెప్పవా?

ఉమాపతి—అదియంతయును సంక్షేపముగ వినియుంటిని. విశదముగాఁ దెలిసికొనుటకు నాకును కుతూహలముగ నున్నది.

ముక్తకేశిని యుమాపతిని చూచి కించిదవనతముఖియై కన్నుల నీరు పెట్టికొనుచు, భయముచేతను, గద్గదస్వరముచేతను జరిగినదెల్ల వృత్తాంతమును చెప్పెను. అది చాలగనున్నది. అదియంతయు మేము సంక్షేపముగ పాఠకమహాశయులకు విన్నవింతుము.

సాయంకాలమందు నిత్యమును ముక్తకేశిని స్నానముచేయుటకు తమ యింటియొద్దనున్న పుష్కరిణికి పోవుచుండును. మఱియెవరైనను ఆమెకు జతగా నుండుచుండెడివారు. ఒక్కొక్కప్పుడామె తల్లికూడ నామెతోఁ బోవుచుండును. నేఁడామెకు మఱియొకపని యుండుటచేతనట్లు పోయియుండలేదు. ఈ దినమెవ్వరును లేక,

ముక్తకేశిని భయముతోనే స్నానముచేసెను. వేగముగనే స్నానకృత్యములను గావించుకొని మెట్లమీఁది కెక్కెను. అప్పు డకస్మాత్తుగాపార్శ్వమునందలి యడవినుండి యొకమనుష్యుడు తెలియకుండగనేవచ్చి ముక్తకేశినిచేయి పట్టుకొనియెను. పాప మాచిన్నది మాటలాడలేకపోయెను. ఆతని నల్లశరీరమును, పరుషభాషణములును మిడిగ్రుడ్లను మెట్టనిజడలును భయంకరాకారమును ఇవియన్నియును చూచి ముక్తకేశిని నిలువునీరై పోయెను. ఆసమయమున పాఱిపోవుటకుఁగూడ నవకాశము లేదు. ఆతనిదృఢముష్టినుండి విడిపించుకొనుటకు అట్టికోమలాంగియగు బాలిక కెట్లుసాధ్యమగును? అప్పుడామె కేకలు వేయుటకుఁగాని యేడ్చుటకుఁగాని శక్తిగాని శక్తిమంతురాలు కాకపోయెనుతోడ నాదుర్మార్గుడుఆమె నోరుమూసి మాటలాడకుండఁ జేసెను. ముక్తకేశిని నిశ్చేష్టురాలైపోయెను. తరువాత నాతఁడామె నరణ్యమున కెత్తికొనిపోయెను. అప్పుడామె నోటిని విప్పెను. అయిన నామెకు తెలివి రాలేదు. ఆమెకుఁ జాలసేపటికిఁ గొంచెము తెలివికలిగెను. అది వఱకునామెనక్కడయుంచి యాదురాత్ముఁడు దూరముగఁ గూర్చుండియుండి ఆమెకు తెలివి వచ్చినతరువాత నొక వెఱ్ఱినవ్వు నవ్వెను. ఆమె యాపని విశేషముగ వేఁడికొనియెను. అయిననాతడు వినలేదు. ఆబాలికయు నేడ్చుటకుఁ బ్రారంభింపఁగా నాదుష్టుఁడామె నోటిని బంధించుటకు సమీపించెను. అప్పుడు భగవంతుఁడామెదుఃఖమును గూర్చి విచారించి యామెపవిత్రచరిత్రమునుకాపాడుటకొఱకు ఉమాపతి నక్కడకుఁ బంపించెను. మిగిలినదంతయును పాఠకు లెఱింగినదియే. భట్టాచార్యుఁడు "హా! జగదంబా! నీవేమిచేయఁజాలవు!-ఉమాపతీ! నేను దరిద్రబ్రాహ్మణుఁడను. లక్ష్మీకటాక్షముచేత నీకేమియు లోపము లేదు. నీవుదీర్ఘాయుష్మంతుఁడవై సుఖముగా నుండుము. నేఁడు నీవు మాకు చేసిన యుపకారమునకు ప్రత్యుపకారమును

మేము జన్మజన్మాంతరములకైనను చేయఁజాలము. నేను మీా మేనమామ కాశ్రితుఁడను. కావున నీకన్యుఁడను గాను. తరువాత నేమైనది?" అనియెను.

ముక్తకేశిని తరువాతవృత్తాంత మంతయు నుమాపతి కాళిదాసభట్టాచార్యున కెఱింగించెను.

ఈసంభాషణ మైనతరువాత నందఱును ఆనందజనకములైన వాక్యములతో ముచ్చటించుకొనుచుఁ దరువాత భుజించితమతమ నిర్దిష్టశయ్యాతలంబులకుఁ బోయి పరుండిరి.

---

## పదవ ప్రకరణము

### సుస్వప్నము.

"Among the many pretended arts of divination there is none so universally amuses as that by dreams."

Spectator.

ఉమాపతి దక్షిణదిక్కునందున్న యొకగదిలో పరుండెను. అతని శయ్యాతలంబునకుఁ స్వల్పదూరమున సన్నముగా వెలుఁగుచున్న దీపమొకటి యుండెను. నిద్రాదేవత యాతని హృదయమందు జయస్తంభము నింకను బ్రతిష్ఠింపలేదు. అతఁడు కన్నులనుమాత్రముమూసికొని యుండెను; కాని, యవి నిద్రాధికారముచే మూయఁబడినవి కావు, అతఁడనేకవిధములయిన యాలోచనలలో మనసును బ్రవేశపెట్టియుండెను. ఒకటి యైనతరువాత నొకసుఖమయాలోచనమాతని హృదయమునఁ బ్రవేశించుచుండెను. ఒక్కొక్క యాలోచన మక్కడనొకక్షణకాల ముండి మఱియొకయాలోచనమునకు తావొసఁగి పోవుచుండెను. ఒకానొకసత్కార్యమును చేసినప్పుడు స్వభావసిద్ధముగ

మనసునందానంద ముదయించును. ఆనందమే సుఖమునకు మూలము ఉమాపతి యీదినమున నొనర్చిన సత్కార్యప్రభావముచేత నాతని హృదయ మానందసాగరమునఁ దేలియాడుచుండెను. ఆనందప్రభావముచే మనస్సుస్థిరముగా నుండుటలేదు. ఆనందరహితమయిన హృదయమునందు విచారమొక్కటియే గాఢముగ నాటుకొనియుండును. కాని ఆనందమునందుమాత్ర మట్లుకాదు. ఆనందమునందు నానావిధ సుఖరకములయిన యాలోచనములు దృఢతరములయి యుండును.

ఉమాపతి శయ్యయందుశయనించియిట్లుఒకదానికొకటిసంబంధములేకయే యేకకాలమందొక్కసారిగానుదయించుచున్నయాలోచనాతరంగములందు తేలియాడుచుండెను. అనేకవిధములయిన యాలోచనములలో నొకచిన్నయాలోచన మాతనిహృదయమునందు గాఢముగ నాఁటికొనియుండెను. ఆలోచన మనస్సునుండి తొలఁగించుట కాతని కిష్టములేదు. ఆతఁడు ఆవిచారమునకు హృదయమునందవకాశమిచ్చి యపారానందమునమభవించుచుండెను. ఆతనియుత్సాహము ఆనందము, ఆశ మొదలగునవి యనంతముగ బయలుదేరెను. ఒక సుందరింగూర్చిన యాలోచనమువలన—ఆమె మనోహరరూపసంస్మరణమువలన—ఆమె సుకుమారస్వభావసందర్శనమువలన—ఉమాపతియొక్క జ్ఞానము—విద్య—వివేకము—అభిమానము—సంభ్రమము—మొదలయినవానిచేఁ బరివేష్టింపఁబడినహృదయము సంపూర్ణముగ జయింపఁబడెను. ఆ సుందరీమణియే ముక్తకేశిని. ఉమాపతి ముక్తకేశినియొక్క రూపగుణాతిశయముల నెంత యాందోళనముతో నెంతగ నాలోచింప నారంభించెనో అంత యధికతరానందమును బొందనారంభించెను, అతనిమనస్సు అంత ప్రబలవేగముచే నావంకకే పరుగెత్తుచుండెను. అట్టి భూలోకదుర్లభమైన యారమణీమణి చరిత్రమునం దెట్టి కళంకమును పొరయకుండఁ గాపాడఁగలిగిన యాతని

యానందమునకు మేర లేకుండెను. ఆకారణముచే నహంభావవిరహిత మయిన యాతని మనసునందుఁగూడ గర్వముదయించెను.

ఆతని మనసుకంటె ముక్తకేశిని హృదయ మెంత యున్నత మైనది? ఆమె దయామయి యగు దేవి. ఏనరాధముఁ డామెమీఁద నంతయపరాధమును నడిపి ప్రవర్తించెనో, యట్టివానిమీఁద ముక్తకేశిని దయగలిగి యుండెను. ముక్తకేశిని సంసారమునకు సారభూత మైనది. ఆమెమనసు అమూల్యరత్నఖని. ఆమెశరీరము సౌందర్యనికేతనము. ఆమె రమణీకులమునకు లక్ష్మి. ఇట్టికాంతి అనుపమానమైన యిట్టిసుగుణము, ఇట్టిపవిత్రత ఇవియన్నియు నేనెక్కడనుచూచియుండలేదని యనుకొనియెను. ముక్తకేశినిసంబంధమైన దంతయు నాతఁ డత్యాశ్చర్యముగ భావించుచుండెను. ముక్తకేశినివంటి సుందరీరత్నమును చూడఁజాలని మనుష్యునిజన్మము నిరర్థకము. అట్టిమనుష్యుఁడు ప్రపంచమందేమి చూడఁగలఁడు? ఏమియునులేదు. ప్రపంచమునందు రూపవతులైన రమణీమణులెందఱు లేరు! ప్రపంచమునందు గుణవతులగు సతులెందఱు లేరు. ఉండవచ్చును. కాని ముక్తకేశినివంటిసుందరులుందురో లేరో యను నాలోచనమం దుమాపతికి సందేహము కలిగెను.

ఉమాపతి యీయాలోచనములయందున్మత్తుఁడైపోయిముక్తకేశిని లజ్జావనతవదనయై తనసమీపమునందే నిలిచియున్నట్లుభావించెను. ఆమెతన్నుసమీపించి,మధురమందహాసవదనారవిందయైతనతో మాటలాడుచున్నదని తలంచెను. ఇది యంతయు ననేకవిధములుగఁ దలపోసికొనుచు నుమాపతి నిద్రాగతుఁ డయ్యెను. నిద్రించుచున్నను ఆతఁడు ముక్తకేశినింగూర్చిన యాలోచనములయందు విరతివహించి యుండలేదు. ఉమాపతి నిద్రావస్థలో ముక్తకేశినీ సంబంధమయిన యొకసుస్వప్నమును గాంచెను. ఆస్వప్నమం దాతఁ డొక యతిలోక

రమణీయమగు గిరికందమునంగూర్చుండియుండెను. అక్కడ మలయ మారుతము సుస్వరముతో వీతెంచుచుండెను. అనతిదూరమున గిరి నిర్ఝరప్రపాతపరంపరలు ఘోరగంభీరశబ్దములను గల్పించుచుఁ బల్ల ములఁబడి ప్రవహించుచుండెను. మఱియు నాజలశీకరసంస్పర్శనముచే మలయమారుతకిశోరంబులకు శీతలత్వమలవడుచుండెను. అతఁడెక్కడ గూర్చుండెనో యాప్రదేశమెత్తుగనుసమోన్నతముగను పెఱిగియున్న లేఁబచ్చికచేనలంకరింపబడినదిగనుండెను. పర్వతమునుండిపుట్టినచిన్న సెలయే రాపచ్చికపట్టును చుట్టపోవుచుండెను. దానికి కుడిప్రక్కను గగనమునొరయుచున్న పర్వతము మేఘమండలమును భేదించుకొని మీఁదికిశిఖరమస్తకము నెత్తికొని బ్రహ్మాండమంతయుఁదిలకించుచుండె ను. ఎడమప్రక్కను వివిధవృక్షలతాములచే నావరింపఁబడిన యరణ్య ముండెను. అందక్కడక్కడ లతాపాశములచేఁ జుట్టుకొనఁబడినవృక్ష ములు పరస్పరము నొరసికొనుచు నపూర్వములైన వల్మీకములచే నా వరింపఁబడియుండెను. ఆచెట్లయందు చిత్రవిచిత్రవర్ణములచే మనోహ రములయిన పక్షులు నిత్యమును మధురగానములు సేయుచుండెను. ఆవెనుక నొకచిట్టడవి యుండెను. అతిప్రయత్నముచేనుద్యానవనమున ననేకదోహదములుచేసి పెంచినను వృక్షలతాదు లక్కట నేపుగాఁ బెఱుగక వివిధరాగరంజితములయిన సుగంధపుష్పముల నీయకయేపో వుచుండును. కాని యావనమున వృక్షములును. మనోహరలతలును స్వభావముగనే పుష్పించి కన్నులపండువు సేయుచుండెను. లతలకొ లఁది తుమ్మెద లాకుసుమములయందలి మకరమును గ్రోలెడునాశచే ఝుంకారముసేయుచు విహరించుచుండెను. ఆప్రదేశము మిగుల రమ ణీయముగనుండెను. ఉమాపతి యాప్రకృతిసౌందర్యవిశేషమునుచూ చెను. అతఁడేకాగ్రచిత్తుఁడై ప్రకృతియొక్క పరమరమణీయ శోభా రాశిని నూంచి విపులానందపారావారతరంగమాలికలం దూఁగుచు బా

హ్మాజ్ఞానశూన్యుఁడై బ్రహ్మసృష్టినై పుణ్యమును గూర్చి మిగులఁబ్ర శంసించుకొనియెను. ఈసమయమం దాతని కగపడకుండఁగనే వెను కటియరణ్యమునుండి వనమున కధికారిణియు, మనోహారిణియు నగు వనదేవత పుష్పములచే నలంకరించుకొని చనుదెంచెను. ఆమె మెల్ల మెల్లగా శబ్దములేకయే పాదముల నిడుచు నుమాపతియొద్దకు వచ్చి రెండుచేతులతో నొక్కమాఱుగ నాతని రెండుకన్నులను మూసెను. ఉమాపతి పులకితశరీరుఁడయి "నీవెవ్వతెవు?" అనియడిగెను.

దేవి కన్నులను మూసినచేతులను దీసికొని "నీవు నన్నుఁ జూచితివా?" అనియెను.

ఉమాపతి చూడఁగా నది దేవియును గాదు. మఱియెవ్వరును గాదు. ముక్తకేశినియే యైయుండెను. ఆతఁడాశ్చర్యపడి ముక్తకేశినీ! నీవిక్కడ కెందులకు వచ్చితివి?" అనియెను.

ముక్త—ఉమాపతీ! నీ వెందులకిక్కడకు వచ్చితివి ?

ఉమా—నే నిక్కడనున్న శోభారాశిని చూచుటకువచ్చితిని

ముక్త—నీ విక్కడకువచ్చితివని చూచుటకువచ్చితిని.

ఉమా—నేనిక్కడకువచ్చితినని నీకెవ్వరు చెప్పిరి ?

ముక్త—చెప్పవలసినవారే చెప్పిరి—ఇట్లని చెప్పి వ్రేలితో దనహృదయమును జూపించెను.

ఉమా—ముక్తకేశినీ! ఏమి యీవేషము ?

ముక్త—ఏమి వేషము ?

ఉమా—ఈమనోహారపుష్పాలంకృత వేషము.

ముక్త—నీవీ వేషమునంగీకరింపవా?

ఉమా—అంగీకరింప కేమి ? మిగులరమణీయముగనున్నది.

ముక్త—నిజమేనా ?

ఉమా—నేను నీతో నసత్యము లాడువాఁడనా ?

ముక్తకేశిని "అట్లయినఁ గొంచె మాఁగుము. నీకీవేషమును వేసెదను" అని చెప్పి తిరిగియాపుష్పవనములోనికిఁ బోయెను. ఉమాపతి ముక్తకేశినీ చమత్కారభావమును గూర్చియు, అసాధారణసరళస్వభావమును గూర్చియు నాలోచించుకొనుచుండెను. అప్పుడు ముక్తకేశిని చెఱఁగునందు వివిధ మనోహరపుష్పముల నుంచుకొనివచ్చి పుష్పములను పచ్చికమీఁద నుంచి వానిచే నొకయుష్ణీషమును కట్టి దానినుమాపతిశిరస్సున నుంచి చూచెను. అది మిగుల మనోహరముగ నగపడియెను. ముక్తకేశిని సంతోషముచే ద్విగుణితమైనయుత్సాహమునఁ బుష్పములచే వేఱువేఱుభూషణములను చేసి యొక్కొక్కటిగా నుమాపతి నలంకరించెను. ఉమాపతిమిగుల నెఱ్ఱనిపూవులుండిన బాగుగ నుండు నని చెప్పెను. ముక్తకేశిని తన కంఠమునుండి యొక్క మాలికను తీసి యాతనిమెడలో వైచెను. ఉమాపతి యానందముచే నామెనాలింగనము చేసికొనియెను. ఇంతలో నాతనికి మెలకువ వచ్చినది. ఉమాపతి మేల్కనునప్పటికి గది యొక్క దక్షిణమునైపు కిటికీ తెఱవఁబడి యుండెను.

ప్రభాతముయొక్క నేభాగమునందు రేయుంబవళ్ళు రెండును సమభాగములై కలిసియుండునో యిప్పు డట్టిసమయ మయ్యెను. సూర్యుఁ డాకాశమందింకను నుదయింపలేదు. కాని యిప్పుడు సూర్యుఁడెక్కడనుండెనో యాస్థలమునుండి యాతని తేజః ప్రతిబింబము వచ్చి పూర్వాకాశముయొక్క క్రిందిభాగమును ప్రకాశింపఁజేయుచుండెను. ఒకటిరెండు కాకులు గూటిని వదలియెగిరివచ్చి గోడమీఁద వ్రాలినాచుచు నొక్కొక్కసారి కావుకావుమని కూయుచుండెను. వంటయింటి యొద్దనున్న బూడిదరాశిమీఁదఁ బండుకొనియున్నకుక్కయు లేచినిలువఁబడి యొడలుదులుపుకొనుచు చెవులతటతట నల్లలాడించుచుండెను. ఒకటిరెండీఁగ లెగసియెగసివచ్చి దాని మేనిపై వ్రాలిము

సరికొనుచుండెను. కుక్కయు నాయీఁగలను బట్టుకొనుటకు నోరు తెఱచి తలనటు నిటుఁద్రిప్పుచు నేమియు జేయలేక నోరుమూసికొని యెను. ఒకగుడ్లగూబ వంటయింటిమీఁదఁ గూర్చుండి భయముతో నలుదెసలును జూచుచుండెను. మనసున నేమో తలఁచుకొనుచుఁ గూర్చున్న స్థలమునువిడిచి యెగిరిపోయి దగ్గఱనున్న యొకచింతచెట్టు మీఁద కూర్చుండెను. అదికూర్చున్న యదటుచే నాచెట్టుకొమ్మ తూగాడుచుండెను.

తెఱచియున్న గవాక్షమునుండి గాలివిసరి యుమాపతికిఁ దెలివికలిగించెను. అయిన నతనికిఁ జెమట పట్టియుండెను. ఈయవస్థలో నుండఁగా నింతలో నాతనికి నిద్రాభంగ మయ్యెను. ఆతఁడాశ్చర్యముతో కన్నులను విచ్చిచూచెను. కన్నులను విచ్చిచూడఁగా నాతని యాశ్చర్యమును, మఱింత హెచ్చయ్యెను.

---

## పదునొకండవ ప్రకరణము

### ఆశాసుఖము.

"హృదయంత్వేవ జానాతిప్రతియోగం పరస్పరం"
ఉత్తరరామచరితే

ఉమాపతికి ద్రాభంగమై కన్నుతెఱచిచూచుసరికి సుందరియైన ముక్తకేశిని తెఱవఁబడినకిటికియొక్క వెలుపలనుండి చూచుచుండెను. ఆతఁడు కన్నుతెఱచినతోడనే యామెసుందరవదనమండలము కలఁగనుచుంటి నేమో యని భావించుకొనియెను. కొంచెముసేపటికే యానిసందేహముతీరిపోయెను. ఆసుందరీసందర్శనము నిశ్చయమైనదే యని తెలిసికొనియెను.. ఆతనియానందమునకుఁ బారములేకపోయెను ఆనందముచే నుప్పొంగుచు "ముక్తకేశినీ!" అని పిలిచెను.

ఈమాట యుమాపతి నోటినుండి వచ్చినతోడనే ముక్తకేశిని లజ్జచే నంతర్హిత యయ్యెను. ముక్తకేశిని యారాత్రి పరుండి నిద్ర కొఱ కెదురుచూచుచుండెను. కాని యామె కెంతమాత్రమును నిద్ర పట్టలేదు. నిద్రకుఁ బ్రతిగా నుమాపతియొద్ద నేకాంతముగా నుండవల యునను నాశయు, అతనియొద్దఁ దెరపిలేకుండ సల్లాపములాడవలయు నను నభిలాషయు నామె మనస్సును గలఁచివేయుచుండెను. ఏ శుభ ముహూర్తమం దుమాపతి విజనారణ్యమునకు వచ్చి—విపత్స్థానం బడిపోవుచున్నదియు, నబలయు, సతీమణియు నగు ముక్తకేశిని నుద్ధ రించి కాపాడెనో యా ముహూర్తము మొదలుకొని యామె చింతా సాగరమునంబడి కొట్టుకొను చుండెను. అప్పటినుండియు నామె యుమాపతిపై బ్రేమగలిగి యుండెను. సరళ హృదయ యగు నా బాలిక యది మొదలు తన కుమాపతి చేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకారముగాఁ దన హృదయమును సమర్పించు కొనియెను. ముక్తకేశిని చాలమంది యౌవనపురుషులను—చాలమంది సుందరు లైన యౌవన పురుషులను—చూచియుండెను. కాని యామె హృద యమం దెవ్వరి ప్రతిబింబమును నిలువలేదు. వారిని తిరిగి చూడ వలయు నని యామె యెప్పుడును వ్యాకులపడి యుండలేదు. ఉమా పతి సౌందర్యము మిగుల రమణీయమైనదని యామె యాతని మఱచి పోకుండఁ జూచుచుండెనా? అట్లుకాదు. ఆమె యాతనికంటె సుందరు లగు పురుషుల ననేకులఁ జూచియుండవచ్చును. కాని యుమాపతి వదనమండలమునఁగానవచ్చుచున్న యత్యాశ్చర్యకరసరళస్వభావము, ఆహ్లాదము, ఉత్సాహము, సహృదయత్వము, ధైర్యము, ప్రేమ సూచకములును, రమణీయములు నగునట్టి భావములు మఱియొక భావములు మఱియొకచోటఁ గనుఁగొనుట దుర్లభము. ఆబాలిక యట్టిగుణముల నెచ్చటను చూచియుండలేదు. ఆకారణముచే నామె

యయాచిత్తస్థలంబునఁ దనజీవనసారమైన హృదయ ధనమును సమర్పించుకొనియెను. ప్రపంచమునం దందఱి హృదయములందును, సమప్రాయమై నైసర్గికమైన హృదయభావ మొకటి యుండి యుండును. మీరెవ్వరికైన నుపకారము చేసితిరేని యట్టివారు స్వతస్సిద్ధమైన భావముచే మిమ్ముఁ బ్రేమించి మీయందుఁ గొంచె మయినను కృతజ్ఞతను జూపుచుందురు. ఇట్లగుటచేత నామె మనస్సాతనిమీఁద విశేషముగ లీనమయియుండెను.

ఇదియునుగాక ముక్తకేశిని మృదులహృదయమున నుమాపతి వదనచంద్రమండల మెల్లప్పు డుదయించుచుండుటకు మఱియేకారణ ముండునో దానిని మానసికవ్యాపారములఁ గల్పించిన యావిధాతయే చెప్పవలయును. ఉమాపతికి నిద్రాభంగ మెప్పుడగునో, యెప్పుడాతని మధురభాషణములు వీనులకు విందుసేయునో, యెప్పుడాతనిసందర్శనమునఁ దన జీవితము సార్థకమగునో యను నాలోచనములను చేసికొనుచున్న ముక్తకేశినికారాత్రి నిద్రపట్టలేదు. రాత్రి చాలసేపైన తరువాతఁ గొన్నినిమిషములు మాత్రమామె కొడలు మఱచిననిదుర పట్టెను. ఆనిద్రయయినతరువాత లేచి చూడఁగాఁ దెల్లవాఱుసమయమింకను కాలేదని యామెకుఁ దెలిసెను. అప్పుడు నిద్ర యసంభవమును, అనావశ్యకమునై యుండెను. ఆమె పరుండకయే యింటినుండి వెలుపలికి వచ్చి యరుగుపైఁ దిరుగాడుచుండెను. ఆమె సంచరించుచున్న ప్రదేశమునకు ప్రక్కనే యుమాపతి పరుండినగదియొక్క కిటికీ తెఱవఁబడి యుండెను. తాను పచారుచేయుచున్న స్థలమునుండి రెండడుగులు ముందునకుఁ బోయినయెడల నుమాపతియొక్క మనోజ్ఞరూపమును గనుంగొన వచ్చునని యామె యెఱుంగదు. వెనుదిరిగి వచ్చినప్పుడు కిటికీ తెఱచియుండుటను చూచెను.

ముక్తకేశిని యావంక( జూచెను. తిరిగి యక్కడనుండి కదలుట కిష్టము లేకపోయెను. ఆమె యక్కడనుండి కలదలేదు. మెల్ల మెల్లగా( గిటికీయొద్దకువచ్చి యినుపయూచలనుబట్టుకొని యేకాగ్రచిత్తముతో నుమాపతికమనీయాకారమును చూచుచుండెను. ఒక్కనిమిషములో నుమాపతికినిద్రాభంగమయ్యెను. ముక్తకేశిని యేమధురస్వరమును వినుటకు వ్యాకులపడుచుండెనో యామధురస్వరము తనపేరు నుచ్చరించినతోడనే యామె యదృశ్యయైపోయెను. ఆమెమనఃపూర్వకముగ నాసుఖమును బో(గొట్టుకొని యాస్థలమును విడిచిపోలేకపోయెను. సహచారిణియగు లజ్జాసఖియామె బలవంతముగాలాగికొనిపోయెను. ఆమెతనసహచారిణికి లో(బడిపోయెను.

ఉమాపతి ముక్తకేశిని యదృశ్యురాలయిన తరువాత "ముక్తకేశిని యిక్కడకు వచ్చినదా? ఆతరుణీమణి శయ్యనువిడిచి యిటకెందులకు వచ్చెను? అదినిజముగా నిక్కడకువచ్చి స్థిరముగా నిలిచియుండుట( జూచితిని. ఆసుందరి యరుణాధరసమీపమున( జిఱునవ్వుకూడ(జూచితిని. నన్ను(గూడనారమణీమణిచూచినది. ఎందులకు( జూచుచుండెనో? నేను దానిని చూచుటకెంత యాశపడుచుంటినో ఆసుందరియు నట్లే నన్ను( జూచుటకిష్టపడుచుం(డునా? అట్లే కావచ్చును" అని యాలోచించుకొనుచు నొకనిట్టూర్పువిడిచి "స్వప్నమేనిజమైనయెడల నేనెంత ధన్యు(డను" అనియనుకొనియెను.

ఇట్లుయోచించుకొనుచు శయ్యనుండి లేచి వెలుపలికివచ్చెను.

---

## పన్నెండవ ప్రకరణము

### నిద్రానంతరగమనము.

"గచ్ఛతి పుర శ్శరీరం ధావతి పశ్చా దసంస్థితం చేతః
చీనాంశుక మివ కేతోః ప్రతివాతం నీయమానస్య.

అభిజ్ఞానశాకుంతలము."

ఉమాపతి కొంపసేపటికి భట్టాచార్యునియొద్దకుఁ బోయి ఆజ్ఞనుపొంది మేనమామయింటికిఁ బోయెను. బయలుదేరిపోవునప్పుడు ముక్తకేశిని నొకసారి చూడవలయునని యాతని కాశకలిగెను. నలుదెసలనుజూచెను—ఆమెయగపడలేదు. చూచినంతమాత్రముననేమగును? అట్లు చూచినను అందఱియెదుట నామెతో స్వేచ్ఛగ మాటలాడుటకు వలనుపడదు.—మాటలాడలేఁడు—ఎందులకు మాటలాడలేఁడు? నిర్దోషముగా మాటలాడుట కేమిసందేహము? కారణమేమైననుండుఁగాక! రెండుదినములకు ముందైనయెడల నిట్లు జరిగియుండదు—రెండుదినములక్రిందటనే యుమాపతియో, ఏముక్తకేశినియో యిప్పుడు నాయుమాపతియే, ఆముక్తకేశినియేగదా! అట్టివా రిట్లుండుట కేమికారణము? మేముచెప్పనదేమనఁగా!—ఇప్పుడు వారు రెండు దినములకు ముందున్నట్లులేరు. హృదయముచే మనుష్యుఁడు కాఁగలఁడు బాహ్యకారణముచేత మాత్రమట్లుగాదు—వారిరువురి హృదయములును పూర్వమునందున్నట్లులేవు. అందువలనవారిప్పుడు మునుపటివలె లేరు.

ఎట్లైనఁ గానిమ్ము! ఉమాపతియు, ముక్తకేశినిని చూడకనే ఖిన్నమనస్కుఁడై బయలుదేరెను. అతఁడు గుమ్మముదాఁటినతోడనే ముక్తకేశిని వచ్చుచుండుటఁ జూచెను. అతఁ డానందముతో "ముక్తకేశినీ! ఎక్కడకుఁ బోయితివి?" అని యడిగెను.

ముక్తకేశిని యాప్రశ్నమున కుత్తర మీయలేదు—ప్రశ్నమున కుత్తర మీయవలయునని యిష్టముమాత్ర ముండెను. కాని యట్లు చేయలేకపోయెను. ఆమె యొక్కసారి యుమాపతిరమణీయాకారమును చూచుటకుఁ గోరికపడి—ఆకోరిక నెఱవేర్చుకొనుటకు కన్నెత్తి చూచెను. కాని, సిగ్గుచే నాచూపు లజ్జగింపఁబడియెను. ఉమాపతి వదనమునందలి యొక్కమనోహరచ్ఛాయమాత్ర మామె నయనాంచలమునఁ బడియెను—అంతలోఁ గన్నులు చెదరిపోయెను. ఉమాపతి యిరల "ముక్తకేశినీ! ఇప్పుడే పోయెదను" అనియెను.

ముక్తకేశిని మెల్లమెల్లగ "ఎప్పుడు వచ్చెదను" అనియెను.

ఉమా—— బహుశః సాయంకాల మొకసారి రాఁగలను.

ముక్త——రావలయునుసుడీ !

ఉమా——వచ్చెదను. నాకిప్పుడు సెలవిమ్ము!

ముక్తకేశిని సెలవీయలేదు——ఉమాపతి "ముక్తకేశినీ! పోయివచ్చెదను" అనియెను.

ఇట్లు చెప్పి యొక్కొక్కయడుగుముందునకు వైచుచుండెను—ముక్తకేశిని మెల్లగ నావంకకుఁ దిరిగెను. ఉమాపతియొకసారి వెనుకకుఁ దిరిగి చూచెను. తోడనే ముక్తకేశిని తననాపులచు మరల్చుకొనియెను.

చూచుచుండఁగనే యుమాపతిదృష్టిపథమునుండి దాఁటిపోయెను. ముక్తకేశిని యక్కడనే నిలుచఁబడి యేమో యోచించుకొనుచు సంక్షుభితమనస్కయై యింటిలోనికిఁ బోయెను.

—

పదమూఁడవ ప్రకరణము

——

"జనరాడదర్ప రేపే
ళినితుంముదు వెణ్గి మదు వెమాడదిరల్ నాం"
గుణాకర భారతచంద్రరాయ.

రెండుజాములప్రొద్దెక్కెను. ముక్తకేశిని యెవ్వరునులేనియొక గదిలోఁ గూర్చుండి మనస్సునం దేమో యోచించుకొనుచుండెను. ఆమె కేమియును, పాలుపోవుటలేదు. ఒక్కొక్కయాలోచనము బాగుగనున్నట్లు దోఁచుచుండెను. తుద కదియును సరిగా నున్నటులా మెకుఁ గనఁబడుటలేదు. ఈయాలోచనములో — — — ల

మయ్యెను. "అతఁడు వచ్చెదననిచెప్పి యింకను రాలేదేమి?—రాక పోయినను రాకపోవచ్చును. అతఁడెందులకు రావలయును?" అని తనలో మరల ననుకొనెను.

ముక్తకేశిని యిట్లాలోచించుకొనుచు నడుమనడుమ నాయాలోచనమును వదలి పిచ్చిదానివలె నేమేమో యనుకొనుచుండెను. భట్టాచార్యుఁడును నాతనిభార్యయును మఱియొకగదిలోఁ గూర్చుండి యన్యోన్యము నేదియో ముచ్చటించుకొనుచుండిరి. దానిని పాఠకమహాశయులించుక వినవలయును.

భార్య—అహా! ఎట్టిసుందరుఁడు? నిశ్చయముగ నాతఁడు మన్మథుఁడే! ఆతనిమాట లెంతమనోహరముగా నున్నవి! నాయభీష్టమేమనఁగా—ముక్తకేశినిని ఉమాపతికిచ్చి పెండ్లిచేయుటయే.

భట్ట—దోషరహితుఁడు. రూపవంతుఁడు. విద్యాసంపన్నుఁడు. మంచిప్రవర్తనముగలవాఁడు. వరునకెట్టిసద్గుణము లుండవలయునో యవి యన్నియు నుమాపతియందు నెలకొనియున్నవి.

భార్య—మీమాట లటుండనిండు. మన కట్టి యదృష్టము పట్టునా? ఇన్నిదినములు వెదకివెదకి వేసరిన ప్రయోజనమేమి? ఊరక యోచించుకొనుచుఁ గూర్చుండినందువలన లాభమేమి? మన మీ పెండ్లికుమారుని విడువఁగూడదు. ముక్తకేశినికిఁ బెండ్లియీడు దాఁటినది.

ముక్తకేశినియుఁ బార్శ్వమునం దున్నగదియందుఁ గూర్చుండి తనలో నేమేమో యాలోచించుకొనుచుండెను. ఆమె తల్లిదండ్రులు మాటలాడుకొనుచున్న యంశములలోఁ దనకుఁ గావలసినవానిని చెవియిచ్చి వినుచుండెను. కాని, మొదట నావైపున కామె దృష్టి పోలేదు. వారు "ముక్తకేశిని" యని యనుకొనినమాట చెవినిఁబడగానే, తల్లిదండ్రులు తన్నుఁగూర్చి మాటలాడుచుండిరని యామె

తెలిసికొనియెను. అప్పుడాసంగతులను దెలిసికొనమనసుపడి, ఆమె ప్రనకుఁ జెవినిడి యాలకించుచుండెను,

భటా—ఆయాశను వదలుకొంటిని. మనము సమాజభ్రష్టులమై స్వస్థలమును విడిచి యీవిదేశములకు వచ్చి వాసము చేయుచుంటిమి. ఇక్కడ మనజ్ఞాతులు గాని, కుటుంబసంబంధులు గాని, యెవ్వరును లేరు. మన పిల్లను పరిగ్రహించువారు ముఖ్యముగ మనలను గూర్చి తెలిసికొనుటకై ప్రయత్నింతురు. అప్పుడందఱును వినుటకుఁ గారణమగును. హరిహరుఁడొక్కఁడే మనకు రక్షకుఁడైయున్నాఁడు. ఆతనియాశ్రమముచేతనే యిక్కడ నివసించుచుంటిమి. నేను నిర్దోషినని యాతఁడు బాగుగ నెఱుఁగును. శత్రుమధ్యమునఁ బడి యీవిధముగా దుర్దశకు లోనైయుంటిని. ఏకారణముచే ముక్తకేశిని కింకను బెండ్లికాలేదో, ఆకారణము హరిహరునకే తెలియును. వానియాజ్ఞానుసారముగ నది నిలిచియుండెను. ముక్తకేశినికి పెండ్లియీడు మీఱెనని నాకుఁ దెలియదా? మఱియెవ్వరైననైనయెడల జనులు గుంపులు గూడి మనసు|వచ్చినట్లెల్లఁ జెప్పుకొనరా? కేవలమును హరిహరుని భయముచేత మనలనుగూర్చి యెవ్వరును నోరెత్తుటలేదు. ఇట్టిస్థితిలో నేమి జరుగునో యోచించి చూడుము! వయసు వచ్చినపిల్లను పెండ్లి చేయకుండనుంచినయెడల మహాపాపమునకు హేతువగును. కులీనులు కులమును గాపాడుకొనవలయును. ఆసంప్రదాయముకొఱకు దేశమునందు ముక్తకేశినికంటె నధికవయస్సుగలవారై వివాహములేకుండనున్న కన్యకలనేకులు గలరు. అందువలన మనము నిందకుఁ గారణభూతులము కాము. ఎట్లైన గానిమ్ము. ఏమిచేసియైనను ముక్తకేశిని వివాహమును మిగుల జాగరూకతతో నొనరింపవలయును.

భార్య—మీరేకారణమును జెప్పితిరో దానికై హరిహరుఁడు మనపిల్లను ఉమాపతి కిచ్చుట కిష్టపడకుండునేమో?

భట్టా—లేదు—ఆవిషయమునందు నాకు ధైర్యము కలదు. హరిహరుఁడు నామాటను ద్రోసివేయఁడని నాకుఁ దెలియును. తనకు పెండ్లికానిమేనల్లుఁ డొకఁడుండెనని యిన్నిదినములవఱకును హరిహరుఁడు నాకుఁ జెప్పియుండలేదు.

భార్య—అతనికిఁ బెండ్లికాలేదని మీకెట్లు తెలియును?

భట్టా—నాకది మొదటినుండియుఁ దెలియును. పెండ్లియైన యెడల నాకుఁ దెలియకుండ జరుగదు.

భార్య—ఏమైనను గానిండు— ఈ శుభసంఘటనము ఎట్లు జరుగునో ఆప్రయత్నమును జేయవలయును.

ఆదినమున నా దంపతు లిరువురును కుమార్తె వివాహమును గూర్చి యీవిధముగ నిశ్చయముచేసికొనిరి. ముక్తకేశిని యీసంభాషణమంతయును వినియెను. ఆమె కెంపెదవులనుండి ముసిముసి నగవు తలసూపుచుండెను. ఆమె మనోహర వదనచంద్ర మండలమునుండి, యొక్కమాఱుగ హర్షమును, లజ్జయును ప్రకటన మగుచుండెను. లజ్జయెందులకు? అది యామెకే తెలియును. ఆమెమనస్సునందు, జననీజనకులు తన్ను ఉమాపతికిచ్చి వివాహము చేయువలయునను నభిప్రాయము నిప్పుడు నిర్ధారణచేసికొనిరని భావించుకొని, మరల, అట్లు కాదు. వారింకనునేమనుకొనిరో దానిని నేనువినలేదు—అట్లు గాక అదియంతయును దెలిసికొనలేకపోయితినేమో?—లేదు. వారు చెప్పుకొన్నదంతయు నామూలాగ్రముగ వింటిని. ఏమియును సందేహము లేదు'' అని యనుకొని ముక్తకేశిని యించుకనవ్వుకొనియెను. ఆమె యానందతరంగములలో సందేహసైకతములువిఱిగికంటికిఁ గానరాకపోయెను. ఆమెమనసునుండి సమస్తాలోచనములును వెడలి పోయెను కేవలము ఆనందము, సుఖమయమగునాశ, భవిష్యత్తునుగూర్చినకల్పనము, ఇవియన్నియు నామెహృదయమునం దధికారము సేయఁదొడఁ

గెను. ఆసుందరిదృష్టియందు సంసారము సుఖాలయమనునమ్మకము తోఁచెను. సంసారము నెఱుఁగనియువతి సమస్తకార్యములయందును ఎల్లప్రదేశములయందును ఆనందము మొదలగు మంచిలక్షణములనే కాంచుచుండెను,

ముక్తకేశిని తిరుగ యోచించుటకు మొదలుపెట్టెను. కాని యామె కేమియును తోఁచుటలేదు. మఱియొకపనిమీఁద నచటినుండి బయలుదేఱిపోయెను.

---

## పదునాల్గవ ప్రకరణము

---

### సౌకుమార్యము

లలనయ కేశపాశభయదిం చమరీమృగమద్రికందరం
గళొళడగిత్తు వక్త్రభయదిం శశియేరిదుదంతరిక్షమం
జళనయనక్కె పుల్లిగళు మింగొరలండకికొకిలంగళుం
లలితగతిక్కె దంతిగళు మంజుతమాళ్పువరణ్యావాసమం

(S. G. N) విద్యాపతి.

మేమిదివఱకు ముక్తకేశిని ననేకస్థలములయందు సుందరియని వర్ణించి యుంటిమి. ఆమె యెట్టిసౌందర్యవతియో తెలిసికొనుట కెల్ల రహృదయములయందును స్వతస్సిద్ధముగఁ గుతూహలము గలిగియుండకపోదు. ఆకుతూహలమునుసాధ్యమైనంతవఱకు చరితార్థముచేయుటయే యీప్రకరణముయొక్క ముఖ్యోద్దేశము. కాని, సౌందర్యముయొక్క ప్రకృతిపరిచయమును గూర్చుట చాలఁ గష్టసాధ్యమైనపనియైయున్నది. దేశభేదముచేతను, జాతిభేదముచేతను ప్రకృతిభేదముచేతను సౌందర్యమునందలిరుచియును భిన్నభిన్నమయి వివిధముగఁ దో

చుచుండును. ప్రపంచమునందలి వేఱు దేశములందు వేఱు వేఱు జాతి సముదాయమునందు సౌందర్యము వేఱు వేఱుగఁ గన్పట్టుచున్నది. ఒకజాతియందు మంచువలెఁ దెల్లనైనశరీరమును, రాగివెంట్రుకలును, పిల్లికన్నులును గలసుందరిసౌందర్యము మోహమును గొలుపుచుండును. మఱియొకజాతియందు నఖరకులిశప్రహారణియు, సర్షపసమలోచనయునగు కాంతను గారవింతురు. వేఱొకజాతియందు నల్లనిశరీరమును, స్థూలకాయమును, తుట్టపెదవులును గలయంగనయొక్క లావణ్యమును గొనియాడుచుందురు. ఇంకొకజాతియందు సువర్ణచ్ఛాయయు, సుస్థిరకటాక్షమును, నీలచికురజాలమును గల రమణీమణిరూపముచే ముగ్ధులగుచుందురు. కొండొకజాతియందుఁ జంచలకటాక్షాంచలయు, త్వరితపాదవిక్షేపయు, శుకముఖతుల్యనాసయు నగు సుందరీమూర్తియం దతిలోకసౌందర్యమును గాంచుచుందురు. మొత్తముమీఁద నీ విషయమం దెచ్చటను ఏకీభావము కానఁబడుట లేదు. సౌందర్యసంబంధమయిన ప్రపంచమే వివిధపరిణామ వైషమ్యములచే నిండియున్నది. సౌందర్యవిషయమయిన యభిరుచియొక్క భేదభావముచేతనే సౌందర్యసాధకములైనయాభరణములందును రుచిభేదమగపడుచున్నది. ఒకదేశమందుఁ బక్షిపక్షములే మనోహరభూషణములుగఁ బరిగణింపఁబడుచున్నవి. మఱియొకదేశమందుపచ్చబొట్టులే శరీరసౌందర్యము నభివృద్ధి నొందించును. రుచిభేదమువలననలంకారపద్ధతియును భేదించుచున్నది. అది యెట్లైనం గానిండు. ఒక యాశ్చర్యకరమయిన విషయమేమనఁగా ఇన్ని జాతులున్నను సాంసారికసంబంధమయినవిషయములం దొక్కమాదిరిగనే యుండవలదా? కాని యీ విషయమునందును నేకీభావ మంతగాఁ గానఁబడుట లేదు. దేశజాతిభేదములమాట యటుండనిండు—ఈ విషయమునం దిద్దఱి యభిప్రాయమయిన నొక్కటిగా నుండుట లేదు. ఏకారణముచేత నీగ్రంథ

కర్త ముక్తకేశిని యత్యంత సౌందర్యవతి యని తెలిసికొనఁగలిగెనో యాకారణముచేత నే భిన్నాభిప్రాయులగు చదువరులెవరైన నామెను సామాన్యయనియు, గుచ్ఛితయనియు నూహింపవచ్చును. అట్లగుటచే ముక్తకేశినీరూపమును మీాసమీాపమునఁ బ్రదర్శించుట యత్యంత మసాధ్యకార్యమని సామాన్యులు గూడఁ దెలిసికొనగలరు. మేమా సంబంధమునుగూర్చి యింకనైనను కొంచెము చెప్పకపోయినయెడల పాఠకులందెవరైన నొకరు ముక్తకేశిని యంతసౌందర్యవతికాకపోవుటచేతనే గ్రంథకారుఁడంతయును గప్పిపుచ్చెననియనుకొందురు. ఇంత గొడవయేల? సహృదయులైన చదువరులు గ్రంథకర్త కష్టమును చూచి విచారింతురో? లేక పరిహసింతురో మేము చెప్పఁజాలము. బరిహసించువారే యైనయెడల నిఁకముందు పరిహసింపఁగూడదు. ప్రపంచమునందిప్పుడల్పుఁడైన యీ గ్రంథకారుఁడు మాత్రమేవిపత్తునఁ బడిపోయెనని యనుకొనఁగూడదు. ఇతరులకు సంతోషముం గూర్చుకొఱ కెవ్వరెప్పుడేకార్యమునైనను చేయుటకుఁ బ్రయత్నింతురో వారందఱు నిట్టికష్టములకు లోఁబడియేయుందురు. ఈశ్వరానుగ్రహముగలమహామహోపాధ్యాయులును, అసామాన్యులునగు కవులందఱునునిట్టికష్టములననుభవించువారే. ఇతరులమాటలెక్కయేమి? కవికులచూడామణియగు కాళిదాసుఁడు గౌరీసౌందర్యమును వర్ణించుటలో ననేకవిధముల వర్ణించియునుసంతుష్టినందలేకపోయెను. ఆవర్ణన మందఱికిని సంతోషమును గలుఁజేయునో లేదో యనుసందేహముచే నుపసంహారమం దీక్రిందివిధముగాఁ జెప్పెను.

"సర్వోపమాద్రవ్యసముచ్చయేన, యథాప్రదేశం వినివేశితేన
సానిర్మితావిశ్వసృజా ప్రయత్నా దేకస్థసౌందర్య దిదృక్షయేవ"

ఇట్లు చెప్పి వర్ణనమును పూర్తిగావించెను. విచారశీలులును, విమర్శకులు నగు పాఠకులు స్థిరచిత్తులై యిట్టి మహాకవి హృదయ

మెట్లుండునో దానిని తెలిసికొనవచ్చును. దీనినిగూర్చియే ఇంగ్లాండు దేశకవిసార్వభౌముఁడును, కీర్తిశేషుఁడు నగు షేక్స్పియరు వ్రాసినది యేమనగా—

"Beauty is bought by judgment of the eye
Not uttered by base sale of Chapman's tongue."

ఎట్లైననంగానిండు—మేమీకష్టతరకార్యమునందుఁ బ్రవేశించితిమి. కాని వ్రాయుటకేమున్నది! అందఱును తెలిసికొనఁగలిగినయే వస్తువులతో నీసుందరిసౌందర్యమును పోల్చిచెప్పఁగలము? కీర్తికాములైన మహాకవులలో నొక కవిశేఖరుఁ డొకటిరెండు సంవత్సరముల క్రిందట నొకసుందరిని వర్ణించుచు పురుషపాఠకులకు తమ ప్రియభార్యలవలె నున్నదనియు, స్త్రీపాఠకులకు తమప్రతిబింబములవలె నున్నదనియు లిఖించియున్నాఁడు. సహజసౌందర్యవర్ణనమున కిది యొకమంచియుపాయము. మేమట్లే చేయుచున్నాము. కాని దానివలన నొకదోషము సంభవించుచున్నది. ఏమనగా—ఆకారణముచేత స్త్రీపురుషపాఠకులు సంక్షుభితు లగుదురు. పురుషపాఠకులు తమ ప్రియుల కంటెను, స్త్రీపాఠకులు తమకంటెను వేఱుగ సుందరీమణులు ప్రపంచమునసే లేరని యనుకొనుచుందురు. ఇప్పుడొకటిరెండు సంవత్సరములక్రిందటనే యట్టి సుందరి యున్నదని ప్రత్యక్షముగఁ జూపించితిమేని వారు తమపూర్వాభిప్రాయములను సంస్కరించుకొనవలసివచ్చును. అభిమానవతులగు స్త్రీపాఠకులు విశేషరూపవతులై యుందురని మేమును ఒప్పుకొందుము. కాని దానివలనఁ బ్రయోజనము లేదు. వేఱొకయుపాయమును వెదకుదము.

కృష్ణనగరరాజసభ నలంకరించియున్న వర్ణనాపరతంత్రుఁడగు భారతచంద్రకవీంద్రుఁడు, రూపమున లక్ష్మియనియు, గుణమున సరస్వతి యనియు చెప్పి యొకస్త్రీవర్ణనమును ముగించెను. మేము లక్ష్మి

నైనను, సరస్వతి నైన నెప్పుడును జూచి యెఱుంగము. పాఠకమహాశయులు మాత్రము చూచియుండిరా? అసురనాశినియు, మహిషాసుర మర్దనియు, సహస్రబాహుసమన్వితయు నగు మహాకాళియొక్క యిరువంకలను నిలిచియున్న లక్ష్మీ సరస్వతీ విగ్రహములను మాత్రము మేము చూచియున్నాము. అవియే లక్ష్మీసరస్వతుల ప్రతిబింబములని తలంచితిమి—ఆలక్ష్మీ సరస్వతులకు మనమొక నమస్కారము చేయుదము. కాని, వారితో మనము ముక్తకేశినిని బోల్చి చెప్పఁజాలని మాయపరాధమును క్షమింతురుగాక!

వేఱొకయుపాయముచేత నిప్పుడు విశదమునైనచిన్నచిన్న మాటలతో ముక్తకేశినిని పాఠకులహృదయమున ప్రవేశపెట్టుటకుఁ బ్రయత్నింతుము.

ముక్తకేశినికి కొంచెమించుమించుగఁ బదునాఱువత్సరముల ప్రాయముగలదు. ఏవయసున రమణీమణులు బాల్యమును విడిచి యౌవనమున నడుగుపెట్టుచు ప్రపంచమునందలియానందవిధానము నేర్పఱింతురో, ముక్తకేశిని కిప్పుడావయసు వచ్చియున్నది. ఆమెను సంపూర్ణావయవయు, నవనవోన్మేషయౌవనయు నగు మనోహరమూర్తియైన బాలికయని చెప్పవచ్చును. ఆమె యందమునందు విలాసచేష్ట లగపడక పోయినను ప్రీతియు నానందమును పరిపూర్ణములై యుండెను. ఆమెనుచూచినమాత్రమున నే నేత్రములును, మనస్సును ప్రాణమును, దేహమును, ఇవియన్నియు నామెకు సమర్పింపఁగోర్కెముకలునుసు. ఈజగన్మోహినీసౌందర్యమునందు నిష్కళంకమై, దివ్యమైన లావణ్యము విరాజమానమగుచుండును. ఎవ్వరామెగు చూచెదరో వారి దుర్వ్యాపారము లన్నియును తొలఁగిపోవును. ఆమెను స్నేహభావముచేఁ జూడవలయునను నభిలాష వొడమును. ఆమె

యిష్టమును దీర్చుకొనుటకగ్ని హోత్రమునైన భేదించుకొని పోవుదురు. ఆమె హితముకొఱకేపనియందైనను కష్టమును లెక్కసేయరు.

ముక్తకేశినియవయవము లన్నియు లజ్జచే నావరింపఁబడియుండెను. ఆమె మూర్తియంతయును లజ్జామయమై యుండెను, ప్రీతియును, పవిత్రతయు నెడతెగకుండ వర్ధిల్లుచుండెను. మీరామె నొక్కసారి చూడుఁడు! ఆమె, ప్రీతికిని ఆదరమునకును పాత్రురాలే యని భావించుట గాక మఱియొకలాగు యోచించువారు ధైర్యవంతులై యుండవలయును. ఎల్లప్పుడు నామెసన్నిధినే యుండుఁడు. ఎల్లప్పుడునామెకార్యములయందే కాలము గడపుట కిష్టపడియుండుఁడు! మీ రెట్టియుద్దేశము కలిగియున్నను మీమనస్సునం దెట్టిదురూహయును పుట్టఁబోదు. కొందరియందము చూచినంతమాత్రముననే ప్రేక్షకులచిత్తము నొక్కసారిగ నాక్రమించుకొని వికారము కలిగించి పరోక్షమునందుఁగూడ వ్యాకులత్వము గూర్చుచుండును. ఈమెసౌందర్యముమాత్రమట్టిదికాదు. ఈమెనుచూచినయెడలఁ జూపఱు నిరంతరానంద భరితులగుదురు. మఱియు సౌందర్యమువారిహృదయమునందుఁ జిత్రింఁబడియుండును. ఆమెను చూచుటచేఁ గలిగినయానంద మెందుకొఱకు పుట్టుచున్నదో, ఆమెశరీరముయొక్క యేయవయవమునందలి విశేష సౌందర్యమును చూచుటచేఁ గలుగుచున్నదో దెలుసుకొనుట దుస్సాధ్యము. ఆమెసుకుమారశరీరిణి. ఆసుందరీమణి మనోహరలలాటము ప్రతిభకును, సరళతకును క్రీడానివాసము. ఆమెకోమలాంసములపైఁ బడుచున్నకుటిలకుంతలంబులుగుచ్ఛగుచ్ఛములై మెఱయుచుండును. ఆమె సుందరకంధరము కుపితమరాళీగ్రీవసన్నిభంబై యులరారుచుండెను. ఇవియన్నియు నామె సౌందర్యమును మఱింత వృద్ధిపఱచుచుండెను. సముజ్జ్వలములయి యున్న యామెనయనములయందామె పవిత్రస్వభావము ప్రతిఫలించుచుండెను,

ముక్తకేశిని కనుబొమ లాకర్ణవిస్తృతములై విండ్లవలె వంగి మనోహరములై యుండెను. నాసిక సుందరవదనమండలమునకు వింత యందము నిడుచుండెను. అధరోష్ఠములు నిరంతరములై మధురమంద హాసకలితములై యానందోద్దీపకములై యుండెను. చిఱునగవు వెడలి వానిని విడిపించినప్పు డానడుమ నిగనిగమని పలువరుసలు మెఱయుచుండును. ఆమె బాహువల్లిక లతిసుకుమారములై నవనీతకల్పితములో యనుభ్రాంతిని గలిగించుచుండును. ఆమెశరీర మించుకదీర్ఘమైనది. కాని ప్రత్యవయవమును దానికిఁ దగినట్లుగ సంవర్ధితమైయుండుట చేత నాదైర్ఘ్యము నామెసౌందర్యమును మఱింత వృద్ధిఁబొందించుచుండెను. ఆమెశరీరమెట్లు పరిణమించినదో, ఎట్లు వికసించినదో, ఎట్లు వసంతనవమల్లికాలతా సదృశమై తేజోవంతమైనదో, ఆకారణముచే నామె యీనయసునందే సంపూర్ణయావనవతియై కన్పట్టుచుండెను.

ముక్తకేశిని కంఠస్వర మతిమధురమైనది. దానినొకసారి విన్న యెడల నెప్పుడును వినవలయు నని కోరిక వొడముచుండును. మహాపాపాచరణమునం దాసక్తమైన మనసుకూడ నామధురకంఠనాదమును విన్నయెడల నాదుష్కృత్యముసుండి యించుక విశ్రాంతి నొందగలదు. ముక్తకేశిని విదుషీమణికాకపోయినను ఆమెహృదయ మనేకాంశములయం దౌన్నత్యమును వహించియుండెను. ఆమె హృదయమున ప్రతిభ యున్నది. దానిమూలమున మిగులజ్ఞానవంతురాలై యుండెను, అరుణోదయమున శయ్యనుండి లేచి సాయంకాల మగువఱకు జీవజంతువులు, చంద్రసూర్యనక్షత్రములు, వృక్షములు' లతలు మొదలగువాని పరివర్తనమును ప్రకృతిరమణీయముగను చూచుచు నానందింపవలయు ననునభిలాష యామె హృదయమున సంపూర్ణమయి యుండెను, ఎవరైన నామెమీఁదఁ గోపించినయెడల నామె కన్నులు

విస్ఫురితమ్మై యశ్రుధారా పూరితములై సంచలించుచుండును. ఆకా రణముచేత నాతఁడెప్పుడును పరుషముగ మాటలాడడు. నిందనీయ ములగు స్వకార్యములను చేయుడు.

---

## పదిహేనవ ప్రకరణము

### వాతాయనము

"Two of the fairest stars in all the heaven
Having some business do entreat her eye,
To twinkle in their spheres till they return"
Shakespeare

ఉమాపతి వేనవనామమ్మైన హరిహరరాయలు శ్యామలవర్ణ ముగలవాఁడు. ఆతని కేఁబదిసంవత్సరములకంటె హెచ్చువయసుండు ను. వయోధర్మముచేత శిరోజములు మిగుల నెఱసి యుండెను. హిం దూబ్రాహ్మణుల కులాచారము ననుసరించి యాతఁడు తనతలపై గో ష్పాదమంత జుట్టుమాత్ర ముంచుకొనియుండెను.

ఆతఁడు మిగుల సరళస్వభావము కలవాఁడై యుండెను. ఆత నిసుస్వభావముచే నందఱును బ్రేమించుచుండిరి. గ్రామస్థులందఱును నాతనియాజమాన్యమునకు లోఁబడియుండిరి. ఆగ్రామమం దెవ్వరును నాతని యభిప్రాయమునకు విరోధముగా నసంతుష్టింగూర్చు కార్య మేదియును జేయరు. ఆతఁ డెప్పుడును చెడ్డమార్గమును ద్రొక్కు వాఁడు కాఁడు.

ఆతనికిఁ బిల్లలు లేరు. కాని, సంతానము కలుగకపోలేదు. ఆతని కిద్దఱుకుమారులు కలిగిరి. పెద్దకుమారునకుఁ బెండ్లియయ్యెను. వివాహామైనపిమ్మట నాతఁ డేదో పనిమీఁద విదేశమునకుఁ

బోయెను. అదిమొదలుకొని యాతనిజాడ యేమియును తెలియుట లేదు. ఎంత వెదకినను అతఁడెందును గానఁబడలేదు. హరిహరుఁడాత నివెదకు ప్రయత్నము మానివైచి యెట్లో మనసు కుదుటపెట్టుకొని చిన్నకుమారుని జూచికొనుచుఁ గాలముగడపుచుండెను. కాని దైవ మందులకు సహింపలేక ఆచిన్నిబిడ్డ నకాలమృత్యువువాతఁద్రోసెను. ఇట్లయినపిమ్మట హరిహరుఁడు కొన్నాళ్ళపర్యంతము విరాగియై యుం డెను. ఎల్లరు నాతని గౌరవించుచు అనేకవిధములఁ జెప్పుటచేతను, మేనల్లుఁడైన యుమాపతికోరికచేతనుఅతఁడు తిరిగి లోకవ్యవహారము నందుఁ బ్రవేశించెను. సర్వస్వము నిప్పుడాతని కుమాపతియే. అతఁ డుమాపతిని మిగులఁ బ్రేమించుచుండెను. ఆతని జూచికొనుచు హరి హరుఁడు సంసారయాత్ర గడపుచుండెను. ఉమాపతియు శోకాతు రుఁడైయున్న మేనమామయందు భక్తిగలవాఁడై విశేషముగఁ బ్రే మను కనఁబఱచుచుండెను. ఒకనెలలో పదునైదు దినములు మేన మామయింటియొద్దను, మిగిలిన పదునైదుదినములును స్వగృహము నందును నాతఁడు నివసించుచుండెను. రెండుసంసారముల నొక్కచో టనే చేర్చుటకుఁ బ్రయత్నించుచుండెను. కాని, అనేకకారణములచే నది సాధ్యముకాకపోయెను. ఉమాపతి యెల్లప్పుడును గోపాలపురము నకుఁ బోవుచువచ్చుచుండుటచే నాతఁడందఱికిని బరిచితుఁడై యెల్లర స్నేహమునకును బాత్రుఁడయ్యెను.

ఉమాపతి మేనమామయింటికి వచ్చి యైదుదినము లయ్యెను నేఁటిమధ్యాహ్నమున మామయును, అల్లుఁడునుమాత్రమే భోజనము నకుఁ గూర్చుండిరి. వారుభోజనముచేయుచు ఆమాటయునీమాటయు నాడుకొనుచుండిరి. ఆప్రసంగవశమున ఉమాపతిముక్తకేశినినిఆపదనుం డిరక్షించిన వృత్తాంతముగూడవచ్చెను. భట్టాచార్యుఁడుమిగులసత్పు రుషుఁడని కూడఁ జెప్పికొనిరి. ఇన్నిదినములవఱకు భట్టాచార్యునికు

మాత్రైక వివాహముకాలేదను ప్రసంగముగూడవచ్చి, "అందులకేదైనకారణముండియుండును. అది నీవెఱుఁగుదువా" అని యుమాపతి మేనమామ నడిగెను.

ఇట్లడిగి యుమాపతియూరకుండెను. ఇట్లు ప్రసంగించుకొనుచు వారు భోజనముచేసిరి. సాయంకాలమునం దుమాపతి యటు నిటు దిరిగివచ్చుటకై బయలుదేరిభటాచార్యునిగృహమున కేగెను. భటాచార్యుఁ డింటియొద్ద లేఁడు. ఆతనిభార్య యాతనినాదరించి కూర్చుండుమనియెను. అతఁడట్లు చేసెనుకానిఆతనిమనసుమాత్రము స్థిరముగా నుండలేదు. అదెందులకో? ఆతఁ డెవ్వతెను జూచుటకయి వచ్చెనో ఆమె యెక్కడ నున్నది? ఉమాపతి యటునిటుచూచెను. ఏగదియం దాతఁడు మొదటఁ బండియుండెనో, నిద్రనుండ లేచి యేగవాక్షము నుండి, ముక్తకేశినీముఖచంద్రకాంతి నీక్షించెనో, ఆగదిగవాక్షముల వైపున కాతఁడు చూచెను. చూడదలఁచికొనిన వస్తువు కానఁబడక పోయెను. ఆఛాయమాత్రము హృదయమునందుఁ బ్రవేశించినతోడ నేయాతఁడు ప్రఫుల్లచిత్తుఁడయ్యెను. సగము తెఱువఁబడిన కిటికీనుండి యామెవిశాలనేత్రములను చూచెను. ఆనేత్రములు లక్ష్మీనివాసస్థానములని తెలిసికొని తన్మయుఁడై వాని నింకనుఁ జూడ నారంభించెను. చూచినకొలఁది నింకను జూడమనసగుచుండెను. ఈసమయమునందు భటాచార్యునిభార్య ఉమాపతి నచ్చట కూర్చుండుమని చెప్పి యేదో పనిమీఁద వెడలిపోయెను. ఉమాపతి యట్లే కూర్చుండి యుండెను. ఆతనిచూపులింకను గవాక్షమువంకకే పోవుచుండెను. అప్పుడు సమీపమునఁ బరుండియున్న యొకకుక్క యఱచెను. ఉమాపతి తనముఖమును వెనుకకుఁ ద్రిప్పికొని తిరిగి చూడఁదగినదానిని చూచుటకై గవాక్షమువైపునకు దిరిగి తనచూడ్కుల నట్లే ప్రసరింపఁ జేయుచుండెను. ఆగవాక్షద్వారము మునుపటికంటె కొంచెము హెచ్చుగ తెఱవ

బడియుండెను. అప్పుడు ముక్తకేశిని వికసితముఖారవిందముసంపూర్ణముగ నాతనికిఁ గనఁబడియెను. పొంగి పొరలుచున్న నదివలె విశదహాసమయమయియున్నయామెవదనమండలమునాతఁడేకాగ్రదృష్టితోఁ జూచెను. ఆవదనమించుక యవనత మయ్యెను. కాని, గవాక్షములు మాత్రము మూయఁబడి యుండలేదు.

బ్రాహ్మణి ఉమాపతికొఱకు ఫలహారములను దీసికొనివచ్చి ఫలహారమయినపిమ్మట "ఉమాపతికి నిర్మలోదకమును తాంబూలమునుదెచ్చియిమ్ము" అని ముక్తకేశిని కాజ్ఞాపించెను. ముక్తకేశిని తోడనే లజ్జచే సంభ్రమించుచునీరును తాంబూలమును దెచ్చి తల్లియొద్దనుంచెను. తల్లియు "నేనేమిచేసికొనను? ఉమాపతికిమ్ము!" అనియెను

అవనతముఖయైనముక్తకేశిని ఉమాపతి కిచ్చుటకై యాయుదకమునుతాంబూలమునుతీసికొనియెను. కాని అధికలజ్జాభయంబునం గలిగినసంభ్రమముచే జలకలశమును, తాంబూలపుబళ్లెరమునునామె చేతులనుండి జారిపడియెను. మందహాసముఖారవిందయయి ముక్తకేశిని సిగ్గుచే నచటనుండి పాఱిపోయెను.

"అయ్యో! వెఱ్ఱిదాన? ఇంతసిగ్గెందులకే?" అనియామెతల్లి లేచి ఉదకమును తాంబూలమును తీసికొని వచ్చుటకు లోపలికిఁ బోయెను. ఉమాపతి ముక్తకేశినియొక్క లజ్జాకలితభావములను గూర్చి మననము సేయఁ దొడఁగెను.

తుదకు బ్రాహ్మణియే ఉదకమును తాంబూలమును దెచ్చి యిచ్చెను. ఉమాపతి తాంబూలమును వైచికొని సాయంకాలమగువఱకును అక్కడనేయుండి తరువాతబయలు దేరిపోవుచు మరలనొక్కసారియైన ముక్తకేశినిమనోహరవదనమును చూచుచుండఁగనే పోయెను.

---

# పదునారవ ప్రకరణము

## వివాహసంబంధము.

"O, nwo such silver currents, when they join
Do glorify the banks that bound them in.
Shakespeare.

ఉమాపతి వెడలిపోయిన రెండువారములకు కాళిదాసశాస్త్రాచార్యుఁడు ఉమాపతికి ముక్తకేశిని నిచ్చి వివాహము చేయవలయునని హరిహరునితో ముచ్చటించెను. ఉమాపతిమేనమామయగు హరిహరుఁడిందులకు సమ్మతించెను. నాఁడుమొదలు వారు పరస్పరబంధుభావమును దెలుపుకొనుచుండిరి. వివాహమగుటకేవిధమయిన యాక్షేపణమును లేదు. సంబంధము స్థిరపఱచినదినముననే హరిహరుఁడుతన చెల్లెలగు నుమాపతితల్లి యుద్దేశమును తెలిసికొనుటకు సప్తగ్రామమునకీ సమాచారమంతయును వ్రాసి పంపెను. ఉమాపతితల్లియు మంచిస్వభావముగలపురంధ్రీరత్నము—ఆమె తనభర్తలేకపోవుటచేఁ దనసోదరుఁడే తనయోగక్షేమములకుఁ గర్తయని యనుకొనుచుండును. వాస్తవముగ హరిహరుఁడును. ఉమాపతిక్షేమమునే కోరుచుండును. ఇట్టి సోదరునిమాట కామె జవదాఁటునా? ఆమెయానందపూర్వకముగ సమ్మతించెను—మఱియు ముందు తనయింటికి రాఁబోవుకోడలియొక్క స్వభావసౌందర్యసౌశీల్యములంగూర్చి యోచించుకొనుచుండెను. హరిహరుఁడు వ్రాసినట్లు పెండ్లికూఁతురు సౌందర్యవతియే యైయుండవచ్చునని యనుకొనియెను. కోడలు కొంచెమీడుమీఱినపిల్లయని యామె వినియున్నది. అయినను నామె యసంతుష్టురాలు కాలేదు. పెండ్లికొడుకును వయసువచ్చినవాఁడే. ఇంతేకాక తానువృద్ధురాలైయుండెను. ఈకాలమునకుఁ దగినట్లు కోడ లింటికి వచ్చినయెడలఁ దనకు ఇ

ల్లును సంసారమును గూర్చినవిచారములు తగ్గిపోవును. ఇదియంతయు నాలోచించుకొని యామె యీసంబంధమున కేమియునడ్డు చెప్పలేదు.

ఏయాక్షేపణమును లేకుండ వివాహము స్థిరపడియెను. ఏముక్తకేశినిని తానారాధించుచున్న దేవిగ భావించుచుండెనో, ఏముక్తకేశినిమధురవాక్యములను వినుటకుఁ దానిష్టపడుచుండెనో, ఏముక్తకేశినియొక్క యనుపమాన సౌందర్యము తనహృదయఫలకమునందు చిత్రింపఁబడి యుండెనో, ఏముక్తకేశిని సుగుణగణముచేత తాను ముగ్ధుడై యుండెనో, ఆముక్తకేశిని—అపూర్వాకృతపుణ్యలబ్ధయైన—పవిత్రయైనముక్తకేశిని—అనాయాసముగఁ దనసహధర్మచారిణియై భూమియందే స్వర్గసుఖముం గూర్పనున్నదని యానందించుటకుఁ గారణభూతురాలుగాదా? ఉమాపతి సుఖమునకు మేరలేదు. ఆలఁడు ప్రాణేశ్వరియైన ముక్తకేశిని నిశ్చయముగఁదనసొమ్మని యనుకొనుచు సుఖముగాఁగాలయాపనము చేయఁగలశుభదిన మెప్పుడు వచ్చునని మేఘోదకమునాశించియున్న చాతకమువలె నిరీక్షించుచుండెను. విభ్రాంతులైనజనులు తలంపులు క్లేశములకుఁ గారణము లని చెప్పుదురు. అట్లుచెప్పుట చాలతప్పు. తలంపు లెల్లప్పుడును హితమును గూర్చుసఖులవలె మనోవినోదమును గూర్చునవి. ప్రబంధోపకరణము లని యుమాపతిహృదయముం దిప్పుడున్నతలంపులనుగూర్చి యాలోచించి చూచినయెడల సులభముగఁ దెలిసికొనవచ్చును. ఉమాపతి యీసమాచార మంతయును నవద్వీపమునకుఁ బోయియున్నవకుమారునకుఁ దెలియపఱచెను. ఇదియంతయును శ్యామసుందరికిని దెలియఁజేయవలయు ననికూడ వ్రాసెను.

---

## పదునేడవ ప్రకరణము

### శత్రుహస్తము.

——"Revenge is now the cud
That I do chew——I 'll challenge him."
Beaumont and Fletcher.

ఒకదినమున నుమాపతి సాయంకాలమైనతోడనే భట్టాచార్యుని గృహమునుండి మేనమామయింటికిఁ దిరిగిపోవుచుండెను. ఆకాశము నీలమేఘావృతమైయుండెను. అప్పుడప్పుడు చంచలయగుతటిత్కామినిఘనునితోఁగూడ సరసమాడుచు నతిశయించినకాంతిని వెలువరించుచుండెను. దారుణాంధకారమున నెదుట నిలిచినమనుష్యుఁడుగూడ నగపడుటలేదు. త్రోవలో నొకజీవజంతువైనలేదు. వెలుపలనున్న వారందఱును మబ్బుగ్రమ్మినతోడనే యింటికిఁ జేరికొనిరి. గాఢాంధకారపూరితమై, ఝంఝాప్రభంజనోద్ధతమైనసమయమునఁద్రోవనడచుటెవ్వరికి సాధ్యమగును? నడుమనడుమ విద్యుత్కాంతులు లేకున్న యెడల నుమాపతికి మార్గమును గుర్తించుటచాలఁగష్టముగనుండును మేఘగర్జనము లతిభయంకరములై శ్రవణపుటభేదనములైయుండెను ప్రతిగర్జనమును తలమీఁదఁ బిడుగుపడుచున్నట్లగుచుండెను. భయావహమగువస్తుసముదాయము నంతనుప్రోగుచేసి ప్రకృతి రణరంగభూమికం దాల్చినదేమో యన్నట్లు తోఁచుచుండెను. ప్రకృతికాంత తటిత్కాంతులనెపంబున మందహాసము చేయుచుండెను. అయినను ఆనవ్వువలన భయాకులులై సజనులప్రాణములే యెగిరిపోవుచుండెను.

ఉమాపతి భట్టాచార్యునియింటినుండి వెడలునప్పు డాకాశమంతభీభత్సముగ లేదు. చూచుచుండఁగనే మేఘములన్నియుఁగ్రమ్ముకొని యావరించుకొనియెను. ఉమాపతి పరుగెత్తుట కారంభించెను.

ఆతఁడింకొక దిబ్బనుదాఁటినయెడల నింటికిఁ జేరఁగలఁడు. ఈస్థలమున నొకచిట్టడవి యున్నది. ఆవనమున కవ్వల నొకచింతతోఁట యుండె ను. దానివెనుక నాతని మామగారి యిల్లున్నది.

ఉమాపతి యతిత్వరితముగఁ బోవుచుండెను. అంధకారమునఁ ద్రోవ యగపడుటలేదు. తటిత్ప్రకాశమునలనఁ గొంచెముదూరమువ ఱకు త్రోవచూచికొనుచు ముందునకుఁబోవుచుండెను. ఇంకకొంచెము దూరము పోయినయెడల గృహముఁజేరి నిర్విచారముగనుండగలఁడు ఇక్కడ భయంకరమైన యొక యాతంకముకలిగి యాతనిగమనమున కవరోధము కలిగెను. పోవుచుండఁగానే యెవఁడో యెదుటకు వచ్చి యడ్డముగ నిలిచి "పోకుము! ఆఁగుము" యని యదలించెను. ఆతని కంఠస్వర మతిక్రూరకర్కశమై భయంకరమై యుండెను. ఉమాపతి యాస్వరమును విని వడఁకి భయపడి నిశ్చేష్టుఁడై నిలువఁబడి "నీవె వ్వరు?" అని ప్రశ్నించెను. ఆతఁడు మొదటివలెనే భీషణస్వరముతో "నాసంగతి తరువాతఁ జెప్పెదను" అని మునుపటి మాటలతోనే యదలించెను.

అప్పుడొక మెఱపు మెఱసెను. ఉమాపతి యావెల్తురునఁ జూ డఁగా, అరణ్యమందేదుర్మార్గుని చేతులలోనుండి తాను ముక్తకేశినిని విడిపించి రక్షించెనో, ఎవ్వని నొక్కసారిగఁ జంపివేయక చెట్టునకు విఱిచికట్టెనో ఆదురాత్ముఁడే యాతఁడై యుండెను. ఇప్పుడాతఁడొక్క డేరాలేదు. ఆతనితోఁగూడ నట్టిదుర్మార్గులు మఱియెదుగురుకూడ నుండుటను జూచి యుమాపతి భయపడియెను. ఆపాపండున కుమా పతిమీఁద దీర్ఘక్రోధము కలదుగదా. ఆకారణముచే నాకిరాతకుఁడు పగదీర్చుకొనుటకుఁ దన్నడ్డుకొనియె నని యుమాపతి గ్రహించెను. ఈసమయమునఁ దప్పించుకొని పాఱిపోవుటకంటె వేఱుపాయము లేద నియోచించి, పాఱిపోవుటకుఁ బ్రయత్నించినతోడనే యొక్కఁడుచా

రుఁడువచ్చి యాతనిచేయి పట్టుకొనియెను. ఉమాపతి యాతని దూరముగఁ ద్రోసివైచెను. తోడనే యందఱును వచ్చి యాతని చుట్టుకొనిరి. అతనికే యాలోచనమును తోఁచలేదు. ఆదురాత్ము లందఱును గలసి యాతని నోరు మూసి కట్టివైచిరి. అతఁడు విడిపించుకొనుటకుఁ జాల ప్రయత్నించెను. కాని ప్రయోజనము లేకపోయెను. వారాతని కాలుసేతులు కట్టివైచినతోడనే యుమాపతి నిశ్చేష్టుడయ్యెను. వారందఱు నాతనినెత్తి తీసికొనిపోయిరి.

ప్రపంచమునందలి సంసారముయొక్క గతియే యిట్టిది. ఇఁకనిమిషమున కేమగునో గాని నెవ్వరు తెలిసికొనగలరు? ఈనిమిషమున ప్రీతి దాయకమైన సుందరమై యున్నదియే యుత్తరక్షణమునఁ జూచుట కసహ్యమైనదిగ నుండును. మనుష్యుఁ డొకనిమిషములోనానందసాగరమున మునిఁగి, యాశాతరంగముల దూఁగియాడుచు, నున్నతప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచుండును. ఆయుత్తరక్షణమునందే యేదేనొక విపదావర్తమునం బడిసంకటపాటునకు లోనగును. ప్రపంచమం దేదియు నిత్యము కాదు. శ్రీరామచంద్రుఁడు తెపటిదినమున యువరాజ్య పట్టాభిషిక్తుఁడనై రాజకార్యములను స్వయముగఁదీర్చుకొందు నని భావించి యాహ్లాదముచే నుప్పొంగెను. తెల్లవాఱులోపలనే యున్నట్లుండఁగా రాజ్యమునకుఁ బ్రతిగఁ బదునాల్గువత్సరములు వనవాసము చేయవలయునని తెలిసికొనియెను. రాముఁడు రాజ్యమునకురాకయే వనవాసియయ్యెను. పూర్ణగర్భిణియయిన జానకి తనభర్తకుఁ బరమానంద దాయినియయి సంతోషముతోఁ గాలము గడపుచుండెను. ఆకస్మికముగ నామెయదృష్టము తిరిగిపోయినది. రాముడామెను వనమునకుఁ ద్రోసివైచెను. దిగ్విజయశాలియు, త్రిలోకభీకరుండు నగురావణుఁడు తనకుచావే లేదని యనుకొని యప్రతిహతప్రభావముచే యథేచ్ఛముగఁ బ్రవర్తించెను. అతని యదృష్టము మాఱి

రామునిచేతసపుత్రమిత్రబాంధవముగ హతుఁ డయ్యెను. ఇంద్రుని జయించిన మేఘనాదుఁడు తనప్రాణేశ్వరియైన ప్రమీలకుఁ జెప్పి రాము నిజయించుటకొఱకు కొంతకాలమువఱకు మాత్రము విడిచియుండుట కనుజ్ఞను పొందెను. ఆతఁడు ప్రపంచమునందుఁ దనకు ప్రతివీరుఁడు లేఁడని తలంచుకొనుచుండెను. ఆతనిపరాక్రమము వ్యర్థమయ్యెను. ఆతనివిద్యలు నశియించెను. ఆపోయినవానికి మఱలఁ బ్రమీలను చూచుట గలుగలేదు. వారణావతమున ననల్పశిల్ప కౌశలముచ నిర్మించిన లక్కమేడలో యుధిష్ఠిరాదిపాండుకుమారు లందఱును కాలి పోయిరని యనుకొని దుర్యోధనాది కౌరవులు మహానందమున మునిగి యుండిరి. రాజ్యలాభముకొఱకు వారు చేసినతంత్రము లన్నియు నిరర్థకములై పోయెను. ఆపాండవులచేతులలోనే వారిజీవనములు తుద ముట్టినవి. ఈవిధముగా ననిత్యములై అనాలోచితములై అపూర్వములైన సంఘటనలు ప్రపంచమునం దెప్పుడు నొక్కమాదిరిగా నిలిచి యుండలేదు. పురాణేతిహాసములను విప్పి చూచినయెడల నిట్టియుదాహరణములు వేనవేలు దొరకును.

లాహోరున కధిపతియగు ననంగపాలుఁడు అంగవంగకళింగాదిదేశములయందు సహాయము కలిగి, అసంఖ్యాకసేనాసమన్వితుఁడైన గజనీదేశప్రభుండును, దేవద్వేషియు నగుమహమ్మదుతో యుద్ధము చేయుటకుఁ బ్రయత్నించెను. ఆయుద్ధమున నాతనిపక్షమునకే జయము చేకూఱనైయుండెను. కాని యదృష్టదేవత యాతనియెడ సుప్రసన్నయయియుండలేదు. జయమునకుమాఱుగ ననంగపాలుఁడు పరాజితుఁ డయ్యెను. డిల్లీశ్వరుఁడైన పృథ్వీరాజు విశేషసేనాసామంతవీరులతోదృషద్వతీనదీతీరమున శిబిరములనుస్థాపించియాతీరముననున్న శత్రుఁడైన మహమ్మదుఘోరీని వెనుదిరిగి పొమ్మని గర్వముచే నాజ్ఞాపించెను. కాని తుదకాగర్వ మెట్లుగాఁ బరిణమించినది? మహమ్మదు

ఘోరియే జయలాభము పొందెను. ఢిల్లీశ్వరుఁడు జయింపబడియెను. దుర్దాంతుడగు సురాజదౌలాతనకుశత్రువును, ఇంగ్లీషువారి సేనానాయకుఁడును, చతురుఁడు నగు క్లైవుతో యుద్ధముచేయుచుఁ దనపక్షమున సేనానాయకుడై యున్న మోహనలాలుని యుద్ధచాతుర్యమును చూచి తాను హేరానుండియే విశేషముగ ప్రశంసించెను. తనపక్షమున నిస్సంశయముగ జయము లభించునని యపరిమితానందమును పొందెను. ఇంతలో నీచాతినీచుఁడును, నిస్త్రైజుఁడు నగు మీర్జాఫరుబోధనముచే సేనాపతిని యుద్ధము మాని వెనుకకు మరలిరమ్మని యాజ్ఞాపించెను. అప్పుడు వెనుకకుఁ బోవుచున్నవారిని శత్రువులు బలవంతముగ నాక్రమించుకొనిరి. సురాజదౌలాయొక్క యాశలన్నియు నేమయినవి? ఆకాశమున గలిసిపోయినవి. ఇట్లే యితిహాసములందును దృష్టాంతములు లేకపోవలేదు. కొందఱు వెనుక ముందు చూచుకొని ప్రవర్తించినయెడల నేమియు నపాయములేదని చెప్పుదురు. మేమందుల కంగీకరింపము. ఒక్కొక్కవిపత్తు మనకుఁ దెలియకుండగనే వచ్చి యాక్రమించుటచేత దానినుండి తప్పించుకొనుటకు మనుష్యమాత్రునకు సాధ్యముకాదు.

ఈప్రపంచమునందలి జీవులకు భవిష్యద్గర్భమున నేమి యేర్పడియున్నదో దాని నెవ్వరు తెలిసికొనగలరు. తెలుసుకొనుమార్గమెట్లు? దానిని తెలుసుకొనుట కుపాయములేదు. దానికొఱకు మొదటినుండియు జాగరూకులై యుండుట దుస్సాధ్యము. ముందుకాబోవునదంతయు మొట్టమొదటనే తెలిసికొనుటకు మార్గమే యున్నయెడలఁ బ్రపంచమునం దత్యంతభయంకరములైన యాపదలు లేకయే పోవును. ప్రాపంచికసంసారనిబంధనము లన్నియు శిథిలమయిపోయి మంచియవస్థలన్నియు విపరీతములయి పోవుచుండును.

# పదునెనిమిదవ ప్రకరణము

## పుట్టినిల్లు.

"And yet a father! think, I am your child!
Turn not your eyes away—look on me kneeling;
Now curse me if you can, now spurn me off.

Congreve (Mourning Bride)

నవకుమారుఁడును శ్యామసుందరియు నాకస్మికముగ విపత్తుల పాలై, నవద్వీపమునకుఁ బోయిరని విని పద్మావతి మిగుల కలఁతపడియెను. ఆమె నవకుమారుఁడు లేనప్పుడు తాను సప్తగ్రామమునందుం డుటవ్యర్థమని భావించుకొనియెను. నవకుమారుఁడు సప్తగ్రామమునకు తిరిగివచ్చునంతలోఁ దానాగ్రాకుఁబోయి రావచ్చునని నిశ్చయించుకొనియెను. ఇందుకొఱకు సప్తగ్రామమునందున్న తనయింటిని గాపాడుచుండుట కేర్పాటు చేసికొని యాగ్రాకు బయలుదేరి పోయెను.

మేముమనపుస్తకముయొక్క యీభాగమందుఁబద్మావతినామె తురకపేరైనఉత్ఫవున్నీసాయనుపేరుచేతనే వాడుచుందుము.

ఉత్ఫవున్నీసా తిరిగి యవనసంసర్గమందుఁ బ్రవేశించెను. ఉప్పవున్నీసాకు అప్పటికి నిప్పటికిని చాలవ్యత్యాసమున్నది. ఆమె యేవిద్యా ప్రభావముచే నొకానొకకాలమున భువనమోహనుఁడైన జహాంగీరుని హృదయమం దధికారముచేసెనో, ఆవిద్య, లన్నియు నిప్పుడు నిస్తేజము లైపోయినవి. ఆమెకుమునుపటివలెఁ జపలత్వము లేదు. అసంబద్ధములైనయామె దుర్వ్యాపారము లన్నిటిని మనఃపూర్వకముగ వదలివైచెను. మొట్టమొదట నామెను చూచినవారీస్థితిలోఁ మరలఁజూచినయెడలఁ జాలనాశ్చర్యమును బొందుదురు. పూర్వము నీతిజ్ఞానాభావముచేఁ బాషాణముకంటెను నీరసమై పోయినయామెహృదయ

మిప్పుడు నీతిసుధారసమున నభిషేకింపఁబడియెను. దుర్మార్గములై నీచములైనయేమనోవృత్తు లామెను రమణీకులమునకుఁ గళంకస్వరూపిణిగఁ జేసివైచెనో అవియన్నియు మారిపోయి అనేకసద్భావము లామె హృదయమున నెలకొనియిప్పు డామెను పూజనీయమైన దేవీస్వరూపిణిగఁ జేసెను. ఇంతవఱ కామె యజ్ఞానముఁ మోహము, అనుసంకెలలచే బంధింపఁబడి యుండెను. ఇప్పుడు, జ్ఞానతేజమును, వివేకరాజ్యమును స్వాధీనముచేసికొనిన సర్వేశ్వరియై యుండెను. ఉత్ఫున్నిసా యిన్నిదినములు ధర్మబాహ్యమైనసామాన్యసుఖముచేఁ బ్రమత్తయై యుండెను. ఇప్పుడు ధర్మసంగతమైన పవిత్రసుఖము ననుభవించుచుండెను. ఆమెయిదివఱకు తనలోఁదానే మోహభ్రాంతిలోఁ బడిపోవుచుండెను. ఇప్పుడు తన్నుతానే నిందించుకొనుచుండెను. ఆమె కింతవఱకు సమగ్రమైన భారతవర్షమును పాదపీఠముగఁ జేసికొనిన పాదుషాను తనకు సేవకునిగఁ జేసికొనవలయునను నభిలాష కలిగియుండెను. ఇప్పుడు దరిద్రబ్రాహ్మణుని చరణకమలముల నాశ్రయించి యొకచిన్న కుటీరమునఁగాపురముసేయుటకు సిద్ధముగ నుండెను. ఈకారణములచేత నామె మునుపటి ఉత్ఫున్నిసా కాదని చెప్పితిమి. ఆమె పవిత్రమైన సుఖసంధానమునుపొంది దాని ననుభవించి స్వాధీనము చేసికొనవలయునని యభిలాష కలిగియుండెను. నవకుమారుఁడామెను, పత్నీ భావముతోఁ బలుకరించెను. ఆతఁ డామెకొఱకు చాల విచారించెను. ఆమెదుఃఖమునఁ బాలుగొనియెను. ప్రపంచమున నింతకంటె నామెకు గోరఁదగినదిమఱేమున్నది? నవకుమారుని సత్యమైన ప్రేమయొక్కటియే యామెకుఁగోరఁ దగినది. అది యామెకు లభించియేయున్నది. ఆకారణముచే నామెయాశ ఫలించినది. ఆమె కోరికలును తీరినవి. ఆమెకు మఱియేమియు నక్కఱలేదు. అట్లయిన ఉత్ఫున్నిసాయాగ్రాకేల రావలయును? అక్కడ మఱియేమిపనియున్నది? సుఖభోగ

ముల కేమో యామె నీళ్ళు వదలుకొనియుండెను. అట్లయిన మఱి యేమి? ప్రపంచమునందు స్నేహములను ఎవరు తమకుఁ దామే త్యాజియింపఁగలరు? ఎవరట్లు చేయఁగలరో యట్టివారి యంతఃకరణమున నెప్పుడును ప్రేమ పుట్టనేరదు. ఇప్పుడు ఉత్ఫుల్లనీసా హృదయము ప్రేమపరిపూరితమయి యుండెను. ఆకారణముచే నామె హృదయము స్నేహము మొదలగు సుకుమారవ్యాపారములచే నిండింపబడి యుండెను. ఆవృత్తు లన్నియు నిప్పుడామె నాగ్రావంకకు లాగికొనియెను.

ఉత్ఫుల్లనీసా ఆగ్రాకుఁ బోయి మొదటఁ దనతండ్రియింటికిఁ బోయెను. అక్కడ కాలుపెట్టుటకామెకు మిగుల కష్టముగఁదోఁచెను. ఆమెకుఁ బదునేనిమిదవయేఁటినుండియు నామెనడవడి మిగుల దూషితమయియుండెను. దానిని చూచి యామె తండ్రి సిగ్గుపడి విరక్తుఁడై యామె నింటినుండి వెడలఁగొట్టెను. అంతమాత్రమున ఉత్ఫుల్లనీసా యసంతుష్టురాలు కాలేదు ఎడతెగకుండ భోగతృష్ణదీర్చికొనుట కనుకూలముగ నున్నదని తెలిసికొని యందుల కానందమును బొంది యుండెను. క్షణకాలములోనే మంచి చెడ్డగను, చెడ్డ మంచిగను మారుచుండును. ఉత్ఫుల్లనీసా చెడ్డదయ్యు నిప్పు మంచిదై యుండెను. తిరిగి తల్లిదండ్రులనుగలిసికొనుటకు కష్టము కలిగెను. ఆమెతండ్రి యామెను మొదట నింటినుండి వెడలఁగొట్టినమాట మాత్రము నిజము. కాని, ఆమె యెక్కడ నెట్లున్నదో యని యెప్పుడును విచారించుచునే యుండెను. ఇప్పు డొకసంవత్సరమునుండి యామె యెక్కడ నున్నదోయాతనికి బొత్తిగఁ దెలియుటలేదు. ఆమె సప్తగ్రామమున నున్నట్లు పాఠకు లెఱింగియే యున్నారు.

ఉత్ఫుల్లనీసా యేడ్చుచు నంతఃపురమున బ్రవేశించెను. చూడఁగా నక్కడ తండ్రియగు రామగోవింద ఘోసాలుఁడు భార్య

తోమాటలాడుచుండెను. చాలదినములకు తిరిగి తనప్రియపుత్రికను జూచియాతఁడత్యంతానందుఁ డయ్యెను. ప్రేమ దాచియుంచుకొను వస్తువుగాదు. స్నేహపాత్రులు దోషులయినను వారిమీఁదఁ బుట్టిన కోప మాదోషమును శోధించి దండించుటకొఱకేర్పడినదేగాని, హృదయమునందలిప్రేమను నశింపఁజేయునదికాదు. చిరకాలమునుండి వచ్చుచున్న స్నేహమొక్కదినములో నశించిపోవునా? విశేషమయిన పుత్రప్రేమానుబంధమత్యంతాశ్చర్యకర మయినది. దోషయుక్తులయినబిడ్డలను తల్లిదండ్రులనేకవిధముల దండించుచుందురు కాని, మన స్సనందెప్పుడును బిడ్డల పురోభివృద్ధిని గోరుచునే యుండును. ఈప్రేమబంధమువలననేఘోషాలుఁడును, అతని భార్యయు పరిత్యజించినకుమార్తెను జూచి యానందించిరి. కుమార్తెయెడల దయనూపవలయునని భావించుకొనినను ఆయానందమును విశేషముగ వెలిబుచుపలేదు. ఉత్ఫుల్లనసా వారు వేఱుమాట లాడుట కవకాశమీయకయే యొక్కనూరుగా దుఃఖించుచు జనకుని పాదములపైఁ బడి వెక్కి వెక్కియేడువసాగెను. ఆమె తల్లిదండ్రు లాశ్చర్యానందపరవశు లయిరి. ఉత్ఫుల్లనసా తండ్రిచేవిడువఁబడి యెనిమిదితొమ్మిదేండ్లు కావచ్చినది ఈనడుమ నామె తల్లిదండ్రులను చూచుటయే లేదు. వారినిసమీపించుటకుఁగూడ నిష్టపడలేదు. నేఁడు బిడ్డ కింతగా మనసుతిరుగుటకేమికారణమో దానిని తెలిసికొనలేక తల్లిదండ్రులు విస్మితులయిరి ఘోషాలుఁడు తనకుమార్తెను చేయిఁబట్టికొని లేవనెత్తుటకుఁ బ్రయత్నించెను. ఉత్ఫుల్లనసా లేవకయేయాయవస్థలోనే యుండియేడ్చుచు క్షమింపవలయునని తండ్రిని ప్రార్థించెను.

చాలసేపటికి రామగోవిందఘోషాలుఁడు "నీవిన్నిదినము లెచ్చట నుంటివి?" అనియడిగెను.

ఉత్ఫవున్నీసా లేచి కూర్చుండి యధోముఖయై తనవృత్తాంత మంతయును జరగినది జరగినట్లు నిరాఘాటముగ వివరించి చెప్పెను. ఆమె తల్లిదండ్రులు లదివిని నిరుత్తరులైరి. ఉత్ఫవున్నీసామనసు ఈవిధముగాఁ దిరిగినందులకు సంతుష్టు లైరి. ఆమెతండ్రి "పద్మావతీ! ఇప్పుడు స్నానముచేసి భోజనమునకురమ్ము నీమాటలను విని సంతోషించితిమి. నీవీదినమున మాకుఁగలిగిననంతోష మనిర్వచనీయమైనది. భగవంతుఁడు నిన్నుఁ జిరాయుష్మతిం జేయుఁగాక" అనియెను

తరువాత ఉత్ఫవున్నీసా తల్లితో మాటలాడుట కారంభించెను. రామగోవిందుఁడు కొంచెముసేపటిలో వెలుపలకుఁ బోయెను.

రెండుదినములయినతరువాత రామగోవిందుఁడు తనభార్యను కుమార్తెను, పిలిచి "పద్మా! నీకింతమంచిబుద్ధిపుట్టుటచే నీస్వామిని న్నుఁదిరుగఁ పరిగ్రహించుటకు కష్మ్మతించెనని వినుటకు మాకుఁ బరమానందముగ నున్నది. నవకుమారునియవస్థయు నంతమంచిస్థితిలో లేదు. నీవు సామాన్యముగా నంతకష్టపడినదానవు కావు. నీవు చాల శ్రమపడియెదవని తోఁచుచున్నది" అనియెను.

"తండ్రీ! నాజీవిత మంతయు రాజభోగానుభవముతోఁ గడపితిని. కాని, యిప్పుడది లేకపోయినంతమాత్రమున నాకువిచారముగాని కష్టముగాని, లేదు. అజ్ఞానకృతంబు లగు నాపనులన్నియు నిప్పుడు తలఁపునకుఁదెచ్చుకొన్నయెడల దారుణమగునయనుతాపము గలుగుచున్నది. ఇఁక నాపాపభారమును సహింపఁజాలను. ఈ నాప్రాణమును మండుచున్న యగ్నికీలలం బడవైచినను తీరదు."

కుమార్తెమనఃపరితాపమును తెలిసికొని తండ్రియునుపరితపించెను. ఆతఁడు "అట్లయిన నిప్పుడు నీవేమి నిశ్చయించుకొంటివి?" అనియెను.

"స్వామిచరణసేవయందే జీవనమును త్యజించెదను,

"నీవ యననిని—అతఁడు నిన్నెట్లు పరిగ్రహించును?"

"మీయాశీర్వాదముచే నాభర్త యీదాసిమీఁద ననుగ్రహము కలిగియుండె నని మొదటనే చెప్పియుంటిని. నాకాజ్ఞయయ్యెనేని పోయివచ్చెదను."

నవకుమారుఁడు తిరిగి పెండ్లియాడెనని వినియుంటిని. ఆభార్య యెచ్చటనున్నది?"

ఆమె గంగాజలమునఁ బడిపోయినది"

"మన పూర్వకముగనా?"

"కాదు—దైవయోగమువలన—"

"నవకుమారునిసంసారమునందిఁక నెవ్వరున్నారు?"

"కొన్నిదినములకు ముందు మాయత్తయును, పరలోకమున కరిగెనని మీకుఁ దెలియ లేదా ? ఆమెమరణానంతరమున మా పెద్ద యాఁడుబిడ్డ కాశియాత్రకుఁ బోయి యచ్చటనే నివసించుచున్నది. ఇప్పుడు నాభర్తయు, నాచిన్నయాఁడుబిడ్డయగు శ్యామసుందరియు మాత్రమే యింటియం దున్నారు."

ఘోసాలుఁడాలోచనాపరాధీనుఁడై యేమియును మాటలాడ లేదు. ఆతని కీ పద్మావతియొక్క తెయేకూఁతురు. మఱియాతనికి సంతానములేదు. ఆమె వెడలిపోవుటకు సెలవడుగుటను విని కొంచెము వ్యాకులపడియెను. చాలసేపు పరధ్యానముతో నుండి తుదకు "కుమారీ! మంచిది. ఇప్పుడుకొన్నిదినములు మాత్రము నాయొద్ద నుండుము. ప్రయాణమునుగూర్చి తరువాత నాలోచింతము" అనియెను.

ఇట్లుచెప్పి గోసాలుఁడు వెడలిపోయెను. ఉత్పలపున్నిసయు, నామె తల్లియు మాటలాడుచుండిరి.

## పందొమ్మిదవ ప్రకరణము

### భువనమోహిని.

"జినామపనూర్ ఏ జహాంబాద్ షాః బేగంజార్,
బహుకుమ ఏ జాహాంగీరషాః ఇరాఫత్ సాదజబర్"

మరునాటియుదయమున ఉత్ఫుడున్నీసా పాదుషాను చూచుట కుబయలుదేరి పోయెను. నేడామె తిరిగి యౌవనికవస్త్రములను ధరియించెను. కాని నగలనుమాత్రము ధరించుకొనలేదు. ఏయుద్దేశమునకు వేషాలంకారము లావశ్యకమో ఆయుద్దేశ మిప్పు డామెమనస్సునువిడిచిపోయెను.

ఉత్ఫున్నీసా పాదుషాయంతఃపురమునఁ బ్రవేశించెను. ఆమెనెవ్వరు నడ్డుకొనలేదు. చాలదినములయినమీఁదట నామె తిరిగివచ్చుటను చూచి ద్వారపాలకులందఱును భయముతో సలాములు చేయుచు నామెకు దారి చూపిరి. వారందఱు నామెనూర్పునుజూచి యాశ్చర్యపడిరి. ఏఉత్ఫున్నీసా మునుపు ప్రపంచమునం దత్యుత్కృష్టములయి, ప్రకాశమానములై, యమూల్యములగువస్త్రాభరణములనుధరించుచుండెడిదో, అట్టియామె శరీరమం దిప్పుడొక్కయలంకారమైన లేదు. సరేకదా ఆమె కట్టినబట్టకూడ నతిసామాన్యమయినదిగ నుండెను. మునుపే ఉత్ఫున్నీసా యెప్పుడును పాదుషాతో మాత్రమే మాటలాడుట కిష్టపడుచుండెడిదో ఆమె నేఁడు భృత్యులతోఁగూడ మాటాడి, వారిక్షేమము నారసి, వారుచేసినసలాముల నందికొనుట గూడ వారికి మఱింత యాశ్చర్యమును కలిగించెను.

వర్ధమాననగరమున సుబేదారుఁడైన షేరాఫ్గనునకు భార్యయగు మెహరున్నీసా యిప్పుడు "నూర్జహాను" అనుపేరు పెట్టుకొని

పాదుషాకుఁబట్టమహిషియయ్యెననిఉత్ఫవున్నీసావినియెను—మఱియు నిప్పుడామె విన్నదానిలో మెహరువున్నీసా కేవలము నూర్జహానేయ యీ ప్రధానమహిషియనుపేరుచేమాత్రము సంతుష్టురాలు కాలేదని కూడఁ దెలియవచ్చెను. ఆమె స్వచ్ఛందసుఖముకొఱకేర్పఱచిననియ మము లింతసమముం దేఘాదుషాపట్టపు దేవికిని లేవు. ఆమెకీర్తియును, జగద్వ్యాప్తమయ్యెను. ఆమె త్రిలోకసుందరియై యుండెను. కేవల రూపముచేతనేగాదు—గుణముచేతను నూర్జహా నద్వితీయురాలని తెలియవచ్చెను. ఆమెయాజ్ఞచే రాజభవనమునమనోహరములయిన మార్పులెన్నియో జరగెను.

మునుపు సేవకులందఱును యథేచ్ఛముగ నుండెడివారు. ఇప్పు డట్లుకాదు. అదియంతయు పరిష్కార మయ్యెను. ఆమె కేవలమంతః పురమున నున్ననుఆమెయధికారమునిరంకుశమయియుండెను. అంతః పురమున నామెకూర్చున్నది మొదలుకొని మొగలాయిరాజ్యముకడ వఱకును ఎల్లచోట్ల నామెయధికారము నడచుచుండెను. జహాంగీరు పేరునకుమాత్రము బాదుషా. రాజ్యపరిపాలనాభర మంతయు నామె చేతిలో నిమిడియుండెను. ఇప్పుడామె యాజ్ఞలేనిదే యెట్టివ్యవహార మును నడచుట లేదు. ఆమెయధికార మప్రతిహతమయి యుండెను అందఱు నామెయధికారము నంగీకరించిరి. అందరునామెగుణములను శ్లాఘించుచుండిరి. ఉత్ఫవున్నీసా మెహరవున్నీసాను చిన్నతనమునుం డియు నెరుగుదును. ఆమెభూలోకదుర్లభమయినరూపమునుగూడఁ జూచియుండెను. ఆయసాధారణరూపమును యువరాజయినసలీము (జహాంగీరు) నేత్రముల నాకర్షించెనని యామె తెలిసికొనియెను. మెహరువున్నీసా యన్నివిధములచేతను బాదుషాకు భార్యయగుటకు నిశ్చయముగఁ బాత్రురాలని యామె యెరుంగును. ఇప్పుడామె యస మానరూపగుణవిశేషంబుల నాలకించి యాశ్చర్యముతో, దేవుడామె

నింతటియుచ్ఛస్థానమునం దుంచుటకుఁ దగినరూపము నిచ్చి రక్షించి దానికి సరియైనమంచిగుణముల నామెహృదయమునం దుంచె నని తెలిసి కొనియెను. ఉత్ఫపున్నిసా విస్మయమునందెను. ఆమె నూర్జహా నును చాలవఱకు కొనియాడెను.

ఇంతేగాక నూర్జహాను తనభర్తపైఁగూడ నిజాధికారమును నెఱపుచున్నదని యామెకు తెలియవచ్చెను. జహాంగీరు ప్రతిదినమును జాముప్రొద్దెక్కువఱకు నిద్రనుండి లేచెడివాఁడు కాఁడు. ఇప్పుడు నూర్జహానుయొక్క అసామాన్యశాసనప్రభావమువలన నాతడు ప్రతిదినమును సూర్యోదయమునను ముందుగనే లేచుచుండె నని తెలియవచ్చెను. జహాంగీరు రేయుంబగళ్లు విలాసలాలసుఁడై భోగసుఖాసక్తుడైయుండెడివాఁడు. ఇప్పు డాతఁడు విలాసవిహారముల కొకకొంతకాలమునుమాత్రము నిర్దేశించుకొని యుండెను. ఏజహాంగీరు రాత్రిదినము సురాపాత్రను పెదవిని జేర్చుకొని యుండుటయేసుఖమని తెలిసికొని యుండెనో, యాతఁ డిప్పుడు నూర్జహానుయొక్క కఠినశాసనమున పానదోషమును విడిచి యుండెనని చెప్పవచ్చును. ఎవరిప్రోద్బలము చేతనైనను జహాంగీరీవిధముగమారుననిఉత్ఫపున్నిసా యెన్నఁడు నను కొనలేదు. ఏరమణీమణిసామర్థ్యమున నాజహాంగీరుచరిత్ర మింతయు న్నతిని వహించినదో, ఆరమణీమణిమనుష్యాకృతితోనున్న దేవియని యామె తలంచెను.

ఇంతేగాక నూర్జహాను మిగుల హితవాదిని. ఆమెభావము నిష్కపటమైనది. ఉన్నతపదవినందినప్పుడు సామాన్యముగ నెల్లర హృదయములందును గర్వ ముదయించును. కాని నూర్జహానున కట్టి దోషము కలుగలేదు. ఆమె యందరియందును సమభావముతో నుండెను. అందఱిసుఖమందును సమదృష్టి కలిగియుండెను. మొగలాయీ రాజ్యమునందు దీనులును, దరిద్రులును, కష్టజీవులును, మూర్ఖులు

నుండుట యామెకిష్టము లేదు. దివ్యములయిన యీ మెసుగుణగణంబుల కానందించి జనులందరు నామె చిరాయుష్మతియై యుండవలయునని యాశీర్వదించుచు నామెను కొనియాడుచుండిరి. బాలురుగాని, వృద్ధులుగాని, స్త్రీలుగాని, యెవ్వరైనను ఆమెను చూచినను చూడక పోయినను ఆమెయందు భక్తివిశ్వాసములు కలవారై యుండిరి.

ఉత్ఫవున్నీసా యిదియంతయును విని చాలా సంతోషించెను. ఆమె మెహరున్నీసాకు నైన యీ మెగుణములకు దగినపదవి నొసంగెననియు ఆమె నూర్జహాననుపేరు సార్థక మయ్యెననియు తెలిసికొనియెను.

దగ్గఱనున్న దాసికూడ నీసమాచారమును చెప్పెను. ఉత్ఫవున్నీసా ఆమెనుగూర్చి "ఇప్పుడు పాదుషా యెక్కడనుండు" నని యడిగెను.

"ఇప్పుడాపద్ధతి లేదు. సూర్యోదయమయినతరువాత నొకజాము వఱకు సభజరుగును. ఇప్పుడు పాదుషాసింహాసనమునందే కూర్చుండి యుండును"

ఉత్ఫవున్నీసా సభపూర్తియగువఱకు వేచియుండనియెడల పాదుషాను చూచుటకు వలనుపడదని యనుకొని "ఇప్పుడు నూర్జహానెక్కడ నున్నది" అనియడిగెను.

దాసియు వేలితో జూపుచు, "అదిగో నూర్జహానా ప్రాతర్గృహమున నున్నది" అనిచెప్పెను.

ఉత్ఫవున్నీసా యామెను చూడవలయు నని దాసీముఖమున వార్తనంపెను. తోడనే భరతఖండరాజ్యలక్ష్మియు, నద్వితీయరూపయౌవనగుణసంపన్నయు నగునూర్జహాను స్వయముగ వచ్చి బాల్యసఖియగు ఉత్ఫవున్నీసాచేయి పట్టుకొని తనతో దనభవనమునకు గొనిపోయెను.

---

రువున్నిసా జహాఁగీరుఫాదుషా పట్టమహిషియగు నూర్జహానుగా నుండెను. మఱియు నెవ్వతెకొఱ కందరు నాస్థానమును నిర్దేశించి యుంచిరో యిప్పు డామె యేమైనది? ఆమెయదియంతయును త్యజించి వేఱువిధముగ నామె జీవితకాలమును గడుపుచున్నది.

ఉత్ఫవున్నీసాముఖమునం దానంద మగుపడుచుండెను. ప్రకృతిననుసరించియున్న సంఘటనము లన్నియుఁ జూచినయెడల ఉత్ఫవున్నీసాకుఁ గలిగినయానందమున కాశ్చర్యము కలుగకపోదు. కాని, బాగుగ నాలోచించిచూచినయెడల నాశ్చర్యకారణమే లేదు. ఆమె మనసునందు ఆశ, ధైర్యము, కోరిక, ఆలోచన మొదలగునవి యన్నియు మారిపోయినవి. దురంతములైన యామె మానసికవ్యాపారము లన్నియు నేమూలనో యడఁగిపోయినవి. ఆమె చాలాకాలము దుర్మార్గకార్యములయందుఁ గడిపినదగుటవలన నామెసత్ప్రవృత్తము లన్నియుసమూలముగ నాశనము కావలసినదే. కాని జ్ఞానవారి దగ్ధప్రాయములైన సత్ప్రవృత్తములయొక్క వ్రేళ్లను తడుపుటచే నవి తిరిగి మొలకలెత్తినవి ధాతువులు నగ్నియందు పుటముపెట్టినయెడల నవి కరఁగి యందలి పనికిరానిపదార్థము భస్మమైపోయి వెలగల ముఖ్యపదార్థము నిలిచియుండు. అట్లే ఉత్ఫవున్నీసా హృదయమం దనుతాపానలము ప్రవేశించి దానిని కరిగించి యందలిదుష్ప్రవృత్తుల సన్నిటిని భస్మముచేసి సాధువృత్తులను ప్రజ్వలింపఁ జేసెను.

ఆమెస్వభావము మునుపటివలెనే యున్నయెడల నామె బాల్యసఖియగు మెహరువున్నీసా భారతరాజ్య సింహాసనమున కధికారిణియగుటఁజూచి సహింపలేక యేపోవును. కాని యామెకు సింహాసనమునందు లక్ష్యములేదు. ఇఁక నామెకు జహాంగీరుని హృదయమును హరించుటకుఁగూడ నిష్టములేదు. ఇఁకనామె కున్నతపదవినందుదృష్టియును లేదు. ఆమె కేదిలక్ష్యమో, ఏదిప్రయత్నార్హమైనదో, ఏదికోరఁ

దగినదో దానినామె పొందియుండెను. ఇప్పుడామె మెహరున్నీసాయభ్యుదయమునుచూచి యానందించెను. ఏయీశ్వరుని యనుగ్రహముచే నామెమోహజాలములన్నియు సహజముగనశించిపోయినవో, ఆసర్వరక్షకుని సర్వాంతఃకరణములచేతను స్తోత్రముచేయుచుండెను. పూర్వమామె మెహరున్నీసాను అపవిత్రమైన దృష్టితోఁ జూచుచుండెను. ఇప్పుడామెదృష్టి పవిత్రమైనది. ఆనూపునందు స్నేహము, ప్రేమ శుభోద్దేశము, ఇవి యన్నియు వ్యక్తములగుచుండెను. ఆమె మెహరున్నీసాను సోదరిగ భావించుకొనియెను. ఆమె తన సుఖోన్నతులకుఁ గారకురాలని తెలిసికొనియెను. మెహరున్నీసా రూపయౌవనములు యువరాజుకంటఁబడక, యామెయందాతఁడాసక్తుఁడుకాక యుండినయెడల ఉత్ఫున్నీసాయొక్క యాశాపథము సులభమై—దానివలననామెక్రమముగా నధికతరమోహమునఁబడిపోయి యిఁకనెన్నఁటికి నాప్రలోభగుణములనుండి విడివడుటయే లేకపోయియుండును. కాని, దీనికంతకు విపరీతముగానడచుటవలననేచక్రవర్తియంతఃపురస్వరూపముననున్నసుఖకారాగారమునుండి వెలువడుటకామెకుమంచిమార్గముసులభముగదొరకెను. ఆకారణముననే మెహరున్నీసాతనకుఁబరమోపకారియని తెలిసికొనియెను. ఉత్ఫున్నీసా మెహరున్నీసాకు కృతజ్ఞతను జూపుటకు సిద్ధముగానుండెను. ఉత్ఫున్నీసాహృదయమునందుకౌటిల్యము లేశమాత్రమునులేదు. ఆమెహృదయము సరళమై పవిత్రమై యుండెను—ఆమె యానందమునకు మఱియొకకారణము కూడఁగలదు. ఆమె నూర్జహానుయొక్క యసమాన్య గుణగణంబులంగూర్చి చాల ముచ్చటపడియెను. నూర్జహానువంటి గుణవతియైనరమణీమణి బాదుషాకుఁ దగినదేవియనియు, ఆమె, యాస్థానమునుపొంది రత్నము కాంచనముతోఁజేరి నట్లుండెననియుఁ దెలిసికొనియెను. మెహరున్నీసాకు మారుగఁ దానాస్థానమును పొందినయెడల నంతబా

గుగనుండదనియు, ఆమెవలెనే తానంతటిఘనకార్యములనునిర్వహిం పలేననియు, ఆమె పట్టమహిషి యగుటయే మంచిదనియు, భావించు కొనియెను.

సూర్జహాను ఉత్ఫున్నీసా సంబంధమైన వర్తమానావస్థలం గూర్చియు, శారీరకమానసికావస్థలం గూర్చియు ననేకవిధముల నడిగి తెలిసికొనియెను. వారిద్దఱు ననేకవిషయములంగూర్చి మాటలాడు కొనుచుండఁగా పాదుషా దర్బారైనతరువాత ఉత్ఫున్నీసా ప్రియస ఖివలన నాజ్ఞనుపొంది పాదుషాను చూచుటకొఱకు వెడలిపోయెను.

---

## ఇరువది యొకటవ ప్రకరణము

### చక్రవర్తిసమక్షము.

> "నహి ప్రఫుల్లం సహకార మేత్యవృక్షాంతరం
> కాంక్షతి షట్పదాళీ—"

రఘువంశము.

ఉత్ఫున్నీసా జహాంగీరుపాదుషాసముఖమునకు వచ్చి నిలువఁ బడి వినయపూర్వకముగ నమస్కరించెను. పాదుషాచాలదినములకా మెను చూచి యత్యంతప్రీతుఁడై యానందముచే నామె స్వవిషయ ములంగూర్చి విశేషముగఁ బరామర్శించెను. దానికిఁ బ్రత్యుత్తరము గఉత్ఫున్నీసా "పాదుషాయనుగ్రహముచే నొకమాదిరిగ నంత యును శుభముగనే యున్నది. ఈవిధేయిని పాదుషాబహాదరువారి యాజ్ఞాప్రకారము తిరిగి వివాహితకాఁగోరుచున్నది. ఈమె యిఁకఁ గులస్త్రీయయియుండును" అనియెను.

పాదుషా ఆశ్చర్యముతో "ఉత్ఫవున్నీసా ! ఇదియేమి పరిహాస మాడుచుంటివా" అనియెను.

"ఇది పరిహాసముకాదు, సత్యమే ఉత్ఫవున్నీసాకు ఇప్పుడు పాదుషాతో హాస్యమాడుటతగదు"

"సత్యమేనా? వివాహ మెవరికి?"

"వివాహము కాదు. మొదటనైనవివాహమే నాదోషముచే తనపవిత్రమయిపోయినది. ఇప్పు డతిప్రయత్నముచే నాభర్తయే యీదాసిని తిరిగి కటాక్షించెను"

పాదుషా "హాహ్హా" అని నవ్వెను. తోడనేగంభీరభావమును వహించి "ఉత్ఫవున్నీసా! అట్లయినయెడల నింతకాలమునకు మమ్ము లనొక్కసారిగ మఱచిపోవుదువా?" అనియెను.

ఉత్ఫవున్నీసా నిరుత్తర యయ్యెను.

"నీభర్త కింకను భార్యలున్నారా?"

"ఉన్నది. ఆమె గతించినది"।

"నీభర్తపేరేమి?"

"నవకుమార వంద్యోధ్యాపాయుఁడు"

"అతని నివాసము సప్తగ్రామమందేనా?"

"అవును మహాప్రభూ!"

"నీభర్త యందమయినవాఁడేనా?"

"నాభర్త కురూపియైనను, సురూపియైనను ఈవిధేయినికన్నులకాతఁ డిప్పు డనుపమరూపలావణ్యసంపన్నుఁ డగుపురుషరత్నమై కానఁ బడుచుండెను."

నీభర్త ధనవంతుఁడా?"

"మహాప్రభూ? నాభర్త బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణులుసా

మాన్యముగ దరిద్రులు. ఆతడును ధనవంతుఁడు కాఁడు. ఆతనికన్న వస్త్రములకు సరిపడినయాస్తిమాత్రముకలదు.''

ఉత్ఫవున్నీసా! అట్లయినయెడల నింతకాలమునకు మాయందలి ప్రేమము నొక్కసారిగఁ ద్యజించితివె చెదవా?''

ఉత్ఫవున్నీసా నిట్టూర్పువిడిచి యూరకుండెను.

పాదుషా ''ఉత్ఫవున్నీసా! నేను నీయెడ నేమి యపరాధము చేసితిని? ఇంతటిచిరపరిచయమును, ఇంతటిచిరప్రణయమును నేను మఱవఁగలనా? ఈసంబంధము లన్నియును విడిచి నీవునన్నుఁ ద్యజించెదవా?'' అనియెను.

మహాప్రభూ! మీరు విచారింపఁగూడదు. నేనట్లు వెడలుట యపరాధమే యయ్యేనేని యందుకొఱకు మీచరణకమలసాన్నిధ్యమున క్షమాపణ వేఁడుకొనుచున్నాను. దేవర మన్నింపవలయునుఁ నాసుఖమార్గమున కడ్డుపడఁగూడదు.''

''ఉత్ఫవున్నీసా! అట్లనగూడదు. నాశరీరమునఁ బ్రాణములున్నంతవఱకు నిన్ను విడువఁజాలను''

ఉత్ఫవున్నీసా కన్నుల నీరు వెట్టుకొని ''పాదుసా! మనసుకుదుటపరచుకొనవలయును. నన్ను మునుపటి ఉత్ఫవున్నీసా యని యనుకొనవలదు. మొదటివృత్తాంత మంతయును మఱచిపోవలయును. నేనిప్పుడొక పరిచితుఁడైన పురుషునితోడమాత్రమే మాటలాడుచుంటినని తెలిసికొనవలయును. ఏలిక నన్ను రక్షింపఁ గోరెదను. పాపానలకీలలు నాహృదయమును రేయుంబవళ్లు కాల్చివేయుచున్నవి, ఇప్పుడు నేను మీపాదపద్మములకడఁ బ్రార్థించునదేమనఁగా—మీరు నన్నురక్షించి నాకుఁ బ్రాణదానము చేయవలయునని—మతిభ్రష్టనై మరలఁ బాపసాగరమునఁ బడిపోయినయెడల మీసాహాయ్యము లేనిదేదానినుండి యొడ్డునఁ బడఁజాలను. మీయాజ్ఞాప్రకారము నడచు

కొన్నయెడల మొదట నేనెట్లుంటినో యిప్పుడు నట్లే యుండవలసి వచ్చును. చిరకాలము పాపమునందుఁ బడిపోవుటచే నాహృదయమంతయును కలుషితమై పోయినది. నాకిప్పు డఖండసామ్రాజ్యము లభియించినను అత్యున్నతపదవి చేకూఱినను ఇప్పుడు నాకుఁ గలిగిన సుఖమునుమాత్రము విడువఁజాలను. మీరు నన్నెంతభ్రమపెట్టినను దానిని త్యజింపఁగలనా? కావున మహాప్రభూ? నాజీవితముయొక్క సుఖదుఃఖములన్నియుఁ దమచేతిలో నున్నవి. మీరు చిరకాలము నన్ను దయాపూర్వకముగ నాదరించితిరి. అది నేను మఱవఁజాలను. తాము నన్ను చిరకాలమునుండి యాదరించుచుంటిరను ధైర్యముచే మీరు నావిషయమున బందుగురాలివలెఁ జూడవలయునని వేడుకొనియెదను. చిరపరిచితురాలైన యీ యబలను కాపాడవలయును, ఈమె సుఖమార్గమును గూర్చి ఈమె పోవుట కనుజ్ఞ యీయవలయును'' అనియెను.

ఫాదుషా నిరుత్తరుఁడయ్యెను. ఆమెమాట కేమిప్రత్యుత్తర మీయవలయునో దానిని తెలిసికొనలేకపోయెను. ఆతనిహృదయమునందలి విచారభావములు మొగముననగపడుచుండెను. ఉత్ఫున్నీసా ఫాదుషాయూరకుండుటను చూచి తిరిగి చెప్పఁదొడఁగెను:—మహాప్రభూ! ఈదాసి మాటలచే మీమనస్సునందు క్లేశపడుచుంటిరి. దేవరభావముచేత దానిని బాగుగఁ దెలిసికొంటిని. మీకు విచారముఁ గలిగించుట నాయుద్దేశముకాదు. ఏలిక విచారించుటకు పాత్రులుగారు. అట్లయిన నీదాసి యిన్నిమాటలను చెప్పు టెందులకు? ఈమెయిప్పుడొకసంవత్సరమునకుముందు ఫాదుషాయొక్క ప్రేమభిక్షమును వేఁడుచున్నది. కాని, యిప్పుడామె కాయాశలేదు. ఆమె పాదుషాయెదుట సజలనయనయైనిలువఁబడి పాదుషానుగూర్చి తనయందుఁ గలపూర్వ

భావమును నుఱచి యామె కాజ్ఞయిచ్చి పంపవలయునని ప్రార్థించు చున్న" దని చెప్పెను.

జహాంగీరు "ఉత్ఫవున్నీసా! నేనేమైనను సహింయించెదను. నేనుకఠినహృదయుఁడను. నీవునన్ను త్యజించుచున్నప్పు డవశ్యముగ సహించితిని. ఏమనఁగా నీవు నన్ను విడిచి యవనతముఖివై పాపాత్మ రాలవగుటలేదు. క్రమముగా నౌన్నత్యమును పొందుచుంటివి. అయి నను నీవునన్నుద్యజించి యనేకకష్టములకు లోఁబడుటను చూచి నే నిప్పుడెట్లు సహింపఁగలను? ఉత్ఫవున్నీసా! నీవేయోచించిచూడుము! అపూర్వమైన, దుగ్ధఫేననిభమైన, మృదుశయ్యయందు శయనించినను నీకునిద్ర పట్టునదికాదు. నీకాలియందేమాత్రమూ దుమ్ముపడిననుదా నిని నేను నాకోమలవస్త్రముచేఁ దుడిచెడివాఁడను. అయినను నీమన స్సునకు సంతుష్టి కలుగునది కాదు. నీకొఱకు దేశదేశములనుండి వెల లేని వస్త్రాలంకారములను తెప్పించెడివాఁడను గాని యందువలన నీవు తృప్తినొందెడిదానవు కావు. విదేశములనుండి వివిధములై యుత్త మోత్తమములైన రుచ్యాహారపదార్థములను తెప్పించుచున్నను నీర సనకు సంతుష్టిలేకపోయెడిది. గ్రీష్మఋతువునందు మంచువలెచల్లనై యున్న హిమగృహమునందున్నను నీకుప్రశాంతి కలుగునదికాదు. ఢిల్లీశ్వరుఁడైన జహాంగీరుచక్రవర్తి నీయధీనుఁడైయున్నను నీవాతని నుదాసీనభావముతోఁ జూచెడిదానవు. ఉత్ఫవున్నీసా! ఇప్పుడీకఠినసే వచే నీచస్థాననివాసమును సామాన్యవస్త్రాలంకారధారణమును మొద లగు కష్టములనుభవింతువు. అదియంతయు నాలోచించుకొన్నయె డల నాయెడలు జలదరించుచున్నది. ఇతరజనులెటులైనను చెప్పవ చ్చును. కాని నేనిదంతయును విని నిర్విచారముగ నుండలేను."

ఈకడపటివాక్యములను పలుకునప్పుడు జహాంగీరుని యిందీవ రసదృశములగు నయనములనుండి యశ్రుబిందువులు వెడలెను. ఒకా

నొక సమయమున నాతఁ డుత్ఫవున్నిసాను తన ప్రాణముకంటె నధికముగఁ బ్రేమించుచుండెను. ఆతఁ డామె కొంచెము సేపగపడక పోయినయెడల నేమియుఁ దోఁచక యుండెడివాఁడు. అట్టియుత్ఫవున్నిసా కష్టపడుచుండెనని తెలిసినప్పు డాతనిహృదయము పరితపింపదా!

ఉత్ఫవున్నిసా చాలసేపు మాటాడక చిత్రప్రతిమవలె నిశ్శబ్దముగ నిలువఁబడియెను. తరువాత "పాదుషా! దేవర యానతిచ్చినది సత్యమైనది. ఈయధమురాలిపై నేలికకుఁ గలయనుగ్రహ మపారమైనది. దేవర నాకొఱకు కలఁత నొందఁగూడదు. ఈయధనూధమురాలు డిల్లీశ్వరుని భార్యగా నున్నప్పుడు పరమేశ్వరుఁ డామెకుఁ దగిన సుఖానుభవమును జేకూర్చెను. ఇప్పు డామె దరిద్రబ్రాహ్మణునిభాగ్య అవస్థానుసారములైన కష్టముల ననుభవించుట కామె భయపడు ఎ లేదు."

పాదుషా యచ్చెరువుతో "ఉత్ఫవున్నిసా! నీవు మునుపటి గా వవేనా? కాలము నిన్నుఁ బ్రశంసనీయురాలినిగా మార్చి వేసినది. నీ వృత్తాంతమును విని నేనుమిగుల నాశ్చర్యపడుచుంటిని. సృష్టియందలి సకలజీవరాసులలో రమణియే సర్వప్రధానురాలని నేఁటి నీమాటలను వినినమీఁదట విలక్షణముగా నాహృదయమునకుఁ బొడకట్టినది. నేను నిన్ను విశేషముగఁ గొనియాడెదను. నీవు రమణీకులమునకు లక్ష్మివి ఇంద్రియభోగలాలసత్వమునకును మనసునకును లోహాచుంబకసంబంధమువంటి యనుబంధ మొకటి యున్నది. ఒకప్పు డాసుఖానుభవముతో నీమన సెంతవఱకు లీనమైపోయినదో దానిఁగూర్చి యోచించునయెడల నేఁడు నీవు చెప్పినమాట లన్నియును స్వప్నవృత్తాంతములవలె నున్నవి. నీయంతటి రమణీమణి కింతటి మార్పు కలుగునని యెవ్వరనుకొనగలరు! పూర్వ వృత్తాంతము లన్నియు జ్ఞప్తికిఁ దెచ్చుకొని చూచిన యెడల నప్పుడు నీమనసు స్త్రీసామాన్యమైన

చాపల్యమునందును, చాతుర్యమునందును, బరిపూర్ణమై యుం డెను. కాని యిప్పటి నీపవిత్రసరళ ప్రవర్తనమును గూర్చి నేనుచాల విభ్రాంతుఁడనైతిని. నేను నిన్నుఁ బ్రేమించుచుంటి ని.అయినను నేఁడు మొదలు నీవు స్వర్గదేవతవని, భక్తితో నారాధిం చుచుందును. నీవవలంబించిన - మార్గమునుండి యిఁకముందు తప్పిం చుటకు నాకిష్టములేదు. నీవిప్పు డవలంబించిన మార్గము శ్రేయస్క రమును, శుభకరమును, గూడ నైయున్నది. నేను సంతుష్టుఁడనై హృదయపూర్వకముగఁజెప్పునది యేమనఁగా:—నపూర్వసంబంధమైన యేదుశ్చింతనములు జ్ఞాపకమునకు వచ్చినయెడల మనస్సునఁ విచార ముకలుగునో, ఆదుశ్చింతనములను నీవు మఱచిపొమ్ము! నేనును మ ఱచిపోయెదను. ఈశ్వరుఁడు నీహృదయము నుత్తరోత్తరోన్నతముగ జేయువలయునని ప్రార్థించెదను. ఆదుశ్చింతనములన్నియును త్యజించు టకు నీకుఁ జాలఁ గష్టముగ నుండును. దానిని నేను నిర్భయుడఁనై సహించెదను. కాని నీహృదయమం దేనిర్మలానందము కలుగుచున్న దో దానిచే నేనుగూడ నత్యంతానందభరితుడఁ నదుగును.''

ఉత్ఫవున్నీసా పాదుషామాటలను విని చాలసంతోషముతో ''పాదుషా! మీారీదినమునసన్ను సుఖసాగరమునందేల్చితిరి. మహాప్ర భూ! విధేయురాలనగు నేను దురంతమైన మనోభావప్రభావమున మి మ్ములనుండి యీాప్రకారముగా వేఱుపడిపోయెదను.'' అనియెను.

జహాంగీరు ''ఉత్ఫవున్నీసా! ఒకకాలమునందు నేను నీకింకరుఁ డనై యుంటిని. ఇప్పుడు నట్లేయుండెదను. నిన్నుఁ జూచినది మొదలు కొని నీవాఁడనై యుంటిని. ఇప్పుడు నట్లేయుండెదను. ఉత్ఫవున్నీసా! నీవిందువలన నాతో వేఱుసంబంధమును కలుగఁజేసికొందువు. అందు వలన నిన్ను నిరాధారురాలినిగాఁ జేయుట యన్యాయము. మఱియు నది యసంభవముకూడను. నీసుఖమునకు నేను విఘాతమును కలిగిం

చువాఁడను కాను. నీకు పోవుట కాజ్ఞయిచ్చెదను. కాని దానివలన నామనస్సున కధికసంతాపము కలుగును. నాహృదయము చిరకాలమునుండి యున్ననీసంబంధమును త్యజించి యందుకొఱకు కన్నీరువిడువకయుండునంతటి పాషాణమయముగా నుండలేదు. నిన్ను మఱచిపోవుట నాకసాధ్యము. ఉత్ఫవున్నీసా! నాప్రాణమున్నంతవఱకు నా మనఃఫలకమునందు నీవు చిత్రింపబడి యుందువు."

ఉత్ఫవున్నీసా!:—"మహాప్రభూ! ఈదాసిని మఱచికొండు. ఈమెచాలకాలము మీయనుగ్రహమును గాంచినది. మీయెడ ననేకాపరాధములను గూడఁ జేసినది. పాదుషా! నేఁడు వానినన్నిఁటిని గూడ మఱచిపోయి నన్ను క్షమింపవలయును."

"నేను నిన్ను క్షమింతును, నీవు నన్ను క్షమింతువా? అది యెట్లైనంగానిమ్ము—ఉత్ఫవున్నీసా! తఱచుగ.నాకు నీక్షేమసమాచారము లెట్లు తెలియఁగలవు?"

"ఈదాసి బాదుషాగారి కెల్లప్పుడును జాబువ్రాయుచుండును దేవర దానికిఁ బ్రత్యుత్తరమును పంపుచున్నయెడల నీమె చాలఁ గృతార్థురాలగును."

"అది నీవు చెప్పవలయునా?"

ఉత్ఫవున్నీసా తిరిగి యాజ్ఞను పొంది, "చాలప్రొద్దుపోయినది మీకు విసుఁగుజనియింపగలఁదు. ఆజ్ఞయయ్యేనేని పోయివచ్చెదను." అనియెను.

పాదుషా యేమియు మాటలాడలేదు. ఉత్ఫవున్నీసా యాతని ముఖమును చూచెను. ఆతని విశాలనయనములనుండి యశ్రుబిందువులు వెడలుచుండెను. ఉత్ఫవున్నీసాకు చాలఁగష్టముగఁ దోచెను.

జహాంగీరు "ఉత్ఫవున్నీసా! నీకేమని చెప్పను? వెలుపల నిన్నుఁ జూడకపోయినను నామనసునం దెల్లప్పుడును జూచుచునే

యుండును. నామనస్సెల్లప్పుడును నీతోడనే యుండును. భగవంతుఁడు నిన్ను రక్షించుఁగాక! పూర్వమందు నీకును నాకును గలపరిచయమి ద్దఱిమనస్సులను నడఁగిపోనిమ్ము! నన్ను నీకు బంధువుననిమాత్రము నీహృదయమునఁ దలంచుకొనుచుండుము. నీకు పరిచితుఁడనై హిత వాదినై యుపకారినై మిత్రుఁడనై యుండవలయుననియేఁగాని మఱి యొకలాగున నుండుటకు నాకెంతమాత్రము నిష్టములేదు. నేను నీకు మొదట నెట్టిమిత్రుఁడనై యుంటినో యిప్పుడుగూడ నట్లేయుందును. నీకెప్పుడైన నేదైన నుపకారము చేయవలసియున్నయెడల, దానిని పరమానందముతో నొనర్చెదను. ఉత్ఫున్నీసా! ఈదినము నాజీవిత మునం దెంతభయంకరమైనదినము! నేఁడు నేనునిన్ను—ప్రేమరూప కమగు రత్నమును—పోఁగొట్టుకొంటిని. కాని యిప్పుడు నాశోకసం తాపమును కలుగుచున్నది. నీహృదయమునుండి నేను సంపూర్ణము గ విడివడలేదను నాశయే నాకు సుఖదాయకమై యున్నది. నీవు న న్నాసుఖమునుండి వంచింపలేవని నాకు ధైర్యము కలదు. విపత్తునం దుగాని, సంపత్తునందుగాని, యీజహాంగీరును మఱవవలదు. "భగ వంతుఁడు నిన్ను సుఖముగా నుంచుఁగాక!" అని ప్రార్థించుచున్నాఁ డను."

ఉత్ఫున్నీసా చూడఁగా బాదుషా గండస్థలములనుండి య శ్రుధారలు జారిపోవుచుండెను. ఆమె యిఁక నాలస్యముచేయఁగూడ దని యనుకొనియెను. ఆతని మనసు చలించిపోయినదని గ్రహించెను అది యటునిటు వెనుకముందున కూఁగులాడుచున్నట్లుండెను. ఇఁకనట నుండుట మంచిదికాదని యనుకొనియెను. జరగవలసినదంతయు జరిగి పోయినది. రాతిని పైకి విసరినట్లయ్యెను. తిరిగి యది తలపైఁ బడిన యెడలఁ దప్పించుకొనుట యసాధ్యము. సముద్రమధ్యమునం దొకపె ద్దయలలేచెను. అది తీరమును తాఁకియేయుండును. ఇదియంతయును

సృష్టినియమము. చిరకాల మొక్కవిధముగా నుండదు. ఇఁక నాల స్యమెందులకు? స్వభావగతి నెవ్వరుమార్పఁగలరు?

ఉత్ఫవున్నీసా జహాంగీరునకు వినయపూర్వకముగ సన్మానముతోనభివాదనమొనరించి మహాప్రభూ! ఈదాసి దేవర శ్రీచరణముల కడ సెలవు వేఁడుకొనుచున్నది. ఇదే కడపటిదరిసెనమని తోఁచుచున్నది'' అనియెను.

ఉత్ఫవున్నీసా పాదుషాయొక్క ప్రత్యుత్తరమునకై నిరీక్షింపకయే వెడలిపోయెను. జహాంగీరుఁ డాస్థలమునందే చాలసేపు నిలువఁబడిపోయెను. ఆతఁ డెలుగెత్తి ''కడపటిదర్శనము'' అనియనుకొనియెను.

ఇట్లనుకొని యొక దీర్ఘనిశ్వాసమును విడిచి విషణ్ణహృదయుఁడై యాస్థలమును విడిచిపోయెను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము

### లేఖ.

నాఁటిపగలు రెండవజామున నుత్ఫవున్నీసా విశ్రమించుటకై తంద్రిభవనమునం దొకగదియం దేకాంతముగ సుస్థిరభావముతోఁ గూర్చుండియుండెను. ఆస్థితియం దామె విరక్తయై అవస్థాంతరమును పొందెను. దానిచే సంతోషభావము కలిగియుండలేదు. పరుండినను, స్తిమితభావము కుదురుటలేదు. ఒకపారిషీపుస్తకమును దీసికొని చదువ నారరభించెను. పుస్తకమునందలి మొదటిపుటను దీసి కొంతవఱకు మాత్రము చదివెను. ఆమె కది రుచింపలేదు. రెండవపుట త్రిప్పి దానిలోఁ గొంతభాగము చదివెను. ఈవిధముగా పుటలను ద్రిప్పుచు అ

క్కడక్కడఁ జదువుచుండెను. తుదకొకచో నొకపద్య మామెకంటఁ బడెను.

ఉత్ఫున్నిసా యాపద్యమును మఱియొకసారి చదివెను. మరలఁ జదివెను. తుదకాగ్రంథమునం దాపద్యమున్న చోటనే యొకవ్రేలినుంచి పుస్తకమునుమూసి పట్టుకొని యేమో యోచింపఁదొడంగెను. ఆమె కేమియును పాలుపోయినదికాదు. పుస్తకమునొకచోటబెట్టి కలమును సిరాబుడ్డియుఁ గాగితమును దీసికొనివచ్చి యొకయుత్తరమను వ్రాయుటకు సంకల్పించుకొనియెను. ఉత్తరమెవ్వరికి? పాదుషాః హాంగీరునకు. ఆమెచాలసేపు వ్రాసెను. మధ్యమధ్య కన్నీరు గ్రమ్మి దృష్టి కవరోధమగుచుండెను. చీరచెఱఁగుచేఁ గన్నీటిని దుడిచికొనచుండుటచే నిమిష నిమిషమునకు లేఖవ్రాయుట యాఁగిపోవుచుండెన పిమ్మట మరల వ్రాయుటకు మొదలిడెను. చాలసేపటికి ఉత్తరమున బూర్తిగావించెను. ఉత్తరమును మడచి—పిమ్మట తిరిగి దానినివిప్పి మొదటినుండి తుదివఱకును జదివి చూచుకొనియెను;—ఉత్తరము-

"మహాప్రభూ! ఈదాసి యేలినవారి శ్రీచరణములసన్నిధి నుండి యాజ్ఞను దీసికొనుసమయమునఁ దమ సంపూర్ణానుమతిని బొదలేదు. అందుకొఱకు మన్నింపవలయునని ప్రార్థించుచున్న దానను

బాదుషహా! ఒకరిమనసు మఱియొకరికివిప్పి చూపుట కుపాయమున్నదా? అట్లున్నయెడల ఉత్ఫున్నిసా హృదయమెట్టియవస్థయందున్నదో స్పష్టముగఁ జూపుట కామె సిద్ధముగానున్నది. అప్పుడీపతభాగిని యంతఃకరణమునందు సహింపరాని యెట్టిదవానలము ప్రజలించుచున్నదో యది మీకు దృగ్గోచరము కాఁగలదు. మరణమున గాక మఱి యేయుపాయముచేతను, ఈపాపాత్మురాలు ఆయాతననుడి యుద్ధరింపఁబడు ననునాశ లేదు. కాని, పాపప్రవృత్తయైన ఉత్ఫున్నిసాకు మరణమెక్కడిది? ఘోరము ముట్టిన పాపమును బ్రపంచవ

నకుఁ జూపుటకై విధాత యామెను మరణము లేకుండఁ జేసిచిరంజీవి నిగ నీలోకమున నిలిపివైచెనని తోఁచుచున్నది. ఇప్పుడు మృత్యువా మెకు ప్రియమిత్రమయ్యెనని తెలిపెదను. మృత్యుదేవత యెదుట నిలిచెనేని ఆమెను సాదరపూర్వకముగ నాలింగనము చేసికొనుటకు సిద్ధముగా నున్నదానను. మహాప్రభూ! ఈపాపజీవనమును నిలుపుకొని యుండుట కెంతయును నాకిష్టములేదు. ఎంతసుకరముగా ఉత్ఫవున్నీసా పే రీలోకమునుండి విలుప్తమైపోవునో యంతశుభకరము.

ఉత్ఫవున్నీసా జీవనము పాపానలమందు మండుచు హుంకారము చేయుచున్నది. పాపమునుండి పాపాంతరమునకుఁబోవుచున్న యామెకు మండుచున్న తనహృదయమును శాంతింపఁజేయుటకుఁ జల్లఁదన మెక్కడినుండి వచ్చును? అందువలన నగ్నికీలలు తగ్గుటకు మాఱుగ మఱింత వృద్ధియై మండుచున్నవి. ఈహతభాగిని తనజీవనమును, తా నొనరించిన సమస్తకార్యములను, జ్ఞప్తికిఁ దెచ్చికొను చున్నది. చేసినకార్యములన్నియు అసారములై నీరసములై అగ్నిదగ్ధమైన మరుభూములవలెనే నిరుపయోగములయి పోయినవి.

ఉత్ఫవున్నీసా జీవితమునం దొక్కదినము—కేవల మొక్కదినముమాత్రమే, ఎంతశాంతి—ఎంతయాత్మానందము—అనుభవించినదో, అంతశాంతి—అంత యాత్మానందము తనజీవితమునం దెన్నఁడు ననుభవించియుండలేదు. ఏదినమున నీమందభాగ్యురాలు భర్తృచరణ కమలములను వక్షమునం దుంచుకొని కన్నీటిచే నభిషేకించినదో యాయొక్కదినమే యామెజీవితమునకంతకునుసుఖకరమైనసుదినము.

పాదుషహా! సాధ్యమైనంతవఱకు నన్ను మఱచిపోవలయును. పాపవిశిష్టమైన ఉత్ఫవున్నీసా పేరునకు నీహృదయమునందు చోటివ్వకుము! ఉత్ఫవున్నీసా పాపాత్మురాలు; దుశ్చరిత్ర; అసతి; అదృష్టి ముగల రాజ్యసింహాసనాసీనుఁడగు జహాంగీరుచక్రవర్తి హృదయ

ముకు నిలిచి యుండుటకు యోగ్యురాలు కాదు. మీరా రామె కొసంగిన యనుగ్రహము మీయుదారహృదయమును ప్రకటించుచున్నది. ఈ దాసి దేవరవారి సన్నిధి ననేకదోషములను చేసియుండును. ఆమె పేరుతో నామె దోషములనుగూడ నేలినవారి హృదయమునుండి త్రోసివేయవలయును. ఈదాసితో మాటలాడుటను గూడ మఱువ వలయును. ఉత్ఫుల్లన్నిసా యనునామె యీప్రపంచమున నున్నదని యింకఁ దలంపవలదు. ఆమె సుఖదుఃఖాదికము లన్నియు మనస్సున నుంచుకొనవలదు.

మఱియొక చోట మనసుంచి రమణీకులాలంకారయు నాప్రియ సోదరియు నైన నూర్జహాను విషయమున నుదాసీనుఁడవై యుండ కుము. నూర్జహాను రమణీమణి—పాదుషావంటి పురుషునకుఁ దగిన పత్ని—ఆమె రూప మసాధారణమైనది—ఆమె సుగుణములనుగణింపఁ జాలము. ఈదాసి నూర్జహాను నీతిరీతులంగాంచి యత్యంతాశ్చర్య మును బొందినది. ఆసోదరీమణి కొక్కసారి నా పేరు జ్ఞప్తికిఁ దెచ్చి యామెవలన నేను కడపటి సెలవు గైకొంటినని కూడఁ దెలుపవలయును.

మహాప్రభూ! ఇప్పుడు నేను పతిపాదసాన్నిధ్యమునకుఁ బోవు దునా? తిరిగి నేనీదేశమునకు వచ్చుట యసంభవము. ఆకారణము వలన నీదాసిని తిరిగి చూచుట కలుగదు. ఇదియే కడపటి సందర్శన మని తెలిసికొనవలయును.

విశేషించి వ్రాసి పాదుషావారి యమూల్యసమయమును వ్యర్థ ముసేయఁజాలను. మీకుఁ దఱచు సమాచారము నంపుట కంగీకరించి వచ్చితిని. కాని యోచించిచూడఁగా స్త్రీలమనసు దుర్దమనీయమైన దని తెలిసికొంటిని. విశేషించి ఉత్ఫుల్లన్నిసా హృదయము పాషాణము కంటె నసీరసమై శుష్కమై కఠినమైయున్నది. ఆనీరసహృదయమం దిప్పుడు స్వల్పముగ ధర్మరసము చిలుకఁబడినది. అందువలన నాకతి

నహృదయము కొంతవఱకు మెత్తఁబడినది. మహాప్రభూ! ఈసమయమున దానిని సావధానముగ జాగ్రతపెట్టనియెడల నది మఱలఁ దన బూర్వావస్థకుఁ దిరుగుట కెంతసేపుకావలయును? ఈకారణమునిల చే మహాప్రభూ! ఇఁకముం దీదాసి దేవర కెట్టియుత్తరములను వ్రాయఁ జాలదు.

మహాప్రభూ! ఇంకను ప్రార్థించున దేమనఁగా—నన్ను మఱచిపోవలయును. నాపరిచయము—నాసంబంధము—నా పేరు—ఈ మొదలగు జ్ఞాపకము లన్నియును. పాతాళమునకు ద్రోసి వేయవలయును నన్ను మరచిపోవలయును. ఈపాపాత్మురాలి పేరు తిరుగఁ దమహృదయమునఁ బొడసూపకుండునట్లు చేయవలయునని యే నాప్రార్థనము.

సోదరియగు శ్రీమతి నూర్జహానుతో దేవర పరమానందమున నతులైశ్వర్యయుతులై సుఖమనుభవించుచు చిరజీవులై యుండవలయు నని యీదాసి ప్రార్థించుచున్నది.

ఉత్ఫవున్నీసా వ్రాసినయుత్తరమును చదివి మడచిఁ తుదకు దాని మీఁదివిలాసమును వ్రాసి పాదుషాకుఁ బంపించి గంభీరభావముతోఁ గూర్చుండియుండెను.

---

## ఇరువదిమూడవ ప్రకరణము

### అభిజ్ఞానము.

"జ్వాఇ అనహత్థ గదం భవే తదా
సచ్చం సో అసీయం భవే"

అభిజ్ఞానశాకుంతలము.

ఉత్ఫవున్నీసా సప్తగ్రామమును విడిచి నెలమీఁదఁ బదునేను దినములు కావచ్చెను. ఇంకముందిచ్చట నుండినఁ బ్రయోజనములే

దని యోచించి సప్తగ్రామమునకుఁ బోయెదనని తల్లిదండ్రులతోఁ బ్రస్తావించెను. వారందులకు సమ్మతించిరి.

అరుణోదయమునకుఁ బ్రయాణసన్నాహము చేయఁబడియెను. పల్లకితో బోయులు సిద్ధముగానుండిరి.

నాఁడు ఉత్ఫవున్నీసా తల్లిదండ్రులకునమస్కరించి పల్లకి నెక్క సతోడనే బోయులు పల్లకి నెత్తిరి. ఆమె యాత్రాగ్రామందలి యభిమాన మును వదలివైచెను. ఏయాత్రాగ్రాపట్టణమునందలి యాబాలవృద్ధవనిత లును ఆమెను చూచి యామెపరిచయముచేఁ గృతార్థులు కానలయు నని తలంచుకొనుచుండిరో, ఏయాత్రాగ్రాపట్టణమునం దామె యెవ్వరికే మిచెప్పినను దాని నెల్ల సానందముతో నెఱవేర్చి వారు కృతార్థులగు చుండిరో, ఏయాత్రాగ్రాపట్టణమున వసియించిన జనులామెను చూచినది నమే శుభదినమని యనుకొనుచుండిరో. ఏ యాత్రాగ్రాపట్టణమందున్న యావనులైన ఉమ్రావులును, సరదారులును, ఆమె గంభీరభ్రూభం గములవలననే ముగ్ధులైపోవుచుండిరో, ఆ యాత్రాగ్రాపట్టణము నీదిన మున ఉత్ఫవున్నీసా మనఃపూర్వకముగ విడిచిపోయెను.

ఓ కాలమా! నీవే ధన్యవు. నీశక్తి యపారమైనదిగదా! నీవు నిర్జీవులను సజీవులుగను, సజీవులను నిర్జీవులుగను చేయఁగలవు. నీవు కుసుమమును పాషాణముగను పాషాణమును కుసుమముగను చేయఁ గలవు. నీవు పుల్లవిరిగిన చెట్టును పుష్పింపఁజేయఁగలవు. నీమోహాన మంత్రము చమత్కారమైనది. నీ వేమంత్రప్రభావముచేఁ బాషాణ మయమైన పద్మావతిని మనుష్యభావము కలదానిగఁ జేసితివో ఆమం త్ర మత్యద్భుతమైనది. శుష్కించియున్న పద్మావతీలత నీయసామా న్యమంత్ర ప్రభావముచేతనే విలసిల్లినది.

కొన్నిదినములలో ఉత్ఫవున్నీసా పాట్నానగరమును చేరెను. ఆమె సేవకులచ్చట సత్రమునం దామెకుఁ దగిన విడిది నేర్పఱచిరి.

ఉత్ఫవున్నీసా నియమితకాలమునకు ఆహారాదికమును గ్రహించి యొకగదిలో విశ్రమించియుండెను. ఆమె సేవకులందఱును వేఱొక గదియందుండిరి. తోడనే యామెకు నిద్రపట్టినది. కాని యేదో గందరగోళముచే నిద్రాభంగమయ్యెను. ఆకలకలమునం దొకపురుషుఁడు మఱియొకనిపై పెద్దకేకలు వైచుచు "నీకిది యెక్కడదొరకినది? ఇది చాలవెలగలవస్తువు. నిశ్చయముగా నీవు దీనిని దొంగిలించియుందువు అని యదలించుచుండెను.

మఱియొకఁడు——దేవునితోడు——నీపాదములతోడు—— నేనిది దొంగిలించినదిగాదు. నాకిది యొకరు దానముచేయుటచే లభియించినది.

కేకలువేయువాఁడు——అదేమిమాట! ఇట్టి యమూల్యపదార్థమును నీకు దానమిచ్చిరా?

అదియేమో తెలిసికొనవలయునని మనసుపడి ఉత్ఫవున్నీసాకుతూహలపరవశయై ఆగందరగోళముజరగుచున్నవైపు గవాక్షమును తెఱచి చూచెను. అక్కడ సత్రాధికారి చేతిలోనొకయుంగరమునుంచుకొని మఱియొకనింగూర్చి పైనిజెప్పిన ప్రకారము సంభాషించుచు గద్దించుచుండెను. ఆచోటికనేకజనులు చేరుకొనిరి. ఉత్ఫవున్నీసా అవృత్తాంతమును తెలిసికొనుట కొకసేవకుని బంపి యీ యిద్దఱను బిలిపించివారువచ్చినతోడనే యీసమాచారమేమని యడిగెను.

సత్రాధికారి——ఈతఁడీయుంగరము నమ్ముటకుఁ గొనితెచ్చెను. దీనిని చూడగా నిది చాలవెలగలిగియుండెను. ఇది సామాన్యులైన వారియొద్ద నుండఁదగినదిగాఁ గానిపించుటలేదు. ఇది యేదో దొంగసొత్తయి యుండవలయును.

ఉత్ఫవున్నీసా——ఉంగరము చూడవలయును.

సత్రాధికారి యాయుంగర మామె చేతికిచ్చెను. దానిని చూ

చినతోడనే ఉత్ఫున్నిసా వడఁకనారంభించెను. ఆమె ముఖము నల్ల వడియెను. సంతోషము పోయెను. దారుణమైన పూర్వస్మృతియొక్క చిహ్నము ముఖమున వ్యక్తమగుచుండెను. ఉంగరము నమ్ముటకుఁ దెచ్చినమనుష్యునిఁ గూర్చి "నీకీయుంగర మెక్కడ. దొరకినది?" అని యడిగెను.

బ్రాహ్మణు—బీబీ! నేను దరిద్రబ్రాహ్మణుఁడను. కాశీపుర నివాసుఁడను. అక్కడ నేను భిక్షమెత్తుకొని బ్రతుకువాఁడను. ఇట్టి బ్రాహ్మణునియొద్ద నిట్టి యమూల్యపదార్థ ముండుట యసంభవము. తల్లీ! నిజముగా నేను దరిద్రుఁడనే యగుదును—కాని చోరుఁడను గాను. ఈయసాధారణపదార్థము నాకు భిక్షారూపమున వచ్చినది.

ఉత్ఫు—నీకు దీనిని దానముగ నిచ్చినవారెవ్వరు?

భిక్షుకుఁడు—ఇప్పటికి గొన్ని నెలలక్రిందటఁ దూర్పు దేశమునుండి యొకధనవంతుఁడు సపరివారుఁడై తీర్థయాత్రార్థముగఁ బోవుచుఁ గాశికి వచ్చెను. యాత్రకు వచ్చినవారందఱి నడిగినట్లుగనే యతనితో వచ్చిన యల్పవయస్కురాలగు నొకసుందరినిగూడ యాచించితిని. ఆమె నాయొద్ద నేమియు లేదనియెను. ఆమె రూపమును జూచి ఆమెయొద్ద నేమైన నుండకపోదని యనుకొని తిరిగి యేమైన నీయవలయునని వేఁడితిని, తుదకామె యట్లే యాలోచించి తన చికుర పాశమునుండి యీయుంగరమును దీసి "నాయొద్ద మఱియేమియును లేదు. ఇఁక దీనితో నాకేమియు నగత్యమునులేదు" అనిచెప్పి దీనిని నాకిచ్చెను. ఆమెతోడివా రందఱును దూరమున నుండిరి. నేనామె నాశీర్వదించి యింటికివచ్చి చూడఁగా నదియొక యమూల్యాభరణమైయుండెను. దీని నెవ్వరికి నీయక పెండ్లికాలమందు నాకుమార్తెకీయవలయునని యుంచితిని. కాని సంసారము జరుగక దీనినమ్మవలయునని తెచ్చితిని. దరిద్రుని దురదృష్ట మెక్కడికిబోవును? నేను

అమ్మవలయునని రాఁగా నీతఁడు నన్ను దొంగయని యనుమానించె ను. ఇప్పుడు మీరేమిచేసి నను చేయవచ్చును. బ్రాహ్మణుఁ డిట్లు చెప్పి యూరకుండెను.

ఉత్ఫ—ఆయూత్రకువచ్చిన వారెచ్చటివారో నీవెఱుఁగుదువా?

భిక్షుకు——ఎఱుఁగను, తల్లీ! అది నాకెట్లు తెలియును?

ఉత్ఫ——ఇదినీకిచ్చిన యామెకును, ఆమెతోఁ గూడ వచ్చిన వారికిని సంబంధ మేమైన నున్నదా?

భిక్షుకు——క్షమింపవలయును. బీబీ! అది నాకెట్లు తెలియును?

ఉత్ఫ——మంచిది. అది తెలియదు. ఆమె చూచుట కెట్లుండును? ఆమెను చూచితివిగదా!

భిక్షుకు——ఆమె పరమసుందరి——అంతటిసౌందర్యమును నేనె చ్చటను జూచియుండలేదు,

ఉత్ఫ——ఆమె వయసెంతయుండును?

భిక్షుకు——ఇరువదిరెండు——లేక యిరువదిమూఁడు సంవత్సర ములుండవచ్చును.

ఉత్ఫవున్నీసా నిట్టూర్పువిడిచి చాలసేపటికి "ఈయుంగరము నెంతవెలకమ్మెదవు" అని యడిగెను.

భిక్షుకు——అమ్మా! నేను దరిద్రబ్రాహ్మణుఁడను. మీరనుగ్ర హించి యెంతయిచ్చిన నంతియే చాలును——

ఉత్ఫ——నేను నీకు మఱియొక యుంగరమిచ్చెదను. దానిని నీ కుమార్తెకిమ్ము. అంతేకాక నీసంసారమునకొఱ కిన్నూఱురూపాయలి చ్చెదను. మఱియు నీయుంగరమువలన నాకు గలిగిన యుపకారము నకై మఱియేఁబదిరూపాయలు కూడ నిచ్చెదను. అంతటితో సంతుష్టి నందెదవా?

ఆబ్రాహ్మణునకు బ్రహ్మానందమయ్యెను. అతఁడానందముచే సంతుష్టుఁడయ్యెను. "నేను స్వప్నమందును నింతయాశపడలేదు. నీవు సాక్షాత్కరించిన లక్ష్మీదేవివి" అనియెను.

ఉత్ఫపుస్నీసా బ్రాహ్మణునకు పైనజెప్పినప్రకార ముంగరమును సొమ్ము నిచ్చి పంపెను.

సత్రాధికారి యామెయుదారకార్యమును జూచి యాశ్చర్యపడియెను. అందఱును వెడలిపోయిరి. ఉత్ఫపుస్నీసా మొకటివలెనే యాగదియం దొంటరిగఁ గూర్చుండియుండెను.

---

## ఇరువదినాల్గవప్రకరణము

### సందేహము.

If I should meet thee
After long years
How shall I greet thee.

Byron.

ఉత్ఫపుస్నీసా సప్తగ్రామమునొద్ద దట్టమైన యరణ్యమధ్యమ్మున రాత్రికాలమందు బ్రాహ్మణవేషముధరించుకొనికపాలకుండలతోఁ జెప్పిన మాట జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనియెను. అది యేమనగా—"నేను నీసవతిని. నీకు ధనమిచ్చెదను. రత్నము లిచ్చెదను. దాసదాసీజనములనిచ్చెదను. నీవు నీభర్తను విడనాడుము. నీవట్లు చేసినయెడల భర్త నావాఁడగు" నని చెప్పుటవిని సరళహృదయయు, నిర్వికారిణియు, సంసారజ్ఞానవిహీనయు నగు కపాలకుండల యనాయాసముగా "అట్లైన నీవే సుఖింపుము—అట్లే చేసెదను. నేపటినుండి నీసుఖమునకుఁ గంటకమునై యుండను" అని చెప్పెను. ఇవియన్నియు ఉత్ఫపుస్నీసా

ఇట్లు భావించుకొనుచుండఁగా ఉత్పలపున్నీసా కానందోదయ మయ్యెను. ఆమె కపాలకుండల విషయమునఁ గలిగిన యాశయు సార్థకమైనదని తెలిసికొనియెను. కపాలకుండల బ్రతికియుండినయెడల సంసార మం దధికసుఖము గలుగునని భావించుకొనియెను. ఇంతయాలోచన మెందులకుఁ గలిగినది? ఒకకాలమందు కపాలకుండలను దూరముచేయుటకుఁ బ్రయత్నించిన దీమెగాక మఱియెవ్వరు? యాకపాలకుండల బ్రతుకునకే ఇప్పుడీమె యాశపడు టెందుకు? దీనికిఁ గారణము ఉత్పలపున్నీసాకుఁ గల పతిభక్తియే భర్తకు సుఖము కావలయుయునని యట్లుప్రార్థించుచున్నది.

చాలసే పాకచోటనే కూర్చుండి యీవిధముగా ననేకాలోచనములఁ జేసి నిట్టూర్పు విడిచి యటనుండి లేచెను. ఉంగరమును భద్రముగ దాఁచి యొక పుస్తకమును జదువనారంభించెను.

---

## ఇరువదియైదవ ప్రకరణము

### భర్తృసాన్నిధ్యము

"ఛాయా న మూర్ఛతి మలోపహతప్రసాదే
శుద్ధేతు దర్పణతలే సులభావకాశః"

అభిజ్ఞానశాకుంతలము.

పాఠకమహాశయా! చాలదినములనుండి శ్యామసుందరీ నవకుమారుల సమాచారము తెలియుటలేదు. వారేమైరో తెలిసికొందము.

సాయంకాల మగుచుండెను. పశ్చిమదిక్తటంబున నరుణరాగము విరాజిల్లుచుండెను. ఎవ్వరో యింగిలీకపుఁబొడిని వెదఁజల్లినట్లుతోఁ

చుచుండెను. ఏపక్షమున బలవంతుల సహాయముండునో ఆపక్షమే ప్రబలమై సముజ్జ్వలమై తేజోవంతమైయుండును. బలవంతులు లేనిపక్షము మలినమై నిరాధారమైయుండును. మనుష్యసమాజమునం దీనియమము కలదు. ప్రకృతికూడ నీనియమమునే యనుసరించుచుండునా! పూర్వకాలమునందు రాజులకు చాలమంది భార్యలుండు నాచారము కలదు. ఏరాణి రాజుకంటఁబడి యాతని ప్రేమకుఁ బాత్రురాలగునో ఆమెసుఖమునకు పారమే లేదు. ఎవతె యాతని విషనయనములఁబడి నిషేధింపఁబడునో యామె కష్టమున కంతములేదు. అట్టియామె యెల్లప్పుడును వ్యాకులపడుచునే యుండును. సూర్యదేవుఁడు ప్రాతఃకాలమందుఁ దనసతియైన పూర్వదిశాకాంతతో నున్నప్పుడామెమనోహర శోభారాశిని చూడనివారున్నారా? ఇప్పుడామెను విడిచివచ్చి మఱియొకదానితో నొయ్యారముగ విహరించుచున్నాఁడు—ఇప్పుడుచూడుఁడు!—సతియైన పూర్వదిక్సతి క్రమముగమలినయగుచున్నది. ఆమెముఖమునందు నల్లనిఛాయలు దోఁచుచుండెను. మఱియు సూర్యదేవుఁడామెను విడిచి యెవ్వతెపై దయగలిగియుండెనో ఆమె పట్టరాని యానందము—ఆయానందసముద్రమునఁ దూగి యాడుచున్నది. అమెయెవ్వతె?...పశ్చిమదిశాకాంత—

ఈసమయమున నవద్వీపమునంగల యొకమేడమీఁది యంతస్థునం దొకయావనుఁ డొకయువతితోఁ గూర్చుండి మాటలాడుచుండెను. భాగీరథీపవిత్రజలతరంగములనుండి సుస్నిగ్ధమందమలయమారుతములు మెల్లమెల్లగ వచ్చి యాయువతీయువకుల లలాటములనుస్పృశించి వారివస్త్రాదులతోఁ గ్రీడించుచుండెను. యువతీమణి భుజంబులపైఁబడియున్న మనోహరకుటిలకుంతలములఁ గదలించుచుండెను.

ఆయువతీమణిని మీరందఱు నెఱిఁగియే యుందురు. ఆమె నవ

కుమారుని చెల్లెలైన శ్యామసుందరిరో. ఆమె పార్శ్వమున కూర్చుండిన పురుషుడామె భర్తయగు మధురానాథుడు.

శ్యా—ఇప్పు డెవ్వరికిని జబ్బు లేనట్టే.

మధు—ఇంకను వ్యాధియెక్కడ? నీవు రాకపోయిన యెడల, ఈశరీరము నిలువకయేపోవును. నీ సుందరవదనారవిందమును చూచి నమీఁదట రోగ మెట్లుండును?

"ఉండ కేమి?"

"ఉండదు."

"అట్లయిన యెడల నింక నాలోచన మెందులకు? ఇది మొదలెవ రెవరికివ్యాధి కలుగునో వారందఱను నాయొద్దకుఁ బిలిపింపవలయును, నేను వారికి ముఖము చూపించెదను. తోడనే వారి కారోగ్యము కలుగుచుండును."

"అందఱును చూచినయెడల నారోగ్యముకలుగదు. చూచుట యందుఁ గూడ విశేషమున్నది."

"ఏమివిశేషము?"

"నేను నిన్నెట్లు చూచితినో యట్లే చూడవలయును."

"మీరు నన్నెట్లు చూచితిరో యది నాకుఁ దెలియకపోలేదు. దానివలన మీవ్యాధి కుదిరినప్పుడట్లే యందరివ్యాధులును కుదురఁ గలవు."

"అట్లయిన నేను నిన్నితరులవలె సాధారణముగఁ జూచు చుంటినా?"

"అట్లుగాక మఱి యెట్లు చూచుచుంటిని?"

"కాదు, శ్యామా! నీవు అన్యాయముగాఁ జెప్పుచున్నావు. నేనిన్ని దినములును నీవిషయమై ప్రవర్తించిన దానిని బట్టి యట్లే చెప్పవచ్చును. కాని శ్యామా! నేను నామనఃపూర్వకముగ నట్లు

నడచుకొనలేదని నీవుమాత్ర మెఱుఁగవా? నాహృదయమున నెదకి చూచితివేని నేను నిన్నెట్లు ప్రేమించుచుంటినో నీవు తెలిసికొనగలవు

"మీరు చెప్పినమాటను మఱచిపోవుదునా? తియ్యనిమాటలను విని యుందఱును లోఁబడిపోవుచుందురు."

"శ్యామా! నాహృదయమును ఛేదించి చూపించిన మొదల నేను నిన్నెంతగా ప్రేమించుచుంటినో దానిని తెలియఁజేయ వచ్చును నేను సీతతోఁ గలసియున్నమొదల నెట్లు నీవాఁడనగుదునో నీమొదటిమాటునందు నట్లేయుంటిని. నీవు నమ్మిన నమ్ముము. లేకున్నఁ బోనిమ్ము. నేను మాత్రము నిన్ను నాప్రాణముకంటె నధికముగఁ బ్రేమించుచుందును."

ఈమాటను విని శ్యామసుందరి కలకల నవ్వెను. మధురానాథుని భుజముమీఁద తలనుంచి తిరిగి నవ్వెను. చాలసేపు నవ్వి తరువాత "మీరు కోపించుటయు నెఱుఁగుదును. మీరు నన్ను ప్రేమించుచుంటిరనియు నెఱుగుదును. మీవియోగముచే నింతవఱకు నేనుబడినకష్టమంతయు నేఁటితోఁ దీరిపోయినది. నేను దానిని మరల స్మరించుకొనను. కష్టపడక సుఖముకలుగదు. ఇకముందు మీరు నన్ను విడువఁగూడదు. ముసుపటివలె వచింపవలదు. నేను తిరిగి సప్తగ్రామమునకు పోవను"అనియెను.

మధురానాథుడు శ్యామసుందరిని కౌఁగిలించుకొనియెను. అట్లే వారిద్దఱు నెంతసేపుండిరో యదిమే మెఱుఁగము. చాలాసేపటికి మధురానాథుడు "శ్యామా! ప్రపంచమునం దెవ్వరు నీవంటి భార్యను బడయుదురో యట్టివారందఱును సుఖులైయుందురు"అనియెను.

శ్యామసుందరి నవ్వి"మీరు నన్ను ప్రేమించుటచే జనులందఱు నన్నందరికంటెను మంచిదందురని చెప్పుచున్నారు. ప్రపంచమందందఱును తమతమభార్యలను ప్రేమించుచు సుఖముగనే యుందురు" అనియెను.

"అట్లుకాదు. వాస్తవముగానీవంటిస్త్రీరత్నము దొరకుట

దుర్లభము. నేనీదినమునఁ గ్రొత్తగాఁ జూచుటలేను. నేనింతవఱకు ప్రయత్నింపకయే నామనస్సును నీయందే నిలిపియుంచితిని. ఇన్నిదినములైనమీఁదట భగవంతుఁ డనుకూలుఁడై నాసుఖమునవ్యాహతమైన దానిగఁ జేసెను. ఇఁక దేహమున్నంతవఱకు నీసుఖమును విడిచి యుండ జాలను. నిన్నొక్క నిమిషమైనను విడిచి యుండలేను."

శ్యామసుందరి మధురానాథుని చేయి పట్టుకొనియెను. అతఁ డామెను ముద్దుపెట్టుకొనియెను.

ఈసమయమున నింటివెలుపల నవకుమారుఁడును మఱికొందఱును మాటలాడుచు గట్టిగా నవ్వుచుండుట వినవచ్చెను. మధురానాథుఁడు శ్యామసుందరి నింకొకసారి ముద్దుపెట్టుకొని వెడలిపోయెను.

శ్యామసుందరి చాలసేపక్కడ నొక్కతెయే కూర్చుండి యుండెను. ఆమె యత్యంతానంద భరితురాలై యుండెను, ఆమె నవద్వీపమునకు వచ్చి మూఁడుపక్షములయ్యెను. వచ్చుసరికి మధురానాథుడువ్యాధిగ్రస్తుఁడై యుండెను. ఈనెలపదునేనుదినములలో సంపూర్ణముగ నారోగ్యవంతుఁడయ్యెను. శ్యామసుందరి సుఖమున కిదియొక ముఖ్యకారణము. ఎప్పుడైనను సంవత్సరమున కొకసారిమాత్రము చూచుచుండిన భర్త యిప్పుడు సర్వదా కట్టెదుటనే యుండుట యామెసుఖమునకు మఱియొక కారణమై యుండెను.

---

ఇరువదియాఱవప్రకరణము

ప్రియలేఖ.

"Why did you falsely call me Lavinia;
And swear I was Horatio' s better half,
Since now you mourie unkindly by yourself,
And rob me of my partnership of sadness"
N. Rowe.

నవకుమారుఁడును శ్యామసుందరియు నవద్వీపమునకు వచ్చి నెలపదునేనుదినము లైనది. ఈనడుమ నవకుమారునివిషయమై తెలియఁబడని సమాచారములన్నిటిని మధురానాథుఁడు నవకుమారునివలన వినియెను. కపాలకుండలాపద్మావతుల విషయములైన సంగతులన్నియును తెలిసెను. నవకుమారుని హృదయభావమును బాగుగ దెలియవచ్చెను. వారిద్దఱు నొక్కచో నున్నప్పుడీవిషయములను గూర్చి చెప్పుకొనుచుండిరి.

ఒకదినమున నవకుమారునకు పద్మావతి వ్రాసినయుత్తరము వచ్చెను. ఆమె యాగ్రానుండి సప్తగ్రామమునకు జేరినతరువాత నీయుత్తరమును వ్రాసి పంపెను.

నవకుమారుఁడాయుత్తరమును విప్పి చదువఁదొడఁగెను—
“ప్రాణేశ్వరా!

విధాత నన్ను కష్టసముద్రమున ముంచివేయవలయుననిసంపూర్ణముగ సంకల్పించుకొనియెను. ఎవరిని చూచుచున్నయెడల నేనత్యంతానంద భరితురాలనై యుందునో యాతని నేదో విపత్తునందు ముంచుటచే నాతని దర్శనలాభము దుర్లభమై పోయెను. నాకు కష్టములను గూర్చుకొఱకు భగవంతుఁడు నీ కీవిపత్తును కలిగించెను. నేను కఠినహృదయురాలను. నాహృదయ మేదైననుసహింపఁగలదు. ఇదియంతయునుసహింపగలదు. శ్యామసుందరిభర్త కారోగ్యముకలిగినదనివింటిని. భగవంతుఁడు పాపాత్మురాలగు నాప్రార్థనము వినుటలేదు. కాని నేను నామనోవాక్కాయకర్మలచే నాతఁడారోగ్యమును పొంది దీర్ఘాయుష్మంతుఁడై యుండవలయునని ప్రార్థించుచుంటిని. మీరు మీ ప్రియస్నేహితునిచే నాకు వార్తనంపినప్పుడు నవద్వీపము నుండి శీఘ్రముగనే వచ్చెదనని చెప్పియుంటిరి. నాథా! ఇదియేనాశీఘ్రముగవచ్చుట? నేను దినములను లెక్కించుకొనుచుంటిని. మీరు నవద్వీపమునకుఁబోయి నెలమీఁదఁ బందొమ్మిది దినములైనది. మీరు

భిప్రాయము నకీ యల్పకాలమేయని యాలోచినను నామనస్సున కది యుగాంతరమువలెఁ గానవచ్చుచున్నది. మీరు నన్ను నీవిధముగాఁ ద్యజించుట కుపాయము నాలోచక యీవిధముగా విడిచిపైచితిరా? నే నేవిధముచేసినను మీప్రేమకుఁ బాత్రురాలనై యుండుటకు యోగ్యురాలను కానని బాగుగ నెఱుఁగుదును. మీరు నాయందింతవఱకను గ్రహించుట మీ యుదారగుణమును ప్రకటించుచున్నది. అయినను, హృదయేశ్వరా! నన్ను స్వర్గమున కెక్కించి తిరిగి నరకమునకుఁ ద్రోయుట యుచితమా! మీరు నన్నిట్లు త్యజింపదలఁచియే యున్నయెడల నన్నాశాతీతసుఖసాగరమున నేల తేల్పవలయును? నేనుదుఃఖిని, మందభాగ్యురాలను; పాపాత్మురాలను—మీచరణకమలములను ధ్యానించుచుఁ గాలక్షేపము చేయుచుంటిని. నాకు ఈయవస్థయందుఁగూడ సుఖమున్నది. కాని—ప్రాణేశ్వరా! మీరే నాసుఖేచ్ఛ నతిశయింపఁ జేసితిరి. ఇప్పుడంతమాత్రముననే నాచిత్తము సంతుష్టినందుటలేదు—నన్నింతటి సుఖమునకుఁ దార్చి తిరిగి దుఃఖమున ముంచినయెడల నొక త్రుటికాలమైనను జీవింపజాలను. ఈయవస్థయందు మరణమున తక్క మఱి యేవిధమునకు శాంతి కలుగఁజాలదు. మీయిష్టమున కభ్యంతరముగ నిర్బంధించుటకు నాకిష్టము లేదు. మీ కేదిమంచిదని తోఁచునో యట్లే చేయుఁడు

ఈశ్వరానుగ్రహమున నేనైనంగానిండు. మఱి యేమైన నసందర్భమున్నయెడల దానిని తెలుపఁగోరెదను. పద్మావతి మీకుఁగావలసినదిగాదా? ఎవరికిమనస్సును ప్రాణమును సమర్పించుటకు సంకల్పించుకొంటినో అట్టి మీరు నాయందు దాఁపఱిక ముంపగూడదు. మీకష్టము పద్మావతికష్టముగాదా? మీదుఃఖము పద్మావతిదుఃఖమే యగునుగదా? అట్లయినయెడల, ప్రాణేశ్వరా! నాయందు దాఁపఱికమెందులకు? నేనబలను. మీవిపత్తునందు మీకష్టములోని కొంతభాగము

నై ననువహించుట కసమర్థురాలనేమోయనిసందేహించుచుంటిరా? ఆ సందేహమువలదు. నేను విశేషముగ సహించితిని. సహింపఁగలను.

ఏదినమున నిర్భాగ్యురాలగు పద్మావతి మీపాదములపైఁ బడి యేడ్చినదో, ఏదినమున మీరామె పాపములనన్నిటిని క్షమించి యామెకు మీహృదయమునఁ జోటిచ్చితిరో ఆదినమే యీదాసి జీవనమున సుదినముగదా! ఆదినము తిరిగి వచ్చునా? మహాపరాధినియైన పద్మావతి తిరిగి మీపాదములకడ నపరాధినియైయున్నదేమి? అయియుండవచ్చును. అట్లుండినను ఏమనసుచేత మీరామెదారుణదుష్కర్మముల నన్నిటిని క్షమించితిరో ఆమనసుచేతనే దీనిని గూడ క్షమింపఁగోరెదను.

తిరిగి మీ కేమిచెప్పగలను? ఏమిచెప్పిన మీరీదాసిహృదయావస్థను తెలిసికొనఁగలరు? హృదయావస్థను వెలిపుచ్చుట నాకసాధ్యముగనున్నది. మీహృదయమున నాకుఁజోటిచ్చినయెడల—మీరు నన్నుఁ బ్రేమించినయెడల—మఱియేమిచెప్పినను నీపరోక్షమున నాహృదయ మెట్టియవస్థయందుండెనో దానిని మీరు సులభముగాఁ దెలిసికొనఁగలరు.

ఇప్పుడు చెప్పుడు! మీరు నవద్వీపమున నెన్నిదినములుందురు నేను వినినదంతయు నీశ్వరానుగ్రహముచే నిజము కావలయును. మధురానాథచతోష్పాఠ్యాయున కారోగ్యముగా నున్నయెడల నింక నక్కడ నాలస్యముగ నుండుట యెందులకు?

శ్యామసుందరికి నన్ను జ్ఞప్తికిఁ దేవలయును, దేవుఁ డామెను సుఖవంతురాలిగఁ జేసి రక్షించుగాక!

మీవిరహామం దివిధేయినికి సుఖముండుటయే సంభవించినయెడల నది సుఖమే కానిండు! మీ రెల్లవిధముల చేతను సుఖులై యుండవలయునని యీదాసి ప్రార్థించుచున్నది''

నవకుమారుఁడు డిట్లాయుత్తరమును చదివెను. ఆయుత్తరము నందలి ప్రతివాక్యమునందును పద్మావతి పవిత్రప్రేమము ప్రకాశమానమగుచుండె నని తెలియవచ్చెను. తిరిగి యాయుత్తరమును చదివెను. బద్మావతి సుఖదుఃఖవిషయములంగూర్చి యాతఁడు చాలసేపు యోచించెను. తరువాత నాయుత్తరమునకుఁ బ్రత్యుత్తరమును వ్రాయుట కారంభించెను. ఆమె ప్రతివాక్యమునకుఁ దప్పక ప్రత్యుత్తరము వ్రాసెను. తానామెను మఱచిపోవలేదనియు, ఎన్నటికిని మఱవజాల ననియు, ఆమె సుఖవిషయమై యన్నివిధములచేతను బ్రయత్నించెదననియు కేవలమిష్టములేకపోయినను మధురానాథుని బలవంతముచే నిచ్చట నిలువ వలసి వచ్చినదనియు వ్రాసెను.

నవకుమారుఁ డీవిధముగ నుత్తరము వ్రాసి తిరిగి చింతాక్రాంతుఁడయ్యెను. పద్మావతిని గూర్చిన యాలోచన మాతని మనసునకు దట్టెను. అతని మనస్సామెవైపునకు మఱింత వేగముగఁ బోయెను. దానికిఁ గారణమేమి? ఆమె యాతనిని బాగుగఁ బ్రేమించినదని మొదటనే తెలిసియుండెను. ఇప్పుడు వచ్చిన యుత్తరమును దానికిఁ దార్కాణగ నుండెను. ఆప్రణయమే నవకుమారునిప్రణయమును బలపఱచుటకుఁగారణమయ్యెను. ప్రణయమున కద్భుతమైన శక్తియున్నది. మీరొకనిని ప్రేమించినయెడల నాతఁడు వానిని లెక్కసేయఁడు. అతడెప్పుడును మీపక్షముననేయుండును. మీయందలి గుణలేశమును గూడ మహత్తరమైనదానిగఁ జూచుకొనుచుండును. మనుష్యుఁడే ప్రణయావతారము. మనజునియొక్క సాంసారిక సంబంధములైన కార్యములలోఁ జాలవరకు ప్రణయము, స్నేహము, మమకారము, వాంఛ, లాలసత్వము, శ్రద్ధ, భక్తిమొదలగు ధర్మములచే సమముగ బ్రేరేపింపఁబడుచుండును. అందరి హృదయములందును కొంచెమో గొప్పయో ప్రణయముండియే యుండును. హృదయమునం దించుక

ప్రేమ యుదయించెనేని యది కొంచెముకొంచెముగ నభివృద్ధినొందుచుం డును. వనమునం దొకచోట నిప్పుముట్టుకొన్నయెడల నది క్రమక్రమముగా నరణ్యమంతటను వ్యాపించి యెట్లు భయంకరమైన కార్చిచ్చుగాఁ బరిణమించునో, మనోహరమైన ప్రభాతసూర్యకిరణములాకాశమండలమంతట నలమికొని కొంచెము సేపటిలోనే దారుణాకారమును దాల్చి యెట్లుజ్జ్వలములను నాక్రమించుకొనునో, నిద్ర తెలియఁబడకుండ మెల్లమెల్లగ వచ్చి కన్నుమూసిన కొంతకాలమునకే దేహము మనస్సు, మొదలగు చైతన్యముల నెట్లాకర్షించునో, అట్లే హృదయక్షేత్రమున ప్రేమాంకురమైనయెడల నల్ప కాలములోనే యది గొప్పవృక్షమై యావరించుకొనును. నవకుమారుని హృదయము మొదటనే పద్మావతిని ప్రేమించెను. ఇప్పు డా ప్రేమము క్రమముగా వర్ధిల్లి యీవిధమైన యాకారమును ధరియించెను. ఇదియేమియు నువింతగాదు. ప్రణయమున కిది సామాన్యగుణము. ప్రణయాధికారము లేని దేశమే లేదు. ప్రణయాధికారమునకు లోఁబడని హృదయమునులేదు. అట్టిహృదయ మున్నయెడల నది కేవలము నిస్సారమైనది. అట్టిమనుష్యుఁడు హేయపదార్థముకంటెను అసహ్యకరమైనవాఁడుగ నుండును. నవకుమారుని హృదయము స్వభావసిద్ధమైన యా ప్రణయముచే నిండింపఁబడి యుండెను. ఆపూర్ణహృదయముతో నాతఁడు పద్మావతిని ప్రేమించుచుండెను. ఆ ప్రేమ స్థిరమైనది గాదా!

అట్లయినయెడల నవకుమారుఁ డిన్నిదినములనుండియు కపాలకుండలను మఱచిపోయెనా? లేదు. ఆతఁ డిప్పుడును కపాలకుండలను మఱువఁజాలనివాఁడై యుండెను. ప్రాణమున్నంతవఱకు నామెను మఱచుటకు మార్గములేదు. కపాలకుండలయందలి నవకుమారుని ప్రేమకును, పద్మావతియందలి ప్రేమకును చాలభేదమున్నది. కపాలకుండల

యందలి ప్రేమ స్నిగ్ధమై, నిర్మలమై, శాంతమై, సముజ్జ్వలమైయుండె
ను. వజ్రమునుండి వెడలు మనోహరకిరణమువలె నుండెను. పద్మా
వతియందలి ప్రేమము భయంకరమై, తేజోవంతమై ఉజ్జ్వలమై ప్రదీ
పించుచుండెను. తేజస్సునుండి ప్రతిఫలించు జ్యోతివలెనుండెను. రెం
డును నావశ్యకములే. రెండునునవసరములే. రెండునుప్రియమైనవియే
కాని యిప్పుడు నవకుమారుని హృదయమందు పద్మావతియే ప్రబల
మైయుండెను. ఎందువలన ననఁగా—పద్మావతి యెదుటనున్నది.
కపాలకుండల యెదుట లేదు, సరేకదా, అట్లుండుటకూడ నింక నసం
భవము. ఇప్పుడు కపాలకుండలయందలి ప్రేమము కప్పఁబడియుండెను
అది యెప్పటికిని నాశముకాదు. ప్రణయము నశించుటకుఁ దగిన సా
మగ్రి లేదు.

---

## ఇరువదియేడవ ప్రకరణము

### అశుభసమాచారము.

"శోకోనాశయతేధైర్యం—"

రామాయణము.

మూఁడు దినములైనపిమ్మట నొకనాఁడు నవకుమారుఁడును
మధురానాథుఁడును వెలుపలకు వాహ్యాళికిఁబోయియుండిరి. ఈసమయ
మున నవకుమారుని వెదకికొనుచు నేయూరినుండియో యొక బ్రాహ్మ
ణుఁడును ఒక స్త్రీయును వచ్చెంచిరి. ఇంటియందున్న సేవకుఁడు వా
రిని మర్యాదతోఁ దీసికొనిపోయి చండీమంటపమున గూర్చుండఁబె
ట్టెను. అంతలో నవకుమారుఁడును మధురానాథుఁడును గూడవచ్చిరి
భృత్యుఁడు నవకుమారునకు వీరువచ్చినవార్తను విన్నవించెను. ఆ

మాట విన్నతోడనే నవకుమారుఁ డచ్చటికిఁ బోయి చూడఁగా నాతని హృదయము శోకాకులమయ్యెను. ఆతని కన్ను లశ్రుధారాపూరితములయ్యెను. కపాలకుండలయు నవకుమారుఁడును కాపాలికుని సమీపమునుండి యెవ్వతెయొద్దకు పలాయనులై వచ్చి యాశ్రయమునుపొందిరో యెవ్వతె నవకుమారునకు కపాలకుండలను కన్యాదానము చేసి యాతని యానందమును వర్ధిల్లఁజేసెనో, ఎవ్వతె యరణ్యమునందలి భవానీదేవియాలయమున కధికారిణిగా నుండెనో ఆమెయే యీవచ్చినయామెయైయుండెను. నవకుమారుని నోటమాటరాలేదు. అధికారిణి "నవకుమారా! కపాలకుండల యెట్లున్నది?" అని యడిగిన నేమి చెప్పవలయునో యని యాతఁడు విచారించుచుండెను.

నవకుమారుడు వచ్చి యధికారిణికి నమస్కరించెను. ఆమె యాతనికి మఱల నమస్కరించి "నవకుమారా! ఏల వ్యాకులపడుచుంటివి? అందఱును సుఖముగ నున్నారా?" అనియెను.

ఆమాట విననతోడనే నవకుమారుని కన్నులనుండి ధారాపాతముగ నశ్రువు లురుల నారంభించెను. అధికారిణి యాతని భావమును గ్రహించి యాశ్చర్యపడి వ్యాకులపడియెను. నవకుమారుఁడు చాల సేపటికి "అన్ని సమాచారములను చెప్పెదను. వినవలయును" అనియెను.

ఇట్లు చెప్పిన నవకుమారుఁడు అధికారిణియాజ్ఞను పొంది కపాలకుండలతోఁ గూడ బయలుదేరి వచ్చినమీఁదట జరిగిన దంతయును కపాలకుండలమరణమును, సవిస్తరముగఁ దెలియఁజెప్పెను. అది యంతయు విని యధికారిణి కన్నులనుండి యవిరళాశ్రుధారలఁ గురియించెను.

అధికారిణి కపాలకుండలను విశేషముగఁ బ్రేమించుచుండెను. ఆమెను తల్లియని పిలుచుచుండెడిది. కాపాలికుని దురభిప్రాయమునుం

డికాపాడుటకు ఆమె కపాలకుండలను నవకుమారునకిచ్చి పెండ్లిచేసెను బాగుగ యోచించి చూడఁగా గపాలకుండల కధికారిణి తప్ప నిఁక దిక్కెవ్వరును లేరు. అధికారిణికిని బంధువు లింక నెవ్వరును లేరు. ఆమె కపాలకుండలను పుత్త్రికావాత్సల్యముచే లాలించుచు బాలించుచుండె. ఆమెపై పుత్త్రికావాత్సల్యము కలిగియుండెను. కపాలకుండల కొంచెము జ్ఞానము కలిగినప్పటినుండియు నధికారిణి తప్ప మఱియెవ్వరి నెఱుఁగదు—అధికారిణియే తల్లియుఁ దండ్రియునై యుండెను. ఆమెయే సర్వమునై యుండెను. ఈవిధమైన ప్రేమచే మెలఁగుచున్న వారినడుమ నొక్కెడ కకాలమరణము సంభవించినప్పుడు మరియొకరికి హృదయము పగిలిపోవునని చెప్పుట కేమిసందేహము? అమెచాలసేపేడ్చెను. నవకుమారుఁడును మధురానాథుఁడును ఆమెనోదార్చిరి తుదకామె కొంచ మూరడిల్లి "నవకుమారా! కపాలకుండల మిగుల దురదృష్టవంతురాలు. భవాని యామె నుదుట సుఖమును వ్రాసియుండలేదు. చిన్నతనముననే యామె తల్లిదండ్రులను విడిచిపెట్టెను. తండ్రియెక్కడనుండెనో తల్లియెక్కడనుండెనో వారినివాసమెక్కడనో ఆబిడ్డకేమియును తెలియదు. నీకు పెండ్లిచేసితిని. ఒకదినమైనను ఆమె సుఖముగా నుండుటకు జూడవలయునని యుంటిని. అదృష్టము లేనప్పుడది యెట్లు సమకూడును? అంతయును విపరీతమైపోయినది" అనియెను.

నవకుమారుడు నిరుత్తరుఁడై రోదనముచేసెను. అధికారిణి "నవకుమారా! జరిగినదానినిగూర్చి యోచించినయెడలఁ గానున్నదేమి? నీవు సచ్చరిత్రుడవు. శాంతుడవు. దేవుఁడిందుల కిట్టి కష్టములం గూర్చెనో!— నీవు తిరిగి పెండ్లియాడి సంసారివి కావలయును" అని చెప్పెను. నవకుమారుఁడూరకుండెను.

అధికారిణి—ఆహా! ఆమెరూపమెంతమంచిదియో గుణము కూడ నట్టిదియే. ఆమెను చూచినయెడల దేవివలె నుండును.

నవకుమారుడు—కపాలకుండలపేరు భూమిమీద లేకుండఁబో యినది. ఆమెవృత్తాంతము నెవ్వరు నెఱుఁగరు. కపాలకుండలయే తన చరిత్రము నెఱుఁగదు. మీకేమైనను తెలిసినదా?

అధికారిణి నిట్టూర్పు విడిచి "ఆభవాని కపాలకుండల వృత్తాంతమంతయును నాకు దెలిపి ఈదుఃఖములన్నియు ననుభవింపవలయుననియే నానుదుట వ్రాసియుంచినది. అది యంతయు నేనెఱుఁగుదును." అనియెను.

నవ—అదియంతయు దెలుసుకొనవలయునని యిప్పు డప్పుడు నాహృదయముకలఁగిపోవుచుండును. నేఁడదియంతయునాలోచించుటనావశ్యకము. మఱియొకప్పు డదియంతయును విశదముగాఁ జెప్పెదరుగాక!

ఆరాత్రి యధికారిణి యక్కడనే యుండెను. ఉదయముననే లేచి తనజన్మభూమింజూచుటకుఁ బోవలయునని సెలవుదీసికొనియెను. నవకుమారుఁడు "రెండుదినములు మాత్రము మీరిచ్చటనుండిపోవచ్చును. అట్లైనఁ జాల సంతోషింతును. ఇప్పుడు మీరు పోయిచేయునదేమి? అక్కడ మీకెవ్వరున్నారు? ఎవ్వరిని జూచుటకుఁ బోవలయును? ఇంక నాలుగైదుదినములకు నేను సప్తగ్రామమునకుఁ బోవుదును. అప్పుడు మీరు పోయిరావచ్చును. నేనింక నొకనెల పోయినతరువాత తిరిగి యిక్కడకు వచ్చెదను. మీరు నంతలోఁదిరిగి పోవచ్చును. అప్పుడు తిరిగి మీసందర్శనము కావచ్చును" అనియెను.

అధికారిణి యట్లే యని సమ్మతించెను.

---

## ఇరువది యెనిమిదవ ప్రకరణము

### అవసాన కాలము.

"———Gone to pluto's reign
There with sad ghosts to pine and shadows dun"
Thomson's Castle of Indolence.

నవకుమారుఁడును మధురానాథుఁడును జల్లగాలి సేవించుటకై బయలు దేరిరి. కపాలకుండలను గూర్చిన సంగతులన్నియుఁ జెప్పుకొనుటకై యుత్సుకులై యుండిరి. నవద్వీపమునకు దక్షిణదిక్కునం దొక దట్టమైన యరణ్యము కలదు. ఆవనమధ్యమున నొక కొలనుండెను. స్నానార్థమై యధికారిణి యాకొలనికిఁ బోవుచుండెను. నవకుమారుఁడును మధురానాథుఁడును ఆమె నచటఁ గాంచి పిలిచిరి. ఆమె వారితో మాట్లాడుచుఁ గొంతదూరము వఱకు వచ్చెను. ఆయరణ్యమధ్యమున నొకసన్నని మార్గముండెను. వారు ముగ్గురును ఆదారిని పోవుచుండిరి. కొంతదూరము పోవుసరి కాసమీపమున నెవ్వఁడో యొకమనుష్యుఁడు బాధపడుచున్న శబ్దము వారికి వినవచ్చెను. అది విని ముగ్గురును వెఱఁగుపడిరి. వారు నాలుగుదెసలఁ బరీక్షించి చూచిరి. కాని యేమియు నగపడలేదు. మూల్గుచున్న శబ్దమమాత్రము మఱింత హెచ్చుగా వినఁబడుచుండెను. అధ్వని వనమధ్యమునుండి వారికి సమీపముగనే వినవచ్చుచుండెను. వా రాశబ్దము వినిపించుచున్న దిక్కుగాఁ బోయిరి. ఇఁక నాలుగడుగులు ముందున కేగి చూడఁగా నొకచెట్టుమొదట నొకమనుష్యుఁ డేదో బాధపడుచున్నట్లగపడెను. అక్కడినుండి ముళ్ళడొంకలను దప్పించుకొనుచు వారు ముగ్గురు నాస్థలమునకుఁ బోయి చూచిరి. సముద్రతీరవాసియును, కపాలకుండలకు పాలకుఁడును, భైరవీపూజాతత్పరుఁడును, జటాజూట

ధారియు, దురంతకుఁడు నగు కాపాలికుఁడు మరణబాధ నందుచు దీనుఁడై యక్కడ పడియుండెను. ఆతని కవసానకాలము సమీపించెను. ఇఁకఁ గొలఁదిసేపటిలోనే ప్రాణవాయువు లాదేహ గేహమును విడిచిపెట్టి పోనున్నవి. ఆతఁడింతవఱకును భైరవీపూజచే నేమిపుణ్యమును సేకరించెనో దాని నిఁకఁగొలఁదిసేపటిలోనే ప్రత్యక్షముగా ననుభవింపనై యుండెను. నవకుమారుఁడును అధికారిణియును "ఈతఁడిక్కడి కెందులకు వచ్చెను? అకస్మాత్తుగా మరణ మీతని చుట్టబెట్టుకొన్న దేమి?" అని యనుకొనిరి. కాని దానినిగూర్చి చర్చించుట కిది సమయము కాదు. వారు కాపాలికుని కెదురుగఁ బోయి నిలిచిరి. కాపాలికుఁడు వారిని జూచెను. నవకుమారునకు శరీరము గగుర్పొడిచెను. ఆతని శరీరమునుండి రక్త మతివేగముగఁ బ్రసరింప నారంభించెను. నాడులన్నియు మఱింత దడదడ కొట్టుకొనుచుండెను.

కాపాలికుని ముఖము వికసించెను. బాధచేత ధైర్యవిహీనుఁడైయున్న కాపాలికుఁడు కొంత శాంతభావమును వహించినట్లు తోఁచుచున్నది. వాఁడు వారిని కూర్చుండుఁడని చేతితో సంజ్ఞచేసెను. వారట్లు కూర్చుండిరి. కాపాలికుఁడు నోటిని తెఱచెను. అందువలన నాతఁడు దాహముగొని యుండెనని తెలిసికొనిరి. మధురానాథుఁడు జాగ్రతగఁబోయి తోడనే యొక మంటికుండతో నీటిని గొనివచ్చి యధికారిచేతి కిచ్చెను. అధికారిణి కాపాలికుని నోటిలోఁ గొంచెముమాటాడుశక్తికలిగెను. ఆతఁ డస్పష్టముగ మాటలాడ నారంభించెను. ఆతఁడు నవకుమారుని చేయిఁబట్టుకొని, మహా—పాపము—చేసితిని—ఘోర—నరక—భవాని—క్షమ—సంభవ—ఓ— నవకు—క్షమ కష్టము—పోవుచుంటిని—అనల—తల్లి—సాధ్వీ—క్షమ—చచ్చి పోవుచుంటిని—"

ఇట్లు చెప్పి కాపాలికుఁ డూరకుండెను. కాపాలికుఁడు తిరిగి "ప్రాణము—పోవు—ఉపాయము?—చచ్చుట—ఇప్పుడు—ఎట్లు?" అని

యెను. తిరిగి యాతఁడు నవకుమారుని చేతినుండి తన చేతిని దీసికొని రెండుచేతులను జోడించి యూర్ధ్వదృష్టి కలవాఁడై, తల్లీ—క్షమింపు—ము—ఆజ్ఞ—ఇమ్ము—నరకము—గతి—సాధ్వికి—ఏమి—తెలియదు—ఈమాఱు—క్షమ—ఇఁక లేదు—'' అనియెను,

కాపాలికుఁడు యాతనచేఁ దల్లడిల్లుచుండెను. ఆతని గంభీరనేత్రముల నీరు గ్రమ్ముచుండెను. ఆతనికి మాటాడుశక్తి క్రమముగా తగ్గిపోవుచుండెను. తిరిగి యాతఁడు నోరు తెఱచెను. అధికారిణి మరలనా తనినోటిలో నీరు పోసెను. ఆనీటిని మ్రింగి యాతఁడు మరల నవకుమారుని చేతిని బట్టుకొని, ''అన్నా!—నవ—చచ్చెద—కోపము—విడు—క్షమింపు—'' అని యూరకుండెను. కాపాలికుఁడు చాల దురంతకుఁడు దుర్మతి; ఒకప్పుడాతఁడు మర్మభేదకములగు చూపుల నవకుమారునిఁజూచెను. అయినను, ఆతని మరణబాధనుజూచి నవకుమారుని హృదయము కరఁగెను. నవకుమారుఁడు బిగ్గరగా ''నేను నిన్ను క్షమించితిని. భవాని గూడ నిన్ను క్షమించుటకై యామెను ప్రార్థించెదను'' అనియెను.

నవకుమారుని యుచ్చైస్స్వరము చెవికి సోకి కాపాలికుఁడుతిరిగి నవ-కపాలకుం—డ—ల—ల-క్ష్మి—స—తి—ఆ—త—ల్లి—ఉన్నది—యశి—పు—ర—యాత్రి—ధన—వంత—భవాని—తల్లి—'' అనియెను.

నవకుమారుఁడును, అధికారిణియు, నీమాటలను స్పష్టముగా వినవలయునని సంభ్రమపడఁజొచ్చిరి. అధికారిణి ''కపాలకుండలను గూర్చి యేమిచెప్పితివి?'' అని యాతని నడిగెను.

కాపాలికుఁడు చాల కష్టముమీఁదఉన్న—ది—తల్లి—కపాల—లో—'' అని యూరకుండెను.

ఆతని నోటనుండి తిరిగి మాట రాలేదు. ''కపాలకుండల''యని యర్ధోక్తిగఁ జెప్పిన పేరే యాతని యవసానకాలమునకుఁ దుదిమాట

యయ్యెను. ఆపాపాత్ముఁడు చాలకష్టమువిూఁద పశ్చాత్తప్తుఁడై నరకక్లేశభీతుఁడై తనప్రాణములను విడిచిపెట్టెను. అతని ముందుగతి యేమో యాతఁడు మొదటనే తెలుసుకొనియుండెను.

సుఖసంతోషముల కాలయమైన స్వర్గమునందు దేవతలమధ్యనైరావతసమారూఢుఁడై పారిజాతపుష్పశోభితుఁడై, శచీసమేతుఁడైయొప్పు శచీనాథుని చెంతకైనను, కైలాసనివాసియును పార్వతీ సమేతుండగు నగు పరమేశ్వరునియొద్దకైనను, వైకుంఠమందిరుండును లక్ష్మీయుతుండు నగు శ్రీమన్నారాయణునిసమక్షమునకైనను, ఈలోకమున సంచరించు మనుష్యుఁడెవ్వడైన సశరీరిడై పోయి నిలిచెనని గాని, ప్రాతస్సూర్యుఁడు పశ్చిమగగనమున నుదయించెననిగాని, స్వభావమునకు వ్యతిరేకముగ మరియేదైన జరిగినదని గాని విని నప్పుడెట్టు లాశ్చర్యము కలుగునో, యట్లే కాపాలికుని నోటనుండి వెడలినకపాలకుండల సంబంధమైన మాటలను విని, అధికారిణియు నవకుమారుఁడును ఆశ్చర్యమును బొందిరి. కాపాలికుని మాటలన్నియు నాలికతుదనుండి వెడలిన యస్పష్టవాక్యమునైనను "కపాలకుండలయున్నది." యని చెప్పినమాట విస్పష్టముగఁ జెప్పినదానివలె నుండెను. ఇద్దరును దీనిని గూర్చి చాల నాలోచించిరి. ఈమాటనమ్ముటకుగాని దీనిమర్మమును దెలిసికొనుటకుఁ గాని వారసమర్థులై పరస్పరము నొకరిమొగము నొకరు జూచికొనుచుఁ జిత్రప్రతిమవలె నిలిచియుండిరి. కొంతసేపైనపిమ్మటనవకుమారుడు " కేవలమసందర్భమైనమాట. దీనిని నమ్ముట యెట్లు? కాపాలకుని మరణకాలమందు ప్రలాపించిన సంధిమాటయని తోచుచున్నది." అనియెను.

అధికారిణియు విషన్నహృదయయై అట్లుగాక మఱేమున్నది? అనియెను.

వారిద్దరును నీయాలోచనమున నట్లు సిద్ధాంతము చేసికొనిరి. కాని, వారి మనసుమాత్రము వేఱురీతిగా బోధించుచుండెను. వారి

మనసునందు కాపాలికుడు చెప్పినమాట నిజమై యుండునని తెలిసికొనిరి. వారిమనసును నోరును ఒకమతమం దుండియుండలేదు.

అధికారిణి—కాపాలికుడు మానవత్వమును విడిచిపోయెను.. వాని చరిత్ర మెంతచెడ్డదైనను. ఆతఁడు బ్రాహ్మణుఁడుగా నుండెను ఆకారణమున నాతనికి యథారీతిగ సంస్కారమును చేయుట యుచితము.

ఇందున కందఱు నంగీకరించిరి. తోడనే కాపాలికుని మృతకళేబరమును గంగానదీతీరమునకుఁ దెచ్చి యథావిధిగా నగ్నిసంస్కారముఁ గావించిరి. ఘోరతాంత్రికుఁడైన కాపాలికుని దేహము భస్మమై పోయెను. పృథ్వినుండి యాతని పేరిగుఱుతుకూడ విలుప్తమై పోయెను.

మఱునాడు నవకుమారుఁడు సప్తగ్రామమునకును అధికారిణి తనజన్మభూమియైనపలాశీప్రాంతమునకు బయలుదేరిపోయిరి. కాపాలికుని మరణకాలమునఁ జెప్పినమాటను ఇద్దఱును మఱవలేదు. అది వారిరువురిహృదయమునందును మిగుల దృఢముగా నాటుకొని యుండెను.

---

## ఇరువది తొమ్మిదవ ప్రకరణము

### ప్రియాసమత్కుము.

"Oh woman; lovely woman; nature made thee
To temper man; we had been brutes without you;
Angels are painted fair, to look like you;
There's in you all that we believe of heav' n
Amazing brightness, purity and truth,
Eternal joy, and everlasting love',

Ottway.

పాఠకమహాశయులారా! చాలదినములకు పిమ్మట నవకుమారుఁడు తిరిగి పద్మావతి సమక్షమునఁ గూర్చుండియుండుట చూచితిరి. ఇఁక ముందు పద్మావతిని ఉత్ఫవున్నీసాయని పిలువవలసిన పనిలేదు. ఆమె కాపేరు వదలిపోయినది.

పద్మావతి తనగృహమునందుఁ గూర్చుండి యేమియో చదువుకొనుచుండెను. రెండుజాము లైనది—ఇంటితలుపు లన్నియును వేసి యుండెను. విశాలమైన గృహము—అకారణమునఁ జీఁకటిగా నుండలేదు. పద్మావతి మంచముపై గూర్చుండి దిండునానుకొని విశ్రమించియుండెను. ఆమెచేతిలో నొకపుస్తక ముండెను. మఱియొక చేతిలో తాటియాకు విసనకఱ్ఱ యుండెను. పద్మావతి యేకాగ్రచిత్తముతోఁ బుస్తకమును జదువుచుండెను. మధ్యమధ్య నొక్కొక్కమారు విసనకఱ్ఱచే విసరికొనుచు సేసటను దీర్చికొనుచుండెను. దగ్గర నున్న పళ్ళెరమునందు తాంబూలద్రవ్య ముండెను. ఇష్టమువచ్చినప్పుడొక్కొక్క లేఁతతములపాకును నోట వేసికొనుచుండెను.

ఆసమయమున గదితలుపు తెఱవఁబడియెను. ఆద్వారమునుండి నవకుమారుఁడు లోపలికి వచ్చెను. అకస్మాత్తుగ నవకుమారుఁడు వచ్చుటచేఁ బద్మావతియొడలు పులకించెను. ఆమె యట్టె మెఱుపువలెలేచి ప్రేమతో నవకుమారు నాలింగనము జేసికొనియెను. కౌఁగిలి విడువకయే యాతని దన మంచముమీఁదికిఁ దీసికొనివచ్చి కూర్చుండఁబెట్టెను. లోకమును సమస్తమును మఱచి యట్లే యాలింగనమందుఁ బరవశయై యుండెను.

కొంతసేపైన పిమ్మట నవకుమారుఁడు కుశలప్రశ్నమును జేసెను. పద్మావతి నవకుమారుని వక్షస్థ్సలమునందే యుండి తలయెత్తి యాతఁడడిగిన ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరమిచ్చెను. పద్మావతి కన్నులనుండి జారుచున్న బాష్పములచే తనవక్షస్థ్సలమంతయుఁ దడిసిపోవుటను నవకుమారుఁడు చూచెను.

ఇద్దఱును చాలసేపు మాటలాడికొనుచు నొండొరుల సమా చారములఁ దెలిసికొనిరి. పిమ్మట పద్మావతి శ్యామసుందరి సమా చారమేమని యడిగెను.

నవ—నేను చూచినంతవఱకు శ్యామసుందరి తనప్రకృతిస్థి తిచే సంతుష్టురాలై యున్నదని తెలిసికొంటిని.

పద్మా—శ్యామసుందరి నవద్వీపమునం దింక నెన్నిదినములుం డును?

నవ—నే నింక కొలది దినములు అక్కడనుండిన యెడల నామెను నాతోడనే తీసికొనివచ్చి యుందును. కాని. నిన్ను చూచు టకై మనసుబడి వెంటనే వచ్చితిని. స్వల్పదినములలోనే తిరిగి య క్కడకుఁ బోయి యామెను దీసికొని వచ్చెదను.

పద్మా—ఇంక నెన్నిదినములకుఁ బోవలసియుండును? ఈసారి మీతో నేనుగూడ వచ్చెదను. అక్కడకుఁ బోయి మునుపటివలె నొకటి రెండు నెల లుండుటకుమాత్రము వలనుపడదు.

నవ—నవద్వీపమందు ఇంకఁ జాలకాలముండవలసిన పని లేదు. వెళ్ళినవెంటనే శ్యామసుందరిని తీసికొనివచ్చెదను.

పద్మావతి కొంచెము నవ్వి, యామాటకు ప్రత్యుత్తరముగ నేమిచెప్పవలయు నని మనస్సున తోఁచనో దానిని చెప్పక నే, "శ్యామసుందరి యక్కడ బాగుగ నున్నయెడల నింత వేగముగ నా మె నెందులకు దీసికొనిరావలయును?" అనియెను.

నవ—ఇప్పుడక్లే బాగుగ నుండినను, చాలకాలము అట్లు టకు వలనుపడదు. సవతితో నెన్నిదినము లట్లుండఁగలదు? అదిగాక యిక్కడ నింటియొద్ద నెవ్వరును లేరు. ఆమె యిక్కడ నుండనియె డల నింటియం దెంతచిక్కుగానుండును? నీవు యాలోచించి చెప్పుము.

నవకుమారుని మాటలను విని పద్మావతి యించుక యన్యమనస్కయై యుండెను. ఆమె యేమో యోచించుచుండెను. ఆమెముఖము గంభీరముగఁ గనఁబడుచుండెను. ఆమె "నవకుమారా! ఈదాసురాలి మాటను వినవలయును. ఈదాసిపై నీ వగపఱచిన యనుగ్రహము కేవల . ఆశాతీతమై యున్నది. స్త్రీల యాశకు మేర లేదు—అయినను నా దింకొక ప్రార్థన మున్నది.

నవ—ఏమిప్రార్థనము? నిస్సంశయముగఁ జెప్పుము.

పద్మా—నామాటను విని యట్లే జరపవలయును.

నవ—నీ వేమిచెప్పెదవో యట్లే చేయుదును. చెప్పుము.

పద్మా—మీరు మరల వివాహము చేసికొనవలయును. నా యీప్రార్థనము నెఱవేర్పవలయును. మీరు మఱియొక వివాహమును జేసికొన్నయెడల నాసుఖమునకు మేర లేకుండును. నాయిష్టసిద్ధి యగును. దీనిని మీరంగీకరించినయెడల నేను చరితార్థనగుదును. మీరిందుల కొప్పుకొనవలయును. అట్లంగీకరింపనియెడలనాకుఁ జాల విచారముగ నుండును.

నవకుమారుఁ డిందుల కేమిచెప్పవలయునో తోఁచక చాలసే పూరకుండెను. పిమ్మట నాశ్చర్యముతో "పద్మావతీ! అకస్మాత్తుగానీకీ యాలోచన మెందులకుఁ గలిగెను?" అని యడిగెను.

పద్మా—ఈయాలోచనము నా కకస్మాత్తుగఁ బుట్టలేదు. ఇది కారణము లేనిదే పుట్టినది కాదు. నేను మీ పవిత్రచరణకమలముల సన్నిధి నొక భిక్షను వేడుకొనుచుంటిని. వేఁడుటకైన నంత గొప్పది కాదు. నాయదృష్ట మిట్టు లుండునని నేనుస్వప్నమందైన ననుకొనలేదు. మీదుఃఖమును నివారించుట యే సామనఃపూర్వకమైన కార్యమైయున్నది. మీరు పొందుచున్న దుఃఖమును నేనునాకనులారఁగాంచుచు నెట్లూరకుండఁగలను? మీ రింకొకవివాహమును జేసికొన్నయె

డల మీసంసారసంబంధమైన కష్టములన్నియును తీరిపోఁగలవు. ఇది నేను చెప్పునది. మీ యాస్థితిలో నీమాటను మీకెట్లు చెప్పకుండఁ గలను?

నవకుమారుఁడు పద్మావతిమాటలను విని యాశ్చర్యమును పొందెను. ఏపద్మావతి స్వల్పదినములకు ముందుభర్తృప్రేమను ఒక్కతెయే యనుభవించుట కేమేమిచేసినదో అట్టియామె నోటినుండి యిప్పుడీమాటను విని యెవ్వ రాశ్చర్యపడకుందురు? నవకుమారుఁడు చాలసేపైనపిమ్మట, "పద్మావతీ! నేనింక తిరిగి వివాహము చేసికొనను. ఇంకను ప్రయోజనమేమి?" అనియెను.

పద్మా—నాథా! మీరు తిరిగి వివాహము చేసికొన్నయెడల నే నసంతుష్టురాల నగుదునని సంశయించుచున్నారా? నే నసంతుష్టురాలనుగాను. అందువలన నాసుఖము మఱింత వృద్ధిపొందును.మీరు నాకొఱకు మీసుఖమున కాటంకము కలిగించుకొన్నయెడల నాసుఖము పోయి దుఃఖమే హెచ్చగును. మీరు నిస్సంసారులై నిత్యమును కష్టపడుటను నేను నాకన్నులారఁ జూడఁగలనా? ఇట్టినేను అన్యథా యోచింతునా? దేనివలన నేను సుఖనగుదునో దేనివలన మీకు శుభముకలుగునో ఆకార్యమును జేయుటకై యాక్షేపణ యెందులకు?

నవకుమారుఁ డాశ్చర్యముచే ముగ్ధుఁడై తుదకు మనస్సునందు "ఏమి యాశ్చర్యము! ఇప్పుడీమె యాపద్మావతియేనా? భగవంతుఁ డేమి చేసినఁ జేయఁగలఁడు." అని కాలక్రమమున జరిగినదంతయు యోచించుకొని, "పద్మావతీ! నీవు నారీకులమున కలంకారమవు. నీవు నిజముగా నాహితవును కోరుచున్నదానవు—నీమాట లమృతమయము లైయున్నవి. నీమాటలను వినిన నాకేమియును తోఁచుట లేదు. దీనిని గూర్చి యిప్పు డాలోచించుటకు సమయము కాదు. తరువాత యోచింపవచ్చును" అని చెప్పెను.

పద్మా—మంచిది. అది యేమైనఁ గానిండు. నాథా! మీరు కపాలకుండల—

"కపాలకుండల" యను శబ్దము నుచ్చరించినంతమాత్రము ననే నవకుమారుఁడు కంపితుఁడయ్యెను. పద్మావతి యది చూచెను. అప్పుడామె "నాథా! మీరు కపాలకుండలనుగూర్చి యెవ్వరిచేనైన నేమైన వింటిరా?" అని యడిగెను.

నవకుమారుఁడు నిట్టూర్పువిడిచెను. పిమ్మట "కపాలకుండల నుగూర్చి యెవ్వరేమి చెప్పఁగలరు? ఆమె యకాలమృత్యువు వాతఁ బడియెను. ఆమె పేరీలోకమునుండి విలుప్తమై పోయినది. అట్టి దానిని గూర్చి యెవ్వరేమిచెప్పఁగలరు?" అనియెను.

పద్మా—అందునుగూర్చి మీకెప్పుడును నేవిధమైనసందేహ మును గలుగలేదా?

నవ—ఇది చాల నాశ్చర్యమైన మాట. పద్మావతీ! నాకెట్లు సందేహము కలుగును. నేను చెప్పెడిదానియందు నీకు నమ్మక మున్న యెడలఁ జెప్పెదను వినుము. కపాలకుండల నాకన్నులయెదుట నాతో నొక్కతెయె నదీతీరమున నొకమంటిపెల్లతోడనే అగాధజలము నందుఁ బడిపోయెను. నేను నీటియందు దుమికి మునిఁగి, వెదకి, యెంతప్రయత్నముచేసియు, ఆమెను రక్షింపఁలేకపోయితిని. కపాలకుండల ప్రవాహవేగమున నెక్కడకో కొట్టికొనిపోయెను. నాకు దొరకలేదు తుదకు నాకును స్మారకము తప్పినది.

ఈమాటను జెప్పుచుండగాఁ నవకుమారుని హృదయమునందు పూర్వస్మృతులన్నియును నుదయించెను. తరువాఁతదుఃఖముగూడవచ్చెను. అతఁడు చాలగష్టముమీఁద కన్నీటి నాపుకొని "ఎందులకు? పద్మావతీ! ఈమాటలన్నియుఁ జెప్పుటయెందులకు?" అని యునియెను.

పద్మా:—ఈమాటలు తలంచుకొన్నయెడల నామనసునకును దుఃఖము కలుగుచున్నది. కాని దీనిని గూర్చి మిమ్మడుగకుండ నుండ లేకున్న దానను. ఎందుల కడుగుచుంటినో చెప్పెదను వినుఁడు—

ఈవిధముగాఁ జెప్పి పద్మావతి యాసంబంధమైన యుంగరపు వృత్తాంతమును సవిస్తరముగ జరిగినదంతయు వివరించి చెప్పెను. అదివినుచుండగనే నవకుమారుని కనుదమ్ముల యందు నీరుగ్రమ్మెను. పద్మావతి యావృత్తాంతమంతయుఁ జెప్పి "నాథా! దీనినిబట్టి మీ కేమితోఁచుచున్నది?" అని యడిగెను.

నవ—తోఁచునదేమి? ఇది నాబుద్ధి కతీతమైయున్నది. కపాలకుండల లేదు. ఉండుట కేవల మసంభవము. ఈసంగతి నేను బాగుగ నెఱుఁగుదును. అట్లులేకపోయినను నాదుఃఖమును మఱింత వృద్ధిచేయుటకై అప్పుడప్పుడు కలుగు కపాలకుండల యస్తిత్వసంబంధమైన నీడవలెనే నిదర్శనములును గోచరించుచున్నవని తోఁచుచున్నది. అది యంతయు నసత్య [illegible] యంతరమును వ్యాకులతకును దుఃఖమునకును యాతనకు [illegible] వేఱేమియునుగాదు

పద్మా:— మీరెంతచెప్పినను కపాలకుండల యున్న [illegible] నాబుద్ధికిఁ దోఁచుచున్నది' ఆమె యెట్లో నీటినుండి బయటికి వచ్చి జీవించియే యున్నదని తోఁచుచున్నది.

నవ:—(నిట్టూర్పువిడిచి) పద్మావతీ! ఈ లేనిపోనికల్పనములను జేసికొని చింతించుట యెందులకు? నేను దురదృష్టవంతుఁడను. నాకష్టమునకంతములేదు. ఇతరుల [illegible] యెడల నెట్లు [illegible] నను దూలింపవచ్చును. నాయదృష్ట మెప్పటికి నట్టిదికాదు. దురాశచే మనసును గట్టివేయుట యెందులకు? స్వప్నమందు భోగములనుభవించిన నేమగును?

పద్మా—ఏమైనఁగానిండు. పరిశీలించి బాగుగ వెదకి చూడవలయును.

నవ:—(నిస్పృహతో) ఎక్కడ వెదకిచూడను?

నవకుమారుఁడు "ఎక్కడ వెదకిచూడను?" అని చెప్పినను అప్పటియాతని మనస్థితిమాత్రము కపాలకుండలను తిరిగిచూచుటకొఱకెట్టికష్టకార్యమునైనను చేయుటకు వెనుకంజవేయుటలేదు. అతఁడు, ప్రపంచమంతయును కపాలకుండలామయమునై యున్నట్లుగఁ జూచుచుండెను. మఱి యితరప్రపంచ మేమియు నాతని కగపడుటలేదు. కపాలకుండల యాతనిహృదయమును స్వాధీనముచేసికొనియెను. నవకుమారుఁడు తన మనస్సున వెదకి చూడఁగా నక్కడ నొక్కటియె మూర్తి—మనోహరమైన యొక రమణీమూర్తి—యధిష్ఠించి యుండెను. కపాలకుండలమాత్రము చాలదినములకు ముందే పరలోకమునకుఁ బోయియున్నది. అట్లయిన నామె యాకారము నవకుమారుని హృదయమందింత స్ఫుటముగాఁ జిత్రింపఁబడి యుండుటెందులకు? నవకుమారుఁడు చేసికొనిన ప్రతిజ్ఞ యేమనఁగా—తన్ను తాను మఱచినను ప్రపంచమంతయును మఱచినను కపాలకుండలనుమాత్ర మెప్పుడును మఱవఁజాలనని ప్రతిజ్ఞ చేసికొనియెను. అతఁ డాప్రతిజ్ఞను మఱచిపోలేదు. మఱచిపోవను లేఁడు. ఏమనుష్యుఁడు కృతఘ్నుఁడైన సహయాత్రికుల కుపకారము చేయుటకై స్వార్థత్యాగియై కట్టెలమోపును తలమీఁదఁబెట్టుకొని వచ్చెనో, అట్టిమనుష్యుఁడు తనకుఁ బ్రాణదానము చేసి మేలుచేసిన సుందరీమూర్తిని ఎల్లప్పుడును సంతోషపూర్వకముగ హృదయమందు ధరించుకొనియుండుట యేచిత్రము? నవకుమారుని హృదయమందు కపాలకుండలామనోహరమూర్తి ప్రతిష్ఠింపఁబడి యుండెను. కాలముయొక్క వక్రప్రభావముచే నామూర్తి అక్కడక్కడ వికృతమైయుండెను. కాని యిప్పుడు స్మృతియనువర్ణ (రంగు) సంయోగమువలన వికృతమైయున్న భాగము లన్నియుఁ దిరుగ సంస్కరింపఁబడి విరాజిల్లుచుండెను. తిరిగినవకుమారుని హృదయమందు

ఆమనోహరమూర్తియైన కపాలకుండల శోభాయుతమై ప్రకాశింపఁ దొడఁగెను.

ఇంతకుముందు కాపాలికుఁడు కపాలకుండల యున్నదని చెప్పినమాటకు నవకుమారుని హృదయమందు కొంతవఱ కనుమానముండెడిది. నేఁడు పద్మావతివలన నీమాటలను వినుటచే కపాలకుండల యుండిన నుండవచ్చునను సందేహ మించుక దృఢముగ నాటుకొనియెను. అతఁడాశాప్రభావముచే నున్మత్తచిత్తుఁడయ్యెను. ఎవ్వరైనను వచ్చి కపాలకుండల బ్రదికియున్నదనియును, ఆమెయిట్టిచోట నున్నదనియును, చెప్పినయెడల వారికి తన సర్వస్వమును నిచ్చుటకాతఁడు సిద్ధముగా నుండెను. ప్రాణమునిచ్చినచో కపాలకుండల నొక్కసారి చూడవచ్చునని యెవ్వరైనఁ జెప్పినయెడల నాతఁడిందులకు సిద్ధముగ నుండెను.

మనుష్యుఁడు మనుష్యుని హృదయమును చూచును. ఏమనుష్యుఁడు చూచుట కెఱుక గలిగియుండునో యాతఁడే చూడఁగలఁడు. ఇతరులు చూడలేరు. అందఱికినికన్నులున్నవి. కన్నులుదర్శనయంత్రములు. అందఱు నందఱిహృదయములను జూడలేకపోవుట యెందులకు? ఎందుచేతననగా:—అందునకు కౌశలమును, అభిజ్ఞతయును గావలయును. ఆకౌశలమునుఅభిజ్ఞతయును నుపదేశమువలన వచ్చునవిగావు.—కాలమును స్వభావమును వానికిఁ దోడ్పడవలయును. కన్ను స్వచ్ఛములైన పదార్థములనుదప్ప మఱి యితరవస్తువులను విభజించి చూడజాలదు. అట్లయినయెడల మనుష్యుని హృదయమును జూచువిధమెట్లు? ఎదుటనున్న పదార్థచ్ఛాయ అద్దమునం దెట్లగపడునో యట్లే యొకప్రకాశమానస్థానమునందు హృదయచ్ఛాయయునగపడుచుండును. ఆస్థానము వదనము— నీవు కోపించినను ద్వేషించినను, సంతోషించినను సంతాపించినను,—చూచుటకు శక్తిగల

వారగుదురు—నీముఖమును జూచిన తోడనే దానిని తెలుసుకొనగలరు. పద్మావతీ! ఏమిచూచెదవు? నీహృదయము నెవ్వరు చూచుచున్నారో తెలిసి కొనగలవా?—నవకుమారుఁడేకాగ్రచిత్తముతో తదేకదృష్టితో పద్మావతిముఖమును జూచుచుండెను. ఆనాఁడు "పద్మావతి చెప్పినమాటలన్నియును హృదయపూర్వకముగానే చెప్పినదా? లేక, ఉపచారముకొఱకుఁ జెప్పినదా" అను విషయమునుగూర్చి తెలుసుకొనుటకై చూచుచుండెనా యనునట్లుగ నుండెను. ఆతని ముఖము వికసించెను. పద్మావతి చూపునందు, సరళతయును బవిత్రతయు గనబడుచుండెను. కపటచిత్తులగువారి చూడ్కులు అట్లుండుట యసంభవము. పద్మావతి యెప్పుడేమి చెప్పినను దాని నామె హృదయపూర్వకముగనే చెప్పుచుండును. నవకుమారుఁడు పద్మావతి రమణీరత్నమని యామె సహస్రాపరాధములు చేసినను ఆమె సుఖమునకై యేవికావలయునో వానినెల్లఁ జేయుదునని యాతఁడు భావించుకొనియుండెను. ఆకారణమున మేము చెప్పున దేమన— పద్మావతీ! నీవు సందేహము లేకుండ నుండుము. నీకుభయము లేదు. నీసుఖము నవకుమారుని యోచనకు ముఖ్యాంశమని మేము చెప్పుచున్నాము.

చాలసేపైనపిమ్మట నవకుమారుఁడు "ప్రాణేశ్వరీ! ఉమాపతినిజూచి చాలాదినములైనది. ఆతనిజూచి తిరిగి వచ్చెదను." అని చెప్పి వెడలిపోయెను.

---

## ముప్పదవప్రకరణము

### అశనిపాతము,

"సంతావేంతా అవనేసుంమహుత్సవేసుందు ఆవేంతా
హా అచ్ఛి యా విలవిహావావిరహీమిత్తానం దమ్మనాలంతే"
ముద్రారాక్షసము,

ఏవిపత్తునఁబడి యుమాపతికనఁబడకుండఁబోయెనో దానిని పాఠకమహాశయు లెఱుఁగుదురు. ఉమాపతి మేనమామ మొదలగు వారీసంగతి నెఱుఁగరు. వారు ఉమాపతికై యనేకస్థలముల వెదకిరిగాని యాతని జాడ యేమియును గానఁబడలేదు. ఎవ్వరుగాని యాతని జాడ యించుకయును జెప్పలేదు. అప్పుడు హరిహరుఁడుఉమాపతి సప్తగ్రామమునకుఁబోయి యుండవలయునని భావించుకొనియెను. మఱునాఁటియుదయముననే లేచి యాతఁడు స్వయముగ సప్తగ్రామమునకుఁబోయెను. అక్కడికుమాపతి వచ్చియుండలేదు. ఉమాపతితల్లికి నియంతయు దెలియవచ్చెను. హరిహరుఁడచ్చటఁ దడయక యుమాపతిని వెదకుటకై బయలుదేరిపోయెను. మఱునాఁటి సాయంకాలమందు నవకుమారుఁ డుమాపతిని జూడవలెనని వాని యింటి కేగెను. కాని యుమాపతికనఁబడలేదు. అతని తల్లిని జూచెను. ఆమె సమస్తమును దెలియఁజేసెను. అతని తలపైఁ బిడుగుపడినట్లయ్యెను. అతఁడుచాల కష్టముమీఁద కన్నీటి నాపుకొనెను గాని యావృద్ధాంగన విచారించుచుండుటను జూచి యాతని హృదయము కరఁగి నీరై పోయెను. అతనికి ఉమాపతికిని ఒక్కటియే హృదయము. ఆయుమాపతికి దలవనితలంపుగఁ దటస్థించిన విపత్తును విని నవకుమారుఁడు మిక్కిలి విషాదమునుబొందెను. విశేషించి ఉమాపతినిగూర్చి తల్లి పొందుచున్న యారాటమును జూచి యాతఁడు మిగుల తత్తరపడఁజొచ్చెను. ఆతఁ డామెను గూర్చి, తల్లీ! నీవు విచారింపకుము:—అంతభయమేమిఁవచ్చినది? ఉమాపతి దైవవిపాకమువలన నెక్కడో చిక్కుకొనియుండెననితోఁచుచున్నది. అతనికేమియును చెరుపుకలుగదు. నా మనస్సు గూడ నట్లే చెప్పుచున్నది. ఏమైనఁ గానిమ్ము. నేనుదయముననే లేచి బయలుదేరి పోయి దేశమంతయు వెదకెను. నాజీవమంత

యు భారవోసెదను. ఏమిచేసియైన నుమాపతినిదీసికొనివచ్చి నీకొప్పగిం చెదను. నీవువిచారింపవలదుఎంతమాత్రమునుభయములేదు' అనియెను

వృద్ధా:—(కన్నీరువిడుచుచు బిడ్డా! నవకుమారా? నీవుచిరం జీవి వగుదువుగాక! మనహరిహరుఁడు వెదకుటయందేమియును లోప ముచేయుటలేదు. ఆహా! ఆతని కెంతయో భయము. ఎంతయో యో చనము. ఉన్నయొక్కబిడ్డడును జాడలేకుండ నేమైపోయెనో యని యెంత వెదకినను కనఁబడకుండుటచే నాతని విచారమునకు పారములే దు. ఇదియంతయును నాదురదృష్టము—నవకుమారా! నీవు మత్తె క్కడికిఁ బోయెదవు? నీ వొకటియును ఉమాపతి యొకటియునా? నీ కేమైన కష్టము కలిగినయెడల నేను భరింపఁగలనా? బిడ్డా! నీవు పోవలదు.

ఆమె యిట్లు చెప్పుచుండఁగనే నవకుమారుఁడు:—తల్లీ! నీవ న్యాయముగా మాటాడుచున్న దానవు. నే నెట్లు నిశ్చింతుఁడనై యుండఁగలను?—నీవు నాకు అడ్డము చెప్పవలదు.'' అనియెను.

ఇట్లు చెప్పి నవకుమారుఁ డామె ప్రత్యుత్తరమును వినకుండఁ గనే యామె యొద్ద సెలవు దీసికొనిపోయెను.

నవకుమారుఁ డక్కడినుండి పద్మావతియింటికి వచ్చెను. పద్మా వతి, నవకుమారుఁడు తిరిగి వచ్చుటను చూచి పులకితయయ్యెను.

నవ:—పద్మావతీ! ఉమాపతి సమాచారమును వింటివా?

పద్మా:—లేదు. నేనేమియును వినలేదు.

నవకుమారుఁడాసమాచారమును దెలియఁజేసి, "పద్మావతీ! రేపటి యుదయమున నుమాపతిని వెదకుటకై పోయెదను. ఎన్నిదిన ములకుఁ దిరిగి వచ్చెదనో నిశ్చయముగఁ జెప్పుట కవకాశములేదు,'' అనియెను.

ఈవలకు నిలుచుండియున్న పద్మావతి యీమాటలను వినిన తోడనే మెల్లమెల్లగఁ గూర్చుండెను. ఆమె తలమీఁదవజ్రాఘాతము తగిలిన ట్లయ్యెను. తన యదృష్టమునుగూర్చి అనేకవిధములనిందించు కొనుచు "నవకుమారా! మీకు ఉమాపతి మీప్రాణాధిక స్నేహితుఁడని యెఱుఁగుదును. ఆతని కష్టము మీకష్టమని కూడ నెఱుఁగుదును. ఆత నియిట్టి సమాచారమును విని మీరు నిశ్చింతులై యుండుట మంచిది కాదు. కాని మీరెక్కడకిఁబోయెదరు? ఆతఁడిట్టి స్థలమునందున్నాఁడని మీరు తెలిసికొన్నయెడలను, నాతని విపత్తునుండి విడిపింపవచ్చునను ధైర్యమున్నయెడలను, మీరీక్షణమే బయలుదేరి పోవచ్చును. కాని అట్టిదేమియును దెలిసియుండలేదు. తెలియకుండఁగనే మీరు పోయి చేయునదేమి? మీకుఁ గర్తవ్యమైన కార్యమునుమీరుచేయవలదా? కాని మీరు దీని పర్యవసానమునుగూర్చియోచింప వలయునని మాత్రము చెప్పుచున్నదానను." అనియెను.

నవ:—నీవుచెప్పునదినిజము. కాని, నేనునెట్లూరకుండఁగలను? వృద్ధురాలైన యుమాపతితల్లి విచారమును జూచినయెడల నీవును నావలెనే ముందుజరుగఁబోవు దానిని యోచింపకయె యేపనినైనఁ జేయుటకుఁ బ్రయత్నింతువు. ఏమిచేయుటకును ఉపాయము లేదు. రేపటియుదయమున గోపాలపురమునకుఁ బోయి ఉమాపతి మేనమామనుజూచెదను. అక్కడికిఁ బోయి యేమిచేయవలయునో యాలోచించి చేయవలసినదానిని చేయుదును. అట్లు కానియెడలఁదిరిగివచ్చెదను. ఇదితప్ప మఱియేదైన నుపాయ మున్నయెడలఁ జెప్పుము.

పద్మావతి చాలసేపు యోచించి పిమ్మట "మీమాటల కడ్డు చెప్పుదానను కాను. మీరేగవచ్చును. దేవర, తమ యిష్టముచొప్పునఁ జేయుఁడు. ఈసందర్భమునఁ బ్రయత్నము చేయకుండ నూరకుండుట మిత్రధర్మము కాదు. సోదరునికంటెను అధికుఁడైనమిత్రు

నికొఱకు ఏమిచేసినను చేయవచ్చును. వెళ్లుఁడు. కాని యొకమాట చెప్పవలసియున్నది. పదింబదిగ సమాచారమును బంపుచుండుఁడు.

నవకుమారుఁడు, పద్మావతి రమణీరత్నమని యీవఱకే సిద్ధాంతము చేసికొని యుండెను. ఇప్పు డాసిద్ధాంతము భ్రాంతిమూలకమైనదికాదని స్థిరపడియెను. ఆతఁడు చాలసేపు పద్మావతీముఖకమలమును చూచుచుండెను. చూచుచుండఁగా నాతని దృష్టియును నామె హృదయమునఁ బ్రవేశించెను. అక్కడ సరళతయు, పవిత్రతయు, గ్రీడించుచుండెను. పద్మావతి కళంకినియని యెవ్వరుచెప్పగలరు? నవకుమారుఁడు ఆమెతోఁ గూడఁ జేరియుండుటకు నిశ్చయించుకొనియెను ఆతఁడామె హృదయమందు లేశమాత్రమును కళంకమును చూడలేదు. ఇది ప్రణయధర్మము—క్రొత్తకాదు.

గ్రీసుదేశమునందలి జనులు ప్రణయదేవతయైన క్యూపిడ్డు (Cupid)ను గ్రుడ్డిదని చెప్పుకొందురు. మఱియొకజాతివారు ప్రణయదృష్టి, దుర్భిణియంత్రదృష్టి కంటెను తీక్ష్ణమైనదని చెప్పుదురు. ఈరెండుమతములును కేవలమును వేఱువేఱు జాతివారి మతములై యున్నవి. ఇవి రెండును సత్యములే. ఇవిరెండును శ్లాఘాపాత్రములే. ప్రణయ మొక పక్షమందు గ్రుడ్డిదై యుండును. మఱియొక పక్షమందు దివ్యదృష్టిగలదై యుండును. ప్రణయముగలవాఁడు, తన్నుఁ బ్రేమించునామెయందున్న పర్వతప్రమాణములైన దోషములనుసైతము చూడఁజాలఁడు. కాని, అణుమాత్రమైన గుణమున్నను, దానిని పర్వతాకారమైనదానిగాఁ దెలిసికొనుచుండును.

నవకుమారుఁడు పద్మావతితో నిట్లు మాటాడుచుండఁగా దాసివచ్చి రాజసేవకుఁడొకఁడు తమకొకయుత్తరమును దీసికొని వచ్చియున్నాఁడని చెప్పెను. నవకుమారుఁ డాత్రముతో, నాయుత్తరమును గొని రమ్మనియెను.

---

## ముప్పది యొకటవ ప్రకరణము

### నిశావసానము.

"రాజమార్గోహి శూన్యోయం రక్షిణ స్సంచరంతి చ
........................బహుదోషాయ శర్వరీ"

మృచ్ఛకటిక నాటకము

రాత్రి చాలప్రొద్దుపోయెను. రెండుజాములరాత్రికిఁదక్కువకా లేదు. ఊరంతయు నిశ్శబ్దముగా నుండెను కేవలమును మధ్యమధ్య నొకటిరెండు కుక్కలు దూరమునందున్న చెట్లకొమ్మలు కదులుటనో మఱి యేమైన మెదలుటనో చూచి మొఱగుచు దిఙ్మండలమంతయు బ్రద్దలగునట్లుచేయుచుండెను. ఒక్కొక్కసారి, యొకటిరెండు పక్షులు గూండ్లను వదిలి వచ్చి, ప్రకృతిశాంతికి భంగకరముగఁ గూయుచు నెగురుచు, తిరిగి గూండ్లకుఁ బోయి చేరుకొనుచుండెను. నిమిష నిమిషమునకును, గుడ్లగూబ మొదలగురాత్రించరపక్షులు భయంకరముగ ధ్వనిసేయుచు తల్లులప్రక్కలలోఁ బరుండియున్న బిడ్డలకుభీతిని గలుగఁజేయుచుండెను. వానిమధ్య స్థానీయులైన పోలీసుజవానులు బీటుతిరుగుచున్నట్లు జనులకుఁ దెలియుటకై పఱుండియున్న వారికి నిద్రాభంగమగునట్లుగ గట్టిగ నఱచుచు హెచ్చరికనుదెలుపుచుండిరి కీచురాల నిస్వనము భయంకరముగవినవచ్చుచుండెను. కన్నునుగన్నును గనఁబడకుండఁ జీకట్లు దట్టముగా నలమికొనియుండెను. జనులు పగలంతయును గష్టపడి నిద్రయందు విశ్రాంతిని బొందుచుండిరి మఱియును వారు నానావిధములయిన సుఖదుఃఖపూరితములగు స్వప్నములచే మోహితులగుచుండిరి. అన్నవస్త్రములకు గతిలేనివాఁడుస్వప్నదేవతా మోహనమంత్రముచే ముగ్ధుఁడై క్షణకాలము రాజత్వసుఖాను

కిఁబోయి వెదుకుదు ననుచింతచే నాతని మనసు కొట్టుకొనుచుండెను ఆయవస్థయందు నిద్రబట్టునా? నవకుమారుఁడు ఉమాపతిని మనస్సుచేఁ జూడనారంభించెను. భయంకరమైన విపత్తునుండియాతని విడుదలచేయుటకై ప్రయత్నించి తిరిగి యాతనితోఁగలసి యానందమునొందువానివలె భావించుకొనియెను.

ఉదయమున నుమాపతిని వెదకుటకు స్థిరపఱచుకొని పరుండెను. నిద్రరాకపోవుటచేశయ్యమీాదబరుండియుండుట కష్టముగ నుండెను. ఏదోయొక యోచనకలిగి ప్రక్కనుండి లేచెను. దీపపువెలుతురులోనికిఁబోయి రాజసేవకుఁడిచ్చిన యుత్తరమును జదువుటకుఁ బ్రారంభించెను.

ఉత్తరము—

"మాన్యవరులకు—

"సన్మానపూర్వక నివేదనము—

పాదుషహాజహాంగీరుబహద్దరువారి యాజ్ఞానుసారముగఁదమకువిన్నవించున దేమన—పాదుషహాబహద్దరువారికిఁ దమపరిచయములేదు. కాని వారు ఇంతిటినుండి మిమ్మును తమ ముఖ్యస్నేహితులనియెంచుకొనిరి. అందులకుఁ గారణమును క్రమముగ మీారే తెలిసికొనగలరు.

ప్రకృతస్నేహమునకుఁ జిహ్నముగ పాదుషహాబహద్దరువారు మీాకొక సర్వమాన్యపుజాగీరు నిచ్చుటకిష్టముగలవారైరి. ఈజాగీరువలన మీారు వత్సరమున కించుమించుగ పోకలక్షవరహాల సువర్ణాదాయము రాఁగలదు. మీారు మఱియొక లాగున యోచింపక సరళస్వాదయులై యీజాగీరు నంగీకరించినయెడల బహాదరువారు సంతుష్టాంతరంగులగుదురు.

మహాప్రభువులగు జహాంగీరుబహాద్దరువారు సర్వదా మీాక్షేమసమాచారమునువినుచుండుటకిష్టముగలవారై యుండిరి. అందువలన మీారు వారికిఁ దఱచుగ నుత్తరములను వ్రాయుచుండవలయును. భగవదనుగ్రహమువలన పాదుషహాబహాదరువారు సపరివారులై క్షేమముగనున్నవారు. త్వరలో వారేస్వయముగా మీాకు ఉత్తరమును వ్రాయుదురని నివేదించుచున్నాఁడను—

తారీఖు, ౯ మే, రమజాన.

తమయనుగతుఁడు

గయాస్ ఉద్దీన్."

(గయాసుద్దీనుఁడు జహాంగీరుపాదుషాకు ప్రధానమంత్రి. ఈతడు విఖ్యాతయైన నూర్జహానునకు తండ్రి. హిందూదేశచరిత్రము జదివినవారల కీవిషయము తెలియును)

నవకుమారుఁడు మరలమరల నుత్తరమును జదివికొనియెను. ఎంతయెక్కువగఁ జదివిన నంత హెచ్చుగ నాశ్చర్యమును బొందుచుండెను. నవకుమారుఁడు సామాన్యుడు. జహాంగీరు భారతసింహాసనమునందు సమారూఢుఁడై యున్న పాదుషాహా. ఇద్దఱకును బరస్పరము నింతభేదముకలదు. ఈవిధముగ, ధర్మమునందును, జాతియందును, ఆచారమునందును, గౌరవమునందును,సంపదయందును, అధికారమునందును, పరస్పరభేదముచే వేఱువేఱుగ నున్న వీరిద్దఱిమధ్యను మిత్రతయా! నవకుమారుని ధనవంతునిగఁ జేయుటకును, ఆతనితో నైక్యమును పొందుటకును, ఇంతప్రయత్నమెందులకు? నవకుమారుఁడు చాలసేపు యోచించెను. ఆతఁడు పద్మావతీజీవనవృత్తాంతమంతయును దెలిసికొని యుండెను. పాదుషాతోఁగల పద్మావతీ పూర్వసంబంధమే

యిందులకేలకు గారణమని యనుకొనియెను. ఈసిద్ధాంత మాతని మనస్సునకు సుఖమును గలుగఁజేసినదో లేదో చెప్పుటయసాధ్యము. చాలసేపైనపిమ్మట నుత్తరమును పఱుపుక్రిందనుంచి తిరిగి యాతఁడు పరుండెను. శయ్యయే చింతాకామినికి గృహము. ఎప్పుడు జనులు నిద్రనెదురుజూచుచు నర్ధరాత్రియందు పాన్పులపైఁ బరుందురో, ఆవేళకు సరిగా నీరాక్షసి వచ్చి చాలదుర్మార్గమును జేయునని, చింతాకామినిచేతులలోఁ జిక్కుకొనిన ప్రతిమనుష్యుఁడును దెలిసికొనఁగలఁడు. ఇప్పుడు సరియైన సమయమని నిశాచరియు, దుర్భావనియు నగు నామెవచ్చి నవకుమారునియం దావేశించెను. నవకుమారుఁడు కన్నులుమూసికొని, భూమ్యాకాశములను గూర్చి యోచింపఁదొడఁగెను. చింతకును క్రోధమునకును, హింసకును, శోకమునకును, గలస్వభావమేమనఁ:—వీనియందు ఏదైన నొకటి కారణాంతరముచే నుద్దీపించిన యెడల, అప్పుడు క్రమక్రమముగఁ దత్సంబంధమైనవియు, అదివఱకున్నవియు, ఇందు రాఁబోవునవియును, నగునుత్తరసాధక కారణములన్నియును మనస్సునకు వచ్చును. నవకుమారునకు నట్లేయయ్యెను. దుర్భావనాజనకములైన విషయములన్నియును మనస్సునందు మెఱయుచుండెను.

నవకుమారుఁ డీవిధముగా చింతాసాగరమునందు మునిఁగియున్నప్పుడు ఆవల నెవ్వరో ఆతనిని బిలిచినట్లు వినంబడియెను. ఆతఁడు పులకితుఁడయ్యెను. చప్పున శయ్యపై లేచి కూర్చుండెను. తిరిగిపిలిచినశబ్దము వినఁబడియెను. ఆధ్వని యాతనికిఁ దెలిసినదే. పిలిచినవారిని దెలిసికొని యాతఁడు శయ్యనుండిలేచి యాపరిచితవ్యక్తియొద్దకు వేగముగఁ బోయెను.

# ముప్పదిరెండవ ప్రకరణము

## కారాగారము.

"జాతః సూర్యకులే పితాదశరథః క్షోణీభుజామగ్రణీః
సీతా సత్యపరాయణా ప్రణయినీ యస్యానుజో లక్ష్మణః
దోర్దండేనసమో న చాస్తిభువనే ప్రత్యక్షవిష్ణుఃస్వయం
రామో యేన విడంబితోపి విధినా చాన్యేపరేకాకథా."

మహానాటకము

పాఠకమహాశయులారా! ఉమాపతియెక్కడనున్నాఁడు? ఆతఁడేమయ్యెను? ఈవిషయమును దెలిసికొనుటకు మీ కించుకైన నిష్టము లేదా? అట్లున్నయెడల నాతనియొద్దకుఁ బోవుదమురండు.

దుర్మార్గు లుమాపతిని కట్టి యెత్తికొనిపోయిరిగదా! ఏంతసేపాతని నిట్లే యెత్తికొనిపోయిరో, ఎక్కడకుఁ దీసికొనిపోయిరో. యాతనికిఁ దెలియఁలేదు. నిప్పటి యాతని మానసికావస్థ వర్ణనాతీతమైనది. జీవితాశ దురాశయై యాతని ప్రయత్నశూన్యునిగఁ జేసివైచెను. ఆతని మనస్సు పరిపరివిధములఁ బోవుచుండెను. అనేకాలోచనములతో నాతని హృదయము నిండిపోయెను.

అప్పుడప్పు డుమాపతి శరీరమునకు చెట్లకొమ్మలముండ్లు తగిలి బాధపెట్టుచుండెను. అందువలన నాతఁడు తన్ను ఏదో యరణ్యమధ్యమునుండి దీసికొని పోవుచుండిరని తెలిసికొనియెను. ఈవిధముగా నా దురాత్ములు రాత్రియంతయు నాతని నాయడవినుండి యెత్తుకొని పోవుచుండిరి. పిమ్మట, తెల్లవాఱుజామున నొకస్థలమందాఁగి యుమాపతిని తమ బుజములమీఁదినుండి క్రిందికి దింపిరి. అప్పు డాపూర్వపరిచితుఁడైన కఠోరభాషణుఁడు "నేఁడు ఈతనినొక్కనినాయింటియందుంచుఁడు. తెల్లవాఱినపిమ్మట నాతనికిఁ దగినప్రాయశ్చిత్తము చేయువల

యును, చాల ప్రొద్దుపోయినది. మీరందఱును బోయి పరుండుఁడు. ఆతఁడు పాఱిపోవుటకుఁ బ్రయత్నించినయెడలతక్షణమనఱికివేయుఁడు అన్ని చిక్కులును దీరిపోవును'' అని చెప్పెను.

ఉమాపతి యీమాటలను విని, మాటలాడుచున్న యాతడు, ఆమూఁకల కధిపతియై యుండవలయునని యనుకొనియెను. వారు తిరిగి ఉమాపతిని లాగుకొనివచ్చి సమీపమునందున్న యొకయింటితలుపులతాళమునుదీసి అందులోనికిఁ దీసికొనిపోయిరి. అక్కడి నాతని నోటికిఁ గట్టిన కట్టును విప్పిరి. ఈవఱకాతఁ డూపిరాడక చాల బాధపడుచుండెను. నోటికట్టును విప్పినతోడనే పైకూపిరివిడుచుటకుప్రారంభించెను. మాటలాడుటకు మాత్రము శక్తిలేకుండెను. హీనస్వరముతో నుండెను. ఈసమయమున నాతని నెత్తికొనివచ్చినవారు, ఆతని నాయింటియందుఁ గూలవైచి వెడలిపోవుట కుద్యుక్తులైరి. ఉమాపతి వారినిగూర్చి ''ఈస్థలము పేరే'' మని యడిగెను.

ఆదురాత్ములలో నొకఁడు ''నీకు దానితోఁ బనేమి?'' అనియెను.

ఉమా:—నన్ను ఇట్లు కట్టివైచుటకుఁ గారణమేమి?

ఒకడు:—ఎవరి యాజ్ఞాప్రకారము నీవు బంధింపఁబడితివో వారి నడుగుము.

ఉమా:—ఆతఁడెవ్వరు?

ఒకఁడు:—మాప్రభువు.

ఉమా:—ఆతని పేరేమి?

ఒకఁడు—నీకుఁ దెలియదా? ఆతని పే రెవ్వరెఱుఁగరు! నీయూరేది?

ఉమా:—సప్తగ్రామము.

ఒకఁడు:—సప్తగ్రామమందు మాప్రభువుపేరు తెలియని వారెవ్వరైన నున్నారా?

ఏమా:—ఆతని పేరు చెప్పినయెడల ఆతని నెఱుఁగుదునో ఎఱుఁగనో చెప్పెదను.

ఒకఁడు:—తెలిసిన తెలిసికొనుము. లేకున్న నూరకుండుము. నీకుఁ దెలియనప్పుడు చెప్పినను దోషము లేదు.

మిగిలినవా రందఱును దోషమని యఱచిరి. మొదట మాట లాడినయాతఁ డుత్సాహముతో "ఆతనిపేరు రహీము, ఈపేరును దెలియని వాఁడు జగత్తున పుట్టియేయుండఁడు" అనియెను.

ఈమాటలను వినినతోడనే యుమాపతి తలమీఁదఁ జేయిఁ బెట్టుకొనియెను. ప్రాణముదక్కించుకొను నాశను విడిచెను. ఆతని మనసునందు "ఇఁకఁ దప్పించుకొను నాశ లేదు. దురాత్ముఁడైన రహీమా! అయ్యో! ఎంతభయంకరము! నేనట్టివాని చేతులలోఁ బడిపోయితిని" అని యనుకొనియెను.

ఈకాలమున, దేశమంతటను దొంగలు ప్రబలియుండిరి. ఎక్కడఁజూచినను దొంగలకు లెక్కలేదు. దొంగలు గుంపులుగుంపులుగ నక్కడక్కడఁదిరుగుచుండిరి. వానియందు రహీముగుంపునిచాల భయంకరమైనది. రహీముని పేరు తెలియనివారు లేరు. రహీమనుపేరు విన్నంతమాత్రమున నందఱును గడగడ వడకుచుండిరి. ఆబాలవృద్ధులు నాతని నెఱుఁగురు. బిడ్డలు రహీముని పేరు విన్నయెడల నేడ్పులను మానివేయుదురు. మనుష్యులను జంపుట, వారి సర్వస్వమును హరించుట, మొదలగు దుష్కర్మములను చేయుటయందు రహీముని గుంపు వారించుకంతయును నెప్పుడును వెనుకంజ వేయరు. ఆతనియల్లరుల నణఁచివేయుటకై సర్కారువారు లెక్కలేని యేర్పాటులను గావించిరి. రహీముని తలను దెచ్చి చూపినవారికి పదివేలరూపాయ

లు బహుమానమిచ్చెదమని ప్రకటించిరి. ఈబహుమానము నందలి యాశచేఁ జాలమంది జనులు రహీమును బట్టుకొనుటకు యెన్నియో యుపాయముల వెదకుచుండిరి. కాని, యెవ్వరు నాకార్యమును నెర వేర్పలేక పోయిరి. రహీముని గుంపులోనివారు చాలకాల మొక్క చోటనేయుండియుండని కారణమున నెవ్వరికిని వారు దొరకకుండిరి.

ఉమాపతి రహీముని పేరు విని వడఁకెను. దురాత్ముఁడైన యారహీముని చేతికిఁ జిక్కిన నిఁకఁ దప్పించుకొను మార్గ మెక్కడిది? దొంగలను ఇఁక నొకటిరెండు మాటల నడుగవలయునని యాతఁడ నుకొనియెను. ఇంతలోనె వారు తలుపులను మూసివైచి వెడలి పోయిరి.

ఆకారాగారముయొక్క స్థితిని జూచుటకై యాతఁడు నలుత ట్టులఁజూచెను. కాని దట్టమైన యంధకారముచే నేమియుఁ గనబడ లేదు. వెలుతురు వచ్చుమార్గము లేకుండ మూసివైచిరి. అతని శరీ రమంతయుఁ జెమటచే నీరై పోయెను. అతని ముక్కును నోరునుచాల సేపు మూసివైచుటచేఁ గలిగిన బాధవలనను, శుభ్రమైనగాలి లేక పోవుటచేఁ గలిగిన యాతనవలనను, జీవన్మృతుఁడై పడియుండెను. భగవంతుని ధ్యానించుచు నుమాపతి నేలపైఁ బడియుండెను.

---

## ముప్పది మూఁడవ ప్రకరణము

### చోరసమక్షము

"He is the rock;—the oak, not to be windshaken"
Shakespeare (Coriolanus)

ఉషస్సమాగమముచే నరణ్యస్థలము మిగుల మనోహరమగు కాంతిని ధరియించియుండెను. బహుశ్రమచే నలసియున్న కళాధరుఁ

ను పాండువర్ణమును ధరియించి విశ్రాంతమూర్తమై వెడలిపోయెను. సహస్రకరశోభితుఁడై తేజోమూర్తియై యొప్పుకమలినీమనోహరుఁడుతూర్పు కొండనెక్కి బయలుదేరెను. నిశాసమయమునందలి చల్లని మంచుబిందువులచేనలరారుచున్నతమపత్రములయం దాబాలభాస్కరుని మనోహర కాంతి ప్రతిఫలించుచు, అగాధసముద్రమునందున్న శుక్తిగర్భజనకములగు సురుచిరముక్తాఫలముల కాంతిని లజ్జింపఁజేయుచుండెను. సరస్సునలంకరించియున్నసరోజనీ కాంతలు స్మితవికసితాననలై ప్రాణేశ్వరుఁడైన ప్రభాకరుని గాంచఁదొడఁగిరి. చల్లని పిల్లవాయువు లల్లనల్లనవచ్చి తరుశాఖలను, వనాలంకారములైన మృదులతలను, సరస్సునందున్న కమలములను మెల్లమెల్లగఁ గదలించుచుండెను. పక్షులు గూండ్లను విడిచిబయలుదేరి సప్తస్వరసమ్మిళితములైనధ్వనులను జేయుచు నాకాశమార్గమునం దెగిరి పోవుచుండెను. సర్వత్ర తేజమును ఉత్సాహమును రమణీయముగ విరాజిల్లుచుండెను. ఉషస్సమయమునందలి స్వభావసిద్ధమైన శోభారాశి నెవ్వరు చూడలేరో వారికన్నులు వ్యర్థములు. వారిజన్మముకూడ వ్యర్థము. ప్రకృతికాండమైన పుస్తకమునందలి ప్రతిపంక్తియు ననుపమానరమణీయతచేఁబరిపూర్ణమైయుండును. విశేషించి యుండలి యీపరిచ్ఛేదమత్యంతాశ్చర్యకరమైనది.

క్రమక్రమముగ నరణ్యభూమి ప్రదీప్తమయ్యెను. దొంగలు, ఒక్కొక్కఁడుగ లేచిరి. క్రమముగా నెండయెక్కెను. రహీం యొక్క చెట్టుమొదటఁ గూర్చుండి తనయనుచరుల నందఱిని బిలిచెను. వారందఱునువచ్చి వానిచుట్టును జేరిరి. వారిరువది మందికిఁ దక్కువ లేరు రహీంమందఱిని జూచి "భ్రాతృవరులారా! ఇక్కడ మన మింకను జాలకాల మున్నయెడల మనకు విపత్తు కలుగును. మనమందఱమును నేఁడె యిక్కడనుండి బయలుదేరిపోవలయును. మీయభిప్రాయ మేమి?" అనియడిగెను.

ఎల్ల రేకవాక్యముగా! " అది మంచిదియే. ఇప్పుడే బయలు దేరవలయును" అనిరి,

రహీం—ఒకపని యున్నది. మీరు నిన్నరాత్రి కట్టితెచ్చిన వాఁడునాకుఁ జాలనవమానమును జేసెను. వానికి దగిన శాస్తి చేయవలయును. ఆపని నిప్పుడే నెఱవేర్పవలయును. అతనిఁ బిలుచుకొని రండు.

అంద ఱిందులకు సమ్మతించిరి. ముప్వురుమాటలాడకుండ నుమాపతిని దీసుకొనివచ్చుటకై పోయిరి. ఆగుంపునం దొక్కఁడుమాత్రమీప్రస్తావనము కిష్టపడిన ట్లగపడుటలేదు. అతఁడు మాటలాడకూరకుండెను. రహీం మదికనిపెట్టి యాతని చెంతకుఁ బిలిచి "దేలవరా! నీవేమి చెప్పెదవు? నీయభిప్రాయము వేఱుగా నున్నట్లు కనఁబడుచున్నది." అనియెను.

దేలవరు—అదేమిమాట? నీమతమే నామతము. నీమతము కంటెనామతము వేఱా?

రహీం—ఇదేమి దేలవరా! ఎందులకై నేఁ డట్లు చెప్పుచుంటివి? నీవు మాగుంపులోనికి వచ్చిచేరినది మొదలు, అందఱు నొక్కదిక్కునకుఁ బోయిన నీవొకదిక్కునకుఁ బోవుచుంటివి.

దేలవ—(వినయముతో)నీకునామీదగలదయకుపారము లేదు

రహీం—నీముఖమును జూచినయెడల నీవేమో యోచించుచున్నట్లు కనఁబడుచున్నది. అదేదియో చెప్పెదవా?

దొంగలగుంపునందు దేలవరుఁడు విశేషబుద్ధిమంతుఁడని యెఱిఁగియుండుటచేత రహీం యెప్పుడును ఆతని యాలోచనము వినుచుండెను. ఆకారణమున నీదినమును ఆతనినాలోచన మడిగెను.

కొంచము సేపటిలోనే ఉమాపతి నక్కడకుఁ దెచ్చినిలిపిరి. ఉమాపతి మూర్తి గంభీరముగను శాంతముగను, జంకుగొంకులేనిదియు

దాసీనభావముకలదిగను ఉండెను. అతని యప్పటివిపత్తును గూర్చి యోచించిచూచితిమేని అప్పు డాతఁడు తాల్చిన గంభీరాకారము విస్మయజనకము కాక మానదు. ఆయాపద నాతఁడు లక్ష్యముసేయ లేదు. అతని ముఖమున వైరాగ్యముకూడ వ్యక్తమగుచుండెను. ఇట్టియాపదలో భయపడకుండ వైరాగ్యమును వహియించియుండుట చాల నాశ్చర్యము. ధైర్యమును విడువలేదు. కాని యాతఁ డేనమ్మకమున ధైర్యమును వహించియుండెనో యది యాతనికే తెలియును

బంధింపఁబడియున్న యుమాపతి యక్కడకు వచ్చినతోడనే వారందరిదృష్టియు నాతని మీద పోకెను. నిర్భీకమైన యాతని కమనీయకాంతిని జూచి దొంగలందరును నాశ్చర్యమును బొందిరి. భయరహితుఁడై యున్న యుమాపతి చూడ్కులు దొంగలందఱిమీఁదను బ్రసరించెను. క్రమముగ నాతని దృష్టి దేలవరునిపైఁ బడెను. అతని నా దేలవరుఁడు పరిచితునట్లు చాలసేపు తేరిపాఱఁ జూచెను. దేలవరుఁడంతటితోఁ దృప్తినొందక, యాతనివైపునకు వెన్నుద్రిప్పి యొక చెట్టాకును ద్రుంచి దానిని ముక్కలుచేసి పాఱవేయుచుండెను.

ఈసమయమున రహీము కఠోరస్వరముతో "కాఫరుఁడా! ఏమి యోచించుచున్నావు? దుర్గానామమును జపింపుము. ఇఁక నాలస్యము లేదు." అనియెను.

భయపడకుండ నుమాపతి, చలియింపని హృదయముతో "ఆలస్యము లేదను సంగతినే నెఱుఁగుదును. అందువలన నేమగును? కరుణింపుమని నిన్ను నేను వేఁడుకొను వాఁడను గాను. ఇదీ! నీదయ జీవించువా రెవరున్నారు?" అనియెను.

రహీము కోపముతో "నీవు కరుణింపుమని వేఁడవు. వేఁడినంత మాఁత్రమున నిన్ను కరుణించువారెవ్వరు?" అనియెను.

ఉమాపతి—నీవు నను చంపివేయుదువని నేనెఱుఁగుదును. నేను నిస్సహాయుఁడను, దుర్బలుఁడను—కావున బ్రదుకుదునను నాశ లేదు. కాని నీకును చావురాకపోదు. రహీముఁడా! నను చంపి వైచి నీవుమాత్రమీలోకమున శాశ్వతముగ నుందువా? ఈశ్వరుని యెదుట నీయపరాధములను దాఁచిపెట్టలేవు? అప్పుడునీకు రక్షణము లేదు.

ఈమాటలకు రహీము "హాహాహా" అని నవ్వుచు వ్యంగ్య స్వరముతో హిందువునకా! ఈశ్వరుఁడా నీవు రాతిబొమ్మను పూజించెదవు. మేము దానితలమీదఁ గాలునుంచెదము." అనెను.

ఉమాపతి విరక్తతతో "నీవుమూర్ఖుఁడవు. నీతోఁడ నీవిష మునుగూర్చి వాదించుట వ్యర్థము. మాధర్మమబద్ధమైన మీకైన ధర్మమున్నదిగదా! దానివల్లనైన పాపపుణ్యములను గూర్చి విచారణ ముండి తీరవలయునని తోఁచుచున్నది." అనియెను.

రహీము మరలనవ్వి" కాఫరుఁడా! మిమ్మును కొట్టినయెడల మాకుఁ బాపములేదు. మాధర్మమందు ఎంతమంది అధర్ములను నంత పుణ్యమున్నది. అంతస్వర్గసుఖము కలుగును." అని యనియెను

ఉమా:- ఏకార్యముచేత సుఖమును స్వర్గమును గలుగు చున్నవో దానిని చేయుటకు ఆలశ్యమెందులకు?

రహీముచాలాసేపు యోచించి పిమ్మట "వినుము. ఒకానొక కారణముచే నేఁటికి నీప్రాణము దక్కినది, రేపు నిజముగా నీయాయు వు మూఁడును. ఇంకొకదినము భూమిమీఁద వసియించియుండుటకు నీ కదృష్టమున్నది. ఈలోపుగ నీయిష్టమంత్రమును జయించుకొనుము. అనియెను.

ఇట్లుచెప్పి రహీము తనయనుచరులామెను బిలిచి "మరల నుమాపతిని, ఆయింటికిఁ దీసికొనిపొం" డని యాజ్ఞాపించెను. అతని

కాలు చేతులను గట్టిగఁ గట్టివేయవలయునని చెప్పెను. ఉమాపతిని దీసికొని పోయిరి. రహీమును దేలవయ్యను చాలసేపు అక్కడనే కూర్చుండి మెల్లగనే నేమో మాటలాడుకొనుచుండిరి.

— —

## ముప్పది నాల్గవ ప్రకరణము

### భగ్నాలయము.

"He is truly valiant can wisely suffer
The worst that man can breathe"
Shakespeare (Timan of Athens)

దొంగలు, ఉమాపతినితిరుగ నాకారాగారమం దుంచిరి. అతని కాలుసేతులకు సంకెలలు వైచిరి. పగ్గములచే దృఢముగఁ గట్టివైచిరి. ద్వారమునుభద్రముగామూసిరి. ఉమాపతి పరికించిచూడఁగా, కారాగారము శిధిలమైన యొక దేవాలయముగనుండెను. దానియందుఁ జిన్నదైన యొకలింగమూర్తి ప్రతిష్ఠింపఁబడి యుండెను. ఆమందిరమునకు ఒక్కద్వారము తప్ప, లోపలఁ బ్రవేశించుటకుగాని వెలుతురువచ్చుటకుఁగాని వేఱేమియును మార్గములేదు. దొంగలాద్వారమును గట్టిగమూసివైచిరి. ఆలోపలిప్రదేశ మంతయు జీర్ణమైవిపరీతాంధకారముచే నిండియుండెను. అడుగునుండి నీరుచిమ్మి చెమ్మగనుండెను ఉమాపతి యాదేవుని చరణములకు మనఃపూర్వకముగఁ బ్రణామము జేసి భక్తిభావముతో "భగవానుఁడా! నీకు ఒకబిల్వపత్రమైనను లేద య్యెను–భోగము లెక్కడినుండి వచ్చును?—దురంతమైన మ్లేచ్ఛధర్మము నవలంబించియున్న యవనులు సర్వదా నీయాలయములోనికి బ్రవేశించి యపవిత్రమును జేసివైచిరి. దేవా! నీవిదంతయు నెమ్మదిగ సహించుకొని యుంటివి. ఇదంతయునుకలికాలమాహాత్మ్యము–నీదోష

ముకాదు. ఘోరమైన కలిశాసనముచే, దేవియును, దేవరయును, ఈభూమిని విడిచిపోయి,స్వర్గలోకమునందు విశ్రామమును దీసికొను చుండిరి. ఈలింగమునకును నీకును నీక నఖమాత్రమును సంపర్క ములేదు. నీవుదీనిని వదలిపోయి చాలకాలమై పోయినది. కాని, దేవాదిదేవ! నీవును సామాన్యమైనభయముచేత బెగ్గడిల్లుట, మిగుల శోచనీయమైనవిషయముగానున్నది. అందున కేమియునుసందేహము లేదు వసుంధరపాపమగ్నయై, పుణ్యభూమి యవనాక్రాంతమై, యుండుటను జూచుచు నీ వీసమస్త ప్రపంచరక్షణాపేక్షనుండి విశ్రాంతిని వహించితివా? అట్లైయున, ఓమహాప్రభూ! మాగతి యేమికావలయును? మీరెల్ల మమ్మును విడిచిపెట్టినయెడల మేమందఱ మెవ్వరినాశ్రయింతుము? ఓభగవానుడా! మాకు నిస్తారము లేదు'' అని యనుకొనియెను.

కొంతసే పూరకుండి తిరిగి ''నిన్నుద్దేశించి యిట్లు ప్రార్థించినంతమాత్రమున మాయిష్టసిద్ధి కాబోదు. అదృష్టముండిన మొదటినుండియును బాగుగనే యుండును—ఇప్పుడు వేయిసారు లేడ్చినను, నీవందులకుఁ బ్రతిక్రియఁ జేయఁజాలవు:-''విధాత్రవిహితంమార్గం నకశ్చిదతి వర్తతే''-అట్లయిన సింకెందులకు? రేయింబగళ్లు రోదనము చేసినను, పరిణామమింతెయును మాఱ్పునొందుట సంభవింపదు. కలికాలము నందు మనుష్యుఁడు ముక్తిఁజెందుట కేయుపాయము విహితమైయున్నదో యట్టి కాఁగలదు. దాని కించుకయు నెక్కువ కాదు. ఇట్లని స్థిరపఱచుకొనుటయే సేమము'' అనియనుకొనియెను.

క్రమముగా మధ్యాహ్నమయ్యెను. ప్రచండమైనసూర్యతాపముచే వెలుపల నేమిజరగుచున్నదో యది యుమాపతికిఁ దెలియలేదు. మధ్యమధ్య దొంగలకంఠస్వరమును వారలహాస్యధ్వనియును నాతని చెవికి వినవచ్చుచుండెను. సహకారతరుశాఖలమధ్యఁగూరుచుండి నీడను సేవించుచున్నకోయిలల, ఒక్కొక్క మాఱు మెల్లగ, గంభీరముగ

గూయుచుండెను. ఆధ్వని ఉమాపతిచెవికి వినఁబడియెను. అలయ కుడ్యముమీఁద రెండుబల్లులు ఒకదానికెదురుగనొకటి నిలుచుండియుక స్మాత్తుగ నొకదానివెనుకనొకటి పరుగెత్తనారంభించెను. రెండును బరుగెత్తెను. రెండును పరస్పరమును సామీప్యమునకు వచ్చినపిమ్మట నొకటి వెనుకకుఁ దిరిగి వెన్నియుక రెండవదాని కెదురై నిలిచి వాలమును వక్రముగఁ ద్రిప్పుచు నొకరంధ్రమునందుఁ జొచ్చి చుప్పుమను శబ్దము చేయఁదొడఁగెను. ఆశబ్ద ముమాపతికి వినఁబడియెను. కాని ఇది యేమైనదియు నాతని మనస్సునకుఁ దోఁచలేదు. ఏమికారణము? ఉమాపతి యింతగ నన్యమనస్కుఁడై యుండుట యెందులకు? ఉత్తరము—దారుణమైన విచారమువలన-మృత్యుదేవత భయంకరముగ నోరు దెరచికొని నెత్తిమీఁదఁ గూర్చుండినప్పు డెవ్వరునిశ్చింతగనుండఁగలరు? ఆత్మీయులను, బాంధవులను, స్వదేశమును, వదలి, దుర్మార్గులును పాపాచరణులు నగునీచాంగల చేతులలోఁబడి యెన్నఁడు నెఱుంగని యరణ్యమధ్యమున మరణించుట సంభవించెను. దానినుండి తప్పించుకొనవలయునను నాశ కేవలము దురాశయని మనస్సున స్థిరముచేసికొన్నయెడల ఎవ్వరిహృదయము బ్రద్దలుకాకుండును? ఎవ్వరు విచారము లేకుండఁ నుండగలరు?

ఉమాపతి, నిర్జనమైయున్న యాకారాగారమునఁ గూర్చుండి తనయదృష్టమును గూర్చి చింతించుచుండెను. మఱునాఁటి యుదయమున తనకుమరణము తప్పదని భావించుకొనియెను. ఆకాలము చాల నాలస్యముగాఁ గనబడుచుండెను. వేసటనొందుచు నాసమయము వేగము రావలయునని ప్రార్థించెను. అదెందులకు? మృత్యుదేవతయొక్క కఠినమైన యాక్రమణనుండి నిస్తార మెప్పుడు లేకపోయెనో అప్పు డాలస్యముతోఁ బ్రయోజన మేమి? ఎంతజాగ్రతగ నుండినసంతమంచిది నేఁటి యవస్థ చాల దుఃఖకరముగా నుండెను. దీనికంటెను మరణమే

శ్రేయస్కరమని యోచించుకొనుచు నాతఁడు కొంచెము వడకును, పండ్లుకొఱుక నారంభించెను. స్నేహమయియు, బధిరయు, రోదద్యమానయు నగుజననీమూర్తి యాతనితలంపునకు వచ్చెను అప్పుడాతఁడు మిగుల నస్థిరచిత్తుఁడయ్యెను. ఉమాపతి తనప్రాణమునకుఁగూడ నంతగాఁ జలింపలేదు. అట్లుకావుననే దురాత్ముఁడైన రహీ మెప్పుడు మరణదండనమును విధించెనో అప్పటినుండియు నాతఁడచేతనుఁడై యుండెను. ఆతఁ డింతవఱకు, ఎవ్వరిచేతను దప్పింపరాని మృత్యువును గూర్చియైన నింతగా చలియింపలేదు. జరుగునది జరుగకమానదు అదితప్ప మఱియేదియునుగాదు. అందుకొఱకనర్థకముగఁ జింతించుట వ్యర్థమని యూరకుండెను. తల్లి జ్ఞాపకమునకు వచ్చినతోడనే యాతఁడు మిగుల కలవరపడఁజొచ్చెను. ఆతనితల్లి కాతఁడు తక్క వేఱు దిక్కులేదు. అదిగాక యామె చాలవార్ధక్యావస్థయందుండెను. ఉన్న బిడ్డ యొక్కఁడును ఈవిధముగాఁ బోయినయెడల నామె యెట్టియవస్థకుఁ లోనైపోవునో యనునది తలంపునకుఁ బాఱినతోడనే యుమాపతి గడగడ వడఁకి పోయెను. ఏకపుత్త్రవిషయమైన మరణవార్తతల్లికి దెలిసినయెడల నెట్టిభయంకరావస్థ కామె లోనగునో యనునది మనస్సునందు విస్పష్టముగఁజూడనారంభించెను. ఆతనిహృదయము దహించుకొనిపోవుచుండెను. కన్నీరు సంతతధారగాఁ గురియనారంభించెను. కొంతసేపైనపిమ్మట "భగవానుఁడా! అంతయును నీసంకల్పమే" అని నిట్టూర్పువిడిచెను. చింతాస్వభావమేమన:—దానికివిరామము లేదు—భరింపరాని యొక విచారముకలిగినయెడల దానినుండి అట్టివిదే మఱినూఱుపుట్టును. ఉమాపతి హృదయమునందాతనికిఁ దెలియకుండఁగనే ముక్తకేశినీమూర్తియు నావిర్భవించెను. స్మృతినుండి యామూర్తి యుదయించినతోడనే యుమాపతి వికలితచిత్తుఁడయ్యెను. ప్రణయరత్నమమూల్యమైనది. ఎవ్వరుప్రణయులగుదురో వారే

దానిని తెలిసికొనఁగలరు. ప్రణయమీలోకసంబంధమైనపదార్థముకా దు. అది స్వర్గమునందలిపదార్థము ఈరత్నమున కెంతమూల్యముకల దో దానినివారును జెప్పలేరుఉమాపతి.తలమీఁదసాలెపురుగుతంతువుల నల్లుకొనుచున్నను దానిని తీసివేయుటకైన నెఱుఁగకుండెను.రాత్రినుండి యువిడువకుండనది యాతని శరీరమునందు రెండుభాగముల నల్లెను. అయినను ఈయవస్థయందు ముక్తకేశినిగూర్చిన విచార మాతని మనస్సు నావరించుకొని యుండెను. ముక్తకేశినిగూర్చిన విచార మాతని హృదయమున కెట్టిబాధను గలిగించుచున్నదో చెప్పుట కసాధ్యము. ఏముక్తకేశినీముఖకమల మాతని నానందసాగరమునఁ దేల్చెడిదో, ఆముక్తకేశిని ముఖము తలంపునకు వచ్చి యాతనికిఁ జాలదుఃఖమును గలిగించెను. ఉమాపతి ముక్తకేశినియొక్క ప్రేమ పరిమాణము నూహింపనారంభించెను. అది యపార మైనదని తెలిసి కొనియెను. ఏముక్తకేశినీ ప్రణయ మింతపవిత్రమైనదో, ఆముక్త కేశినికి చిరకాలము తా నెడఁబాసియుండుటవలన నెట్టి భయంకరకష్ట ముకలుగునో దానినిగూర్చి యోచించుకొని యాతఁడు మిక్కుటంబుగ వ్యాకుల మునుబొందసాగెను. తెపటియుదయమునఁ దనదేహము మృతులసం ఖ్యను హెచ్చించుననుతలంపు గలిగినంతనే యాతఁ డెట్టికలవర మును బొందునో — దానికిఁ బదింతలుగ తనవిరహముచే ముక్తకేశి నికిఁ గలుగనైయున్న కష్టమును గూర్చి వ్యాకులత్వమును బొం దెను. ఈసమయమున జంతాప్రవాహము నాధారముఁజేసికొని ప్రియస్నేహితుఁడైన నవకుమారుఁడుమాపతిచిత్తసాగరమునఁ బ్రవే శించెను. తన సర్వస్వమునిచ్చినచో నీజన్మమున నిఁకనొక్కసారి నవకుమారుని జూచుట కలుగునేని నాతఁడట్లుచేయుటకు సిద్ధముగ నుండెను. కాని యాతఁడు తనతల్లిని, ముక్తకేశినిని జూచుటకు మాత్రమిష్టపడుటలేదు. ఏమందురా? వారబలలు. వారి హృదయము

లెంత యౌన్నతమును బొందియున్నను, అవి నవకుసుమరుని హృదయమునకును తనహృదయమునకును సమానమైనవి కావు. స్త్రీలందఱును విపత్తులు గలుగుననుట చేతనే విహ్వాల లగుదురు. అట్టివారు దుర్భరమైన యిట్టివిపత్తును గాంచిన యెడల వారిహృదయముల యందు భరింపశక్యముగాని యాతనకలుగుట కేమిసందేహము?

క్రమముగ రాత్రి విశ్వమంతయు నాక్రమించు కొనియెను. ఉమాపతి యది తెలిసికొనలేనివాఁడై యుండెను. ఆతఁడు దానిని చూడలేదు. దానిపై నాతనికి దృష్టి యెట్లుండును? అతఁడున్న యా యింటియందు రాత్రియును పగలును సమానముగా నుండెను. విశేషించి యాతఁడు చింతామగ్నుఁడై యుండెను. చూచుచుండఁగనే చీఁకటి జగమెల్ల నావరించుకొనియెను. ఆసన్నమృత్యువు నుండి తప్పించుకొను నుపాయము గానక ఉమాపతి దుఃఖించు చుండెను. విరామము లేకుండ దుఃఖానలము ఆతని చుట్టుకొనుచుండెను దానిని సహించి యుండుట చాలఁ గష్టము. అట్లుగావున శీఘ్రముగా మరణించుటయే శుభకరమని యాతఁడు యోచించుకొని మృత్యుదేవతా ప్రత్యక్షమున కాతఁ డాకాంక్షించు చుండెను. ఓపిచ్చివాఁడా! మృత్యువు నీయధీనమందున్నదా? అది నీవు రమ్మనిన వచ్చునా? పొమ్మనిన పోవునా?—ఉమాపతి నిట్టూర్పు విడిచెను విచారమాతనికి సహింపశక్యముకాని దయ్యెను మృత్యువు రాకుండ నేమోయని భయపడఁజొచ్చెను. ఒక్కనిముషములో సూర్యోదయము కావలయునని యాతఁడు కోరుకొనుచుండెను. కాని, నేఁటిదినమంతయు నాతనికి శత్రువుగఁ బరిణమించెను. దుఃఖదినము స్వాభావికముగా గొంచెముగ నున్నను దీర్ఘమైయున్న దానివలెనే తోఁచుచుండును ఉమాపతి ప్రాతఃకాలమునకై ఎంత ప్రార్థించినను అదిరాలేదు రాత్రి యనంతమైనదిగ నున్నట్లు తోఁచుచుండెను నిజ మూఁహా

జిక్కియుంటినే. నాతో హాస్యమాడుటవలన నీతనికిఁ బ్రయోజన మేమి? ఈతఁడు చెప్పినప్రకారము మీతనితోఁ బోయిన హానియేమి? ఏమైనఁ గానిమ్ము. ప్రస్తుత మీగాలిలేని స్థలములనుండి తప్పించుకొని పోవుట యుగు” నని యోచించుకొని “నడువుము” అనియెను

ఆవచ్చినవాఁడు ముందునడచెను—ఉమాపతి యాతని వెన్నంటిపోవుచుండెను। ఆవచ్చినయాతఁడు దేలవరుఁడు—అతఁ డుమాపతిని గాపాడవలయునని సంకల్పించుకొనియెను. అందుకొఱకు రహీముని చెవిలో నీవిషయమై యేమేమో చెప్పెను. చెఱయందున్న పతిని విడిపించుట కాతని కెందులకై యిష్టముకలిగెనో మేము చెప్పఁ జాలము

ఉమాపతియు దేలవరుఁడును నెక్కడనాఁగకుండఁ బోవుచు నరణ్యమంతయు దాఁటిరి. చాలసేపునడచి యలసిపోయి విశ్రమించుటకై యొకస్థలమునఁ గూర్చుండిరి. ఆసమయమునకుఁ బ్రాంతస్సూర్యుఁడు పూర్వాకాశమునఁ గనఁబడుచుండెను.

దేలవ—నడువుము నిన్నీయడవినుండి దాఁటించి మఱివచ్చెదను.

తిరిగి యిద్దఱును నడువనారంభించిరి. తెల్లవారియెనిమిదిగంటలకు వారు ఆయడవిని వదలి యొకప్రాంతమునకు వచ్చిరి. సమీపమునం దొకచిన్నగ్రామము కనఁబడుచుండెను. ఉమాపతి సంతోషముతో “ఎదుటఁగాన్పించుచున్న గ్రామము గోపాలపురము. ఈ గ్రామమందు నామేనమామ యిల్లున్నది—ఆహా!!” అని యాశ్చర్యమును బొందెను.

దేలవరుఁడునిశ్చలభావముతో “అవును ఈగ్రామమే గోపాలపురము ఇఁక నీవు వెళ్ళిపొమ్ము. నేను పోయెదను” అనియెను.

ఉమాపతి కృతజ్ఞతాస్వరముతో “మీరు ఇప్పు డెక్కడికిఁ బోయెదరు?” అనియెను.

దేలవ—నేను తిరిగి నాగుంపులోని కేగెదను.

ఉమా:—మీయట్టివారు దొంగలగుంపునం దుండుట మంచి దికాదు.

దేల:—(కొంచెమునవ్వి) అట్లే. నీవు సంతుష్టుండ వైతివా?

ఉమా:—అతిశయమైన సంతుష్టినందితిని.

దేల:—మంచిది. అట్లే కానిమ్ము. నేను తిరిగి దొంగలగుంపు లోనికిం బోవుటలేదు.

ఉమా:—అట్లయిన నెక్కడకుంబోయెదరు?

దేల:— వేఱొకచోటకు—పనిగలదు.

ఉమా:—రెండుదినములైనపిమ్మట పోరాదా!

దేల;—ఎందులకు?

ఉమా:—కృతజ్ఞతాపూరిత హృదయుండనై నాప్రాణరక్షకుని నందఱికిని జూపించుటకు—

దేల:—ఆయాశ ఫలింపంగలదు.

ఉమా:—ఎట్లు?

దేల:—మరల చూచునప్పుడు.

ఉమా:—ఎక్కడ?

దేల:—మీయింటియందు.

ఉమా:—మీరు మాయింటికి వచ్చెదరా?

దేల:—వచ్చెదను.

ఉమా—పునర్దర్శన మెప్పుడు?

దేల:—త్వరలోనె.

ఉమాపతిముఖము సంతోషముచే వికసించెను. ఆతఁడు "నా ప్రాణరక్షకుని పేరు తెలిసికొని నేను సంతోషింపవలదా? ఆసంతోషము గలుగకుండ నేల వంచించెదరు?" అనియెను.

దేలవరుఁడు "నాపేరా? నాపేరును వినవలయునా? ముఖ్యముగా వినుము. ఎందులకుఁ జెప్పకుండవలయును? నాపేరు దేలవరుఁడు" అనియెను.

ఇట్లని చెప్పి దేలవరుఁడు తిరిగి ప్రత్యుత్తరము రాకుండఁగనే "ఇప్పుడు నీవు నిర్భయముగఁ బొమ్ము భగవంతుఁడు నీకు శుభమొనగూర్చుఁగాక! జాగ్రతగా తిరిగి నిన్ను చూచెదను" అని చెప్పుచు నాతఁ డరణ్యాంతరమం దదృశ్యుఁడయ్యెను. ఉమాపతి ఆతనివంకఁ జూచుచుండెను. కాని తిరిగి కాన్పింపలేదు. ఉమాపతి గోపాలపురమునకుఁ బోయెను.

---

## ముప్పది ఐదవ ప్రకరణము

### ప్రణయినీసమక్షము.

ఉమాపతిని మరలఁ జూచుటవలన హరిహరునకుఁ గలిగిన యానందమునకు మేరలేదు. ఉమాపతి యాతనికి నడచిన వృత్తాంతమంతయు నెఱింగించెను. హరుహరుఁ డంతయును విని యింటికిఁ బదమని చెప్పెను. పోవునప్పు డొకసారి భట్టాచార్యుని జూచి మఱిపొమ్మ. అని చెప్పెను. అల్లుఁడుమామ లిద్దఱును ఒక్కసారియే భోజనమునకుఁ గూర్చుండిరి. భోజనమైనపిమ్మట కొంతసేపు విశ్రమించి లేచి యుమాపతి మేనమామకు నమస్కరించి బయలుదేరెను.

పాఠకమహాశయులారా! ఉమాపతి వచ్చుటకు ముందు భట్టాచార్యులవారి యింటియవస్థ యెట్లున్నదో మనముపోయి యొకసారి చూచి రావలయును. రండు ప్రొద్దు వాలిపోయినది. ఇంటియజమానురాలు అన్యమనస్కయైయేమో యోచించుచుఁ గూర్చుండియుం

డెను. ఉమాపతి యూరినుండి మరల వచ్చెనని యింకను దెలియలే దు. చాలవిచారించుచుఁ గూర్చుండెను. ఉమాపతికనఁబడక పోవుట యే యీ విచారమునకుఁ గారణమయ్యెను.

ముక్తకేశిని యెక్కడనున్నది? ఆమె యొక చిన్నయింటియం దు మలినయై శుష్కవదనయై విషణ్ణయై కూర్చుండి ఏమోయోచించు చుండెను—యౌవనోన్ముఖయైన యామె హృదయమందు జనియించిన ప్రణయ మెంతయాశ్చర్యకరమైనది? ఏదినమున ఏముహూర్తమున నీ బాలికాహృదయమందు ప్రణయమునకు స్థానము దొరకినదో ఆదిన ము ఆముహూర్తము మొదలుకొని, యీలోకసంసార మంతయు నా మె కన్నులకుఁ గ్రొత్తగఁ జిత్రింపఁబడియున్నట్లుగఁ గనవచ్చుచుండె ను. ఆమెహృదయము ఆనందసాగరమునఁ దేలియాడుచుండెను. స మస్తపదార్థములను ఆమె యొకవిధమైన నూత్నసంతోషముతోఁజూ డసాగెను. ఆబాలిక కన్నులకు నాఁడుమొదలు ప్రపంచమంతయువిరా మములేని సంతోషమయారామమని తోఁచెను. ముక్తకేశిని యాప్ర ణయసాగరమునఁ బడియుండెను. ఆమె మనస్సున నుమాపతినె పతి గా వరించియుండెను. లజ్జాశీలయైన యాబాలమనస్సునందు దుర్దమ నీయములైన యీభావములు చేరుకొని గోప్యముగ నుండెను. ఆమె యాశ ఫలింపఁజాలదని భావించుకొనియెను. కాని బ్రహ్మదేవుఁడామె పైఁ బ్రసన్నుఁడై యుండెను. ఆమె నుమాపతికిచ్చి పెండ్లి చేయువల యునని నిశ్చయించుకొని యుండెను. ముక్తకేశిని సుఖమునకుఁ బార ములేదు. ఆమె శరీరలావణ్యము మఱింత హెచ్చయ్యెను. సుఖసౌధ ముపై నెంతదూరము పోవచ్చునో, అంతదూర మామె పోయెను. కాని, భగవంతుఁడు మరల విముఖుఁడయ్యెను. ఆమె హృదయము ఆనందముచేఁ బొంపిరివోవుచున్న సమయమున నుమాపతికనఁబడకుం డఁ బోయినసమాచారమామెకుఁ దెలియవచ్చెను. ఆమె సుఖసౌధ

మానిమిషమునందే భగ్నమై పడిపోయెను. సుఖసముద్ర విహారిణి యైన యబల హఠాత్తుగ దుఃఖసాగరమునఁ బడిపోయెను. ఆశాలత లన్నియును శిధిలమూలము లయ్యెను. ఉమాపతి తనయింటినుండి బయలుదేరి సప్తగ్రామమునకుఁ జేరలేదని విన్నప్పుడె యామె పిచ్చి దాయైపోయెను. మనోవేగము నెంతవఱకు నణచియుండవచ్చునో అంత వఱకు రహస్యముగఁ ద్రొక్కియుంచుట కామె ప్రయత్నించెను. అట్టితనభావమును జనులుచూచి యేమందురో యనియెను, తల్లికిఁ దెలిసినయెడల సిగ్గులేనిపిల్లయని యెక్కడననుకొనిపోవునో యనియె ను, సందేహించి తనదుఃఖమును సాధ్యమైనంతవఱకు నణఁచిపెట్టెను. జనులయెదుటఁ దన కేమియును విచారము లేనట్లు నటింపసాగెను. ఇప్పుడేకాంతముగా నొక్కతెయే కూర్చుండియుండుటచేత నితరులు వచ్చి పోవుదురను సందేహమును గలిగియుండలేదు. ఎవ్వరునువిఘా తముసేయని యీయొంటిపాటును గనిపెట్టి చింత యామె నావేశించి మ్రింగివేయఁ జూచుచుండెను. ఆకారణమున ముక్తకేశిస యింతటి దుఃఖమునకు లోనైయుండెను. ఆలోచనములచే నామె మొగము చిక్కి చిన్నబోయెను.

ఈసమయమునం దుమాపతి యాచిన్నయింటిలోఁ బ్రవేశిం చెను. అవనతముఖియై ముక్తకేశిని చింతాసాగరములోమునిఁగియుం డెను. ఆమె యారాకనుచూచినను దెలిసికొనఁజాలనియవస్థలో నుం డెను. నిట్టూర్పును విడిచి "ప్రాణేశ్వరా! ఉమాపతీ! నీవెక్కడను న్నావు? నీవెక్కడ నున్నను సుఖముకలుగుఁగాక! తొందరలు లేకుం డుఁగాక! ఈదాసియదృష్టమున బ్రహ్మయేమివ్రాసెనో యది జరుగక మానదు." అనియనుకొనుచుఁ దలపైకెత్తెను. తలనెత్తినతోడనే యామె ముఖభావములు మాఱిపోయెను. ఎట్టయెదుటఁ దనప్రాణేశ్వరుఁడైన యుమాపతి నిలుచుండి యుండెను. నోరెండియున్నచాతకాంగననోట

చల్లనివర్షబిందులు కురిసినట్టు లయ్యెను. నిర్జీవమైనయున్న ముక్త కేశిని దేహమునందు ప్రాణవాయువులు మరల సంచారము చేయ సాగెను.

ఉమాపతి—ముక్తకేశినీ! నీమాటలను వింటిని. నేనిన్ని దిన ములును అంధకారమునం దుంటిని. నీవు నన్నుఁ బ్రేమించుచుండలే దనియనుకొంటిని. నేఁడానందేహము తొలఁగిపోయినది. ముక్తకేశినీ నేనెట్టిసుఖిని! నీవెవ్వరిసుఖదుఃఖములకై చింతించుచుంటివో అట్టియా తని జన్మమే సార్థకమైనది. నీవింక విచారించుట యెందులకు? నేను నీవాఁడనే యగుదును.

చిఱునగవుచే వికసించిన ముఖముగలదై ముక్తకేశినియు మె ల్లమెల్లగ "మీరిన్నినాళ్ళెక్కడనుంటిరి?" అని యడిగెను.

ఉమాపతి సంక్షేపముగా సమస్తము నెఱింగించెను.

ముక్త—మాయమ్మను జూచి వచ్చితిరా?

ఉమా—చూచితిని.

ముక్త—మన మిద్దఱము నేకాంతముగ మాటలాడుటను. జూచినయెడల నామెయేమైన ననుకొనునేమో?

ఉమా—ప్రియా! ఇఁక రెండుదినములైనపిమ్మట ఎవ్వరితో మాటలాడకున్న జనులు దూషింతురో, అట్టివానితో ఆరెండుదినము లకు ముందుగా మాటలాడినందువలన బోషమేమి?—అది యటుం డనిమ్ము—ఇప్పు డింటికి వెళ్లెదను. నీవు విచారమును విడిచి యుం డుము. వెంటనే మరల వచ్చెదను.

ఇట్లు చెప్పి యుమాపతి బయలుదేరి వచ్చి ముక్తకేశిని జనని యొద్ద సెలవుగైకొని వెడలిపోయెను.

---

# ముప్పది యాఱవ ప్రకరణము

## పరిచయము

### "అజన్మ్యగీటుతప్పదు"

మఱునాఁటి సాయంకాలమునందు నవకుమారుఁడును ఉమాపతియును నింటిలోఁగూర్చుండి ఉమాపతి తల్లియొద్ద మాటలాడుచుండిరి. నాల్గవభాగముయొక్క యుపసంహారమునందు ఉమాపతి వచ్చి నవకుమారుని బిలిచెనని పాఠకమహాశయులెఱింగియే యుందురు. ఉమాపతి రాత్రి యింటికివచ్చి, ఉదయముననే తన్ను వెదకుటకై నవకుమారుఁడు బయలుదేరనై యుండెనని తల్లివలనఁ దెలిసికొనియెను. అందువలన నుమాపతి వెంటనే తన రాకనుగూర్చి తెలుపుటకై యాతనియొద్దకేగెను. నేఁడు వారిద్దఱును నొకచోటఁ గూర్చుండి విశేషముగ మాటలాడుకొనుచుండిరి. అప్పుడు సేవకుఁడొకఁడు వచ్చి "వెలుపల నెవ్వరో తమ్ముఁజూచుటకై వేచియున్నారు" అని చెప్పెను. ఇద్దఱును లేచి యీవలికి వచ్చిరి. ఈవలకువచ్చి యుమాపతి చూడఁగా, దేలవరుఁడునిలుచుండి యుండెను. ఆతఁడు దేలవరునకు ముసల్మానులపద్ధతి ననుసరించిమర్యాదఁజేసి అభివాదనము జేసి, "నవకుమారా! వీరె నాప్రాణమును గాపాడినవారు. వీరిపేరు దేలవరుఁడు" అనియెను.

నవకుమారుఁడు దేలవరుని బిలిచి "మహాశయా! మీరు మాకొనరించిన యుపకారమునుగూర్చి యెంతచెప్పినను తృప్తియుండదు. మేము మీపేరు నెల్లప్పుడును మాయిష్టమంత్రముగ స్మరించుకొనుచుందుము" అనియెను.

దేల—అట్లుచెప్పరాదు. నేనుచేసినదియుపకారముగా నెంచవలదు. మనుష్యమాత్రుఁడెవ్వఁడట్టికార్యమును జేయకుండనుండగలఁడు?

ఉమాపతి నవకుమారుని జూపి "స్వామీ! మీరీతని జూచితిరా?—ఈతడు నామేలుగోరు బంధువుఁడు. ఈతని పేరు నవకుమార వంద్యోపాధ్యాయుఁడు" అనియెను.

దేవశర్మ చాలసేపు యోచించి పిమ్మట "మహాశయా! మీరెప్పుడైనను మేదినీపురమునకుఁ బోవుట తటస్థించినదా?" అని యడిగెను.

నవ—సముద్రతీరమునందలి భయంకరమైన యడవిలోనున్న "హిజలి" యను గ్రామమునుండి యింటికిఁ దిరిగిపోవుచుమార్గములో నొకరాత్రి మేదినీపుర సమీపమున నొక సత్రమునం దుంటిని.

దేవ—అప్పుడు మీతోఁ గూడ నొకరమణీమణి యున్నది కాదా? ఆమె మీభార్యయని యనుకొంటిని.

నవ—అవును. అది యంతయును మీకెట్లు తెలిసినది?

దేవ— అది చాలఁగనున్నది — చెప్పెదను— చెప్పవలయును—మీరు చాలమంచివారు. మీసతీమణిచరిత్రమును మఱింత ప్రశంశనీయమైనది. నాఁటిసాయంకాలమున నొకపాలకి పోవుచుండెను. అందు మీభార్య యున్నదని తలంచెదను. మేము మాగుంపుతో నక్కడనుంటిమి. దొంగలందఱును పాలకిని పడఁగొట్టుటకు బ్రయత్నించిరి. నేనువారికి "ఆమెతో నెవ్వరును లేరు. లాభము లేకుండ నాస్త్రీని గొట్టినప్రయోజన మేమి?"అని చెప్పితిని. దొంగలు నామీఁదకు చెలరేఁగిరి. వారు "నీవు కేవల ఋషివి. ఆమె యొద్ద నేమియును లేదని నీవెట్లెఱుఁగుదువు?" అని చెప్పి యందఱును దోఁచుకొనుటకుఁ బైఁబడిరి.

పాలకియం దొకసుందరీమణి యుండెను. దొంగలామెయొద్ద నున్నదంతయు దోఁచికొని యామెను చంపివేయక యక్కడనే కట్టి పారవేసిరి.

నవ—ఆశ్చర్యముతో నిజమే. ఆవెంటనే నేనక్కడకుఁబోయి తిని.

దేల—కావచ్చును. మీకంఠస్వరము వినఁబడినది. అందు వలననే నేడు మీమాట గుఱుతుపట్టితిని. మీభార్యపేరు కపాల కుండల యని తోఁచుచున్నది. ఔనా?

నవ—అవును.

ఉమా—వారును రహీము గుంపులోని వారేనా?

దేల—రహీముగుంపులోనివారుగాక మఱెవ్వరు? ఆతనిగుంపు వారంతను వ్యాపించి యుందురు. ఇప్పుడు రహీముని విషయమై ప్రచురమైన రాజాజ్ఞ యప్పు డంతకఠినముగ లేదు. అది యట్లుండ నిమ్ము ముందు వినవలయును. ఆమఱునటియుదయముననే కపాల కుండల పాలకియు దారినుండి పోవుచుండెను. అప్పుడు మీరు మీ మూరికిఁ బోవుచుంటిరి. రహీముఁడు పాలకిపై బడి దోఁచుకొనుటకు దమవారి కాజ్ఞ యిచ్చెను. మీభార్యహస్తములందు వజ్రఖచితము లైన కంకణములను ధరించి యుండెను. నేను రహీమునుగూర్చి "ఆమెయొద్దనున్న దంతయు దీసికొనివచ్చితిరిగదా! ఇంక నామెను నిర్బంధించుట యెందులకు?" అని అడిగితిని. అందులకాతఁడు "అట్టు లైన నిర్బంధ మక్కఱలేదు." అనియెను. అప్పుడు నేనొక దరిద్ర బ్రాహ్మణవేషమున వేసికొని పాలకి యొద్దకుఁ బోయి యామెను గూర్చి భిక్షను వేఁడితిని. ఆమెతనయొద్ద నేమియు లేదని చెప్పెను. నేనామెయొద్ద నొక యుంగర మున్నదని కనిపెట్టితిని—ఉమాపతీ! నీవు వినినయెడల మిగుల నాశ్చర్యమును బొందెదవు. ఏమన—దంత నిర్మితమైనయొక పెట్టెయందమూల్యములై యనేకవిధములైన వజ్ర ఖచితములగు నగలుండెను. ఆధర్మాత్మురాలు వానిపై నించుకయైన మమత లేకుండ నావస్తువులతో నిండియున్న యాపెట్టెను, చేతుల

యందున్న కంకణములను తీసి నాకు దానముగ నిచ్చివేసెను. నాకా శ్చర్యముచే నోట మాట రాలేదు. తోడనే కిక్కురుమనక వాని నెత్తికొని పోయితిని. దొంగలందఱును నాయందు మిగుల గౌర వము గలవారై సంతోషపడిరి. రహీము ఆనగ లన్నిటిని నాకిచ్చి వేసెను. దొంగ లెవ్వరును దాని నాక్షేపింపలేదు. నాఁడు మొదలు వారందఱు నన్ను చాలా గౌరవముతోఁజూచుచుండిరి. రహీమునకు నాయందు చాల దయగలదు. ఆదినము మొదలు రహీమునాతో నాలోచింపనిదే యేపనియును జేయుట లేదు. దొంగలు దేలవరు నకుఁ దెలియనిది లేనిదని చెప్పుకొనుచుండిరి. అదియుండనిమ్ము మీభార్య యిదియంతయు వినినయెడల మిగులనాశ్చర్య పడును. ఆమె బాగుగ నున్నదా?

నవకుమారుఁడు నిట్టూర్పు విడిచి, "అది పరలోకమున కేగి నది" అనియెను.

దేలవరుఁడుదుఃఖశూచకమైనస్వరముతో "ఆమెయీలోకము విడిచినదా! ఆమెను తిరిగిచూచినయెడలనామె నగలన్నియు నామెకే తిరిగి యిచ్చివేయవలెనని భద్రముగా దాఁచియుంచితినే!" అనియెను

ఉమాపతి యీమాటలను వినుచు దేలవరుని పరికించిచూచు చుండెను. దేలవరుఁ డదికనిపెట్టి "ఏమిచూచుచున్నావు?" అనియెను.

ఉమాపతి—మిమ్మింతకు బూర్వమెక్కడనో చూచినట్లుతో చుచున్నది. వస్త్రములు మొదలైనవానిచే మీరు వేషాంతరమును ధరియించినను నేను మిమ్ముల నెఱుఁగుదు నని తోఁచుచున్నది.

దేలవరుఁడు చిఱునవ్వు నవ్వెను. నవకుమారుఁడు "మేము మీకు చాల ఋణపడి యుంటిమి. మీరింతటి యుదారసాధుస్వభావ ముగలవారై యుండియు దొంగలగుంపులో నెట్లు చేరితిరో మాకుఁ దెలియకున్నది" అనియెను.

ఉమా—మీరు దొంగలని నేనెన్నటికిని నమ్మఁజాలను.

దేల—నవ్వి "అట్లుకానియెడల నెవ్వరనియెదరు?" అనియెను.

ఉమా—మీరెవ్వరో పెద్దమనుష్యులై యుండవలయును. ఎందుకొఱకు దొంగలగుంపులోఁ జేరితిరో యదిమాత్రము చెప్పలేను.

నవ—మీరు ముసల్మానుజాతివారా? మీమాటలనుబట్టి యట్లుతోఁచుట లేదు.

దేల—అవును—నేను ముసల్మానుఁడను గాను. హిందూ బ్రాహ్మణుఁడను.

నవ—బ్రాహ్మణులా! ముసల్మానుదొంగలలో నెట్లు చేరితిరి?

ఉమా—అట్లయినయెడల మీపేరు దేలవరుఁడు కాదు. మీయసలైన పేరేమో? నేనుమిమ్మెఱిఁగియున్నట్లు తోఁచుచున్నది. మీకంఠస్వరము బాగుగ నెఱుఁగుదును. పేరు తెలియకపోయినను నేను—

దేలవరుఁడు అంతలోనే కన్నీరు పెట్టుకొని "ఉమాపతీ! నీకుఁ దెలిసినయెడల నిఁక మఱచిపోవఁ బ్రయత్నముచేయుము. కాని యీ మాటను మిగుల రహస్యముగ నుంపవలయును. వెల్లడి సేయరాదు. అయ్యో! నాపేరుగోపాలకృష్ణరాయలు. నేనుమాపతికిమేనమఱఁదిని. నేను దీని నింత వేగముగాఁ జెప్పఁదలఁచికొనలేదు. ఉమాపతికి సందేహము కలిగియుండుటచేత నీసంగతి యంతయును జెప్పి హెచ్చరింపవలసివచ్చెను. లేనియెడల విపత్తు రాఁగలదు.

ఉమాపతికన్నులనుండి యానందాశ్రువు లాఁసస నాఁగకుండ సంతతధారగాఁ గురియ నారంభించెను. గోపాలుఁ డాతని వెన్ను జఱచి పిమ్మట చేయిఁ బట్టుకొని "ఇఁక నిట్టిదిన మెప్పటికిని వచ్చునని యనుకొనలేదు. కాని యిప్పుడు స్థిరమైనది. నాకింకను స్వేచ్ఛగా నుండుటకు వలనుపడదు. అని చెప్పి కన్నీరు దుడుచుచు "నేనిక్కడకు వచ్చితినని యెవ్వరికిని నెట్టియనుమానమును కలుఁగఁగూడదు. అట్లు కలి

గినయెడల నేను తిరిగి మిమ్ములను గలిసికొనుట తటస్థింపదు.'' అని యెను.

ఉమాపతి వెంటనే కన్నీరు దుడిచికొనియెను.

గోపాల—మొదలినుండి జరిగినదంతయును చెప్పెదను వినుము అది వినినయెడల నెందులకు రహస్యముగ నుంపవలయునని చెప్పితినో యది తెలియఁగలదు. మనము మాటలాడుచుంనుటను వెలుపల నెవ్వ రైన వినుచుండుట లేదుగద! మహాశయా! మీరును వినవలయును. నేనెప్పుడింటినుండి వెడలిపోయితినో మీరెఱుఁగుదురు. కాని, యేమై తినో మీరెఱుఁగరు. అక్కడనుండి చెప్పెదను. నేనొకపనికొఱకు పడవమీఁదనుండి గ్రామాంతరమునకుఁ బోవుచుంటిని. ఒకగ్రామము నొద్ద రాత్రివేళ పడవ నిలిచిపోయెను. నేను ప్రాతఃకాలకృత్యములఁ దీర్చికొనుటకు నదీతీరమునుండి పోయితిని. ఆగట్టునకు సమీపమునం దొకమహారణ్యము కలదు. అది మిగులదట్టమైనదగుటచే లోపలనేమి యున్నదియో యెవ్వరికిని దెలియదు. ఆపార్శ్వమునందు నిలువఁబడి యుండఁగా నడవియందెవ్వరో మనుష్యులు మాటాడుచున్నయస్పష్ట మైనయొకధ్వని విననయ్యెను. ఈమహారణ్యమం దింతసేపటినుండియె వరిట్లు వచ్చియేమి మాటాడుకొనుచుండిరో తెలిసికొనవలయుననినా కుఁ గుతూహలము కలిగెను. నేను మఱికొంతదగ్గఱకుఁ బోయివిను చుంటిని. నేను వినుచున్న యాసమాచారమునుబట్టి నాజ్ఞానమును, చైతన్యమును లోపము కాఁజొచ్చెను. ఆగాథ చాలఁగనున్నది. దాని యందలిసారాంశము—ఆవెనుకటిరాత్రిదొంగలొకధనవంతుని దోఁచి కొని యాతనిసర్వస్వమును లాగికొని యాతనిని, యాతనిభార్యనునిప్పు లలోఁ బారవైచి వారిచిన్నిబిడ్డను కాలుపట్టుకొని నేలపైఁబడఁగొట్టి చంపిరి. ఈవిధముగాఁజేసి యాదొంగలు తమతమ వీర్యశౌర్యపౌరుష ములను వర్ణించుకొనుచు నానందించుచుండిరి. నాయెడ లంతయును

వడఁకిపోయెను. అప్పుడు వారిని దుర్మార్గులైనగొంగ లని తెలిసికొం టిని. నాకేమియుందోఁచక కింకర్తవ్యతామూఢుఁడనై యక్కడనే కూరుచుండి వారు చెప్పుకొనుచున్న మాటలను వినుచుంటిని. ఆసమయమందొక భయంకరాకారుఁడగు చోరుఁడు వచ్చి యాకస్మికముగ నాపైఁబడి పట్టుకొని "నీవు మేము మాటలాడుచున్న దంతయును వింటివా? లేదా? నిజము చెప్పుము" అనియెను. నే నేమని చెప్పను! ఆతఁడు రెండవమాట వినకయే నన్ను తీసికొనిపోయెను. నే నేమియు చేయఁజాలక యాతనితోడనే పోయితిని. నేను పోట్లాడినయెడల నాతని చేతియందున్న కత్తితో సులభముగ నాతఁడు నన్ను నఱకివైచి యుండును. నన్ను వారిగుంపులోనికిఁ దీసికొనిపోయెను. వారిలోనొకఁ డిదియేమని యడిగెను. ఆతఁడే రహీమనువాఁడు నన్నుఁ దీసికొనిపోయినవాఁడు జరగిన వృత్తాంతమంతయును చెప్పెను. రహీము "వీనిని జంపి పారవేయుఁ" డని యాజ్ఞాపించెను. తోడనే యిద్దఱు ముగ్గురు వచ్చి తమతమ కత్తులను నాతలపై కెత్తిరి. నే నేడ్చుచు "నేఁ జెప్పినమాటలను విన్నతరువాతఁ జేయవలసినట్లు చేయుఁడు" అంటిని. రహీము "చెప్పుము" అనియెను. "నేను మీమాటలన్నిటిని విన్న మాట నిజము. కాని వానిని ప్రచురముచేయనని ప్రమాణము చేసెదను" అంటిని. రహీము "మేము దానిని నమ్మము" అనియెను. "నేను తిరిగి యింటికిఁ బోవను. మీరు చెప్పినట్లు చేయుదును. మీవాఁడనై యుందును" అంటిని. రహీము చాలసేపు యోచించి "నీవు మాతోడనే యుండవలయును. మేము చేసినట్లు చేయవలయును. మేము పోయినచోటికిఁ బోవలయును. మామతము వారివలెనే వస్త్రములను ధరింపవలయును. నీదుస్తులను విసువవలయును. ఇందులకంగీకరించితివేని నీవు బ్రతుకఁగలవు" అనియెను. నే నవశ్యముగ నంగీకరించితిని. అదిమొదలు నేను దొంగనైతిని. మనసునందు వీరి నేమై

ననుచేసి వెడలిపోయి భద్రముగ నుండవలయునని కోరుకొనుచుంటిని. వారు మొదట నాకుఁ జాల వలజడులఁ గలిగించిరి. వారి చేతియన్నమును తినవలయునని పీడించుచుండిరి. అందఱు నన్నుఁ దిరస్కరించుచుండిరి. కాని స్వల్పకాలముననే నేను కపాలకుండల నగలను సులభముగాఁదెచ్చినమీఁదట నాకష్టములు గట్టెక్కెను. వారియందెవ్వరికిని తెలివిలేదు. నాయాలోచనములవలన వారి యనేకకార్యములు నెఱవేఱినవి. అందువలనఁ గ్రమముగా వారిలో నాయధికార మతిశయించెను. నే నిప్పు డనాయాసముగ నింటికిఁ దిరిగి రాఁగలను. కాని యందువలన నరిష్టమేగాని నాతలంపు పూర్తిగ నెఱవేఱఁబోదు. వారు బలవంతముగ నావృత్తాంతమంతయును బాగుగఁ దెలిసికొనియుండిరి. నేను పారిపోయివచ్చుట కవకాశమే లేదు—నన్ను వారెవ్వరును దొంగగా నుంచుటలేదు. ఆకారణముచే నేను పారిపోవుటకుఁ బ్రయత్నింపలేదు. క్రమముగా దొంగల నీతిరీతు లన్నియును దెలిసికొంటిని. వారి హృదయభావము లన్నియును నాకుఁ దెలియును. ఇప్పుడువిడివడివచ్చి యధికారుల కీసమాచారము నీయవలయునని యోచించితిని. ఆకార్యము చేయక యూరకుండను. ఎందులకంటే రేని—ఒకటి రెండుదినము లాలస్యమైనయెడల వారలను తప్పించుకొని పోవ్రమరని తోచుచున్నది. ఈసమయమందు నేను వీరికంటకు మఱియొకయుపాయము ను వెదకెదను. నేదొప్రస్తానముమీఁద మాయూరు సప్తగ్రామముల ద్దనున్న గోపాలపుర మని చెప్పక మేవనిపురసమీపముననున్న గోపాలపుర మని చెప్పితిని. వారికి నట్టే నమ్మక మున్నది. నన్ను వారందఱును గౌరవించుచుందురు. ఇప్పుడుమాపతియొక్క కోరిక తీరినది. నేను మిమ్ములను బాగుగ నెఱుఁగుదును. అప్పుడు దొంగలగుంపునందు పేఁగా నుమాపతి నన్ను గుఱుతించునేమోయని భయపడితిని. ఉమాపతీ! నీవునన్ను పట్టింపలేకపోయితివి. తప్పించుకొనిపోవుట కిదియొక

ఇట్లు చెప్పి గోపాలుఁడు ప్రత్యుత్తరము నిరీక్షింపకయే వెడలి పోయెను. ఉమాపతి యాతనివలన నింకను వినవలయు ననితలంచెను కాని, యట్లు కాలేదు. ఆతఁడును నవకుమారుఁడును చిత్రప్రతిమల వలెఁ గూర్చుండిరి—

---

## ముప్పది ఏడవ ప్రకరణము

### రోగిపార్శ్వము

"Causa letet visest notisima"

Ovid.

నవకుమారుఁడు, ఉమాపతి,పద్మావతిమొదలగువారందఱును సుఖముగాఁ గాలముఁ గడుపుచుండిరి. గ్రీష్మకాలము పోయి వర్షావసరము వచ్చెను. వర్షఋతువు గడచి శరదాగమము సమీపించెను. శరత్కాలము జరిగిన పిదప హేమంతమును వెడలిపోయెను వారందఱు నానందముచే నెల్లఋతువును గడపిరి. సంసారమందు సుఖమనునది యున్నయెడల వారు సుఖవంతులై యున్నవారనియే చెప్పవలయును. కాని ప్రపంచమందు సుఖమనునది యెంతకాలము స్థిరముగానుండఁ గలదు? ఎవరు తాము చిరకాలము సుఖ మనుభవించితిమని చెప్పుకొనఁగలరు? ఎవ్వరట్లు చెప్పఁగలరో యట్టివారికి దుఃఖమను నదియే తెలియదనియును, అట్టివారు సుఖముఖమునే చూడరనియును చెప్పవచ్చును. వారు సుఖమనునది యేమో తెలియఁజాలరనికూడఁ జెప్పఁగలము. వారికి సుఖమందు సుఖములేదు. వారెప్పుడును నసుఖులై యుందురు. ఎవ్వరైన నెప్పుడును మృష్టాన్నమే భుజియించుచున్న యెడల నట్టివారికి కొలఁదిదినములలో నం దలి రుచియే తెలియకుండఁబోవును. అదిసదుపాయమైనదేయని చెప్ప

జాలము, సామాన్యశాకాహారముల భుజియించువాఁడైన నొకొ్కక్క దినమున నట్టిమృష్టాన్నమును గొవినయెడల నాతఁడు దాని రుచిని దెలిసికొనుటకు సమర్థుఁడగును. ప్రపంచమునం దెల్లకార్యములందును సుఖమున్నది. అన్నిటివలనను సుఖములేదు. నేఁడే కార్యము పరమసుఖకరమైనదని నమ్మియుయుందునో తరువాత నా కార్యము పదిదినములు చేసినయెడల నందు విరక్తి జనియించి యసుఖమునకుఁ గారణ మగుచున్నది, సుఖలక్షణమును నిర్ణయించుట గాని, లేక దేనియందు సుఖమున్నదో నిర్ణయించుటకుగాని మనకు శక్యమైనపని గాదు. ప్రపంచమందు సుఖమున్నదో లేదో, మేము చెప్పఁజాలము మాకుఁ దెలిసియున్నంతవఱకు జను లేదేదానిని సుఖమని పరిగణింతురో ఆయావిషయమున నిది యిట్టిది. ఇది యిట్టిది కాదు'' మాత్రము చెప్పఁగలము. మనుష్యుఁ డాశాపాశమున బద్ధుడై క్రమముగా సుఖప్రయత్నమునఁ బ్రవేశించును. కాని యది చేఁజిక్కినఁ జిక్కును—లేకున్న లేకపోవును. సుఖ ప్రకృతియే యిట్టిది. ఈదారుణ యాతనా పూరిత మగు సంసారమందు మనుష్యుఁ డొకానొక సమయమున దుఃఖవిషయముల నన్నిటిని మఱచి యానందించుచుండ సుఖమనునది యున్నయెడల నాయానందమే సుఖమని చెప్పెదము. అయినను ఆసుఖ మెంతసేపు స్థిరముగా నిలువఁ గలదు? జగత్తునం దెవ్వరి హృదయ మొక ముహూర్తకాలమైనను దుఃఖకష్టములచే మథింపఁబడ కుండును? సంసారవిరక్తులను పుణ్యాశ్రమనివాసులను తపస్వులును, యతులను గూడ సంసార మందలియాతను పొందియుందురు. మాతృగర్భమునుండి వెడలిన తోడనే యెవ్వరు నెప్పుడును సన్యాసులై యుండలేదు, సాంసారికము లగు దుస్సహ క్లేశముల ననుభవించి పిమ్మట సుఖము కొఱకు సంసారమును త్యజించి వేయుదు రనుటకు సందేహములేదు. అట్లే

గావుననే సంసారమం దెవ్వరును చిరతరానందులై యుండుట లేదు. రోగము, శోకము. అభావము, మానము, యశస్సు, ఆకాంక్ష మొదలగు నానావిధకారణములచే మనుష్యుఁడు నిరంతరము నిరానందుఁడై యుండును. వీరి కెప్పుడైనను ఏదైన నానందమున్నయెడల నది క్షణికమాత్రమై యుండును. నవకుమారుఁడు మొదలగువారంద ఱు నాక్షణకాలికానందముచేతనే యానందించుచుండిరి. కాని, యానందము చిరస్థాయియై యుండునది కాదు. ఆతని యానందమునకు విఘ్నము కలిగినది. పద్మావతి రోగపీడితురాలయ్యెను. పాఠకమహాశయా! రమ్ము! పద్మావతికెట్లున్నదో చూచివత్తము.

పద్మావతి వ్యాధిగ్రస్తురాలై నాల్గుదినములైనది. ఆవ్యాధి సామాన్యమైనది కాదు—జ్వరము—కాని, బలమైనజ్వరము—ఎందుకోఁటకు పద్మావతి కింతకఠినమైనజ్వరమువచ్చినదో యితరులకుఁదెలియదు.ఎప్పుడెందుకోఁటకు జ్వరము వచ్చినదో దానినిగూర్చి చెప్పుటకు వలనుపడదు. ఏదోశారీరకనియమోల్లంఘనమై యుండవలయును. కాకున్నయెడల నిందుల కేమికారణము? నవకుమారుఁడు జ్వరమున కేమికారణమని పద్మావతి నడిగెను. కాని సంతోషదాయకమగునుత్తరము రాలేదు. వైద్యుడు వచ్చి రోగిని చూచిముఖమును చిట్లించుకొనియెను. ఆతఁడు పోవునప్పుడు నవకుమారుని చెవియందు "రోగము ప్రబలమైనది. చూడఁగా సుముఖమైనదానివలె నగపడుటలేదు" అని చెప్పి వెడలిపోయెను. అది మొదలుకొని నవకుమారుఁడు చింతాక్రాంతుఁడై వాడిన ముఖముగలవాఁడై యుండెను.

పగలు రెండవజాము జరుగుచుండెను—అది పద్మావతికి జ్వరమువిడుచు వేళ—బాధపడుచు నిట్టూర్పు విడుచుచుండెను. నలుగురు పరిచారిక లుపచారములు సేయుచుండిరి. వడగాడ్పును తప్పించుకొఁటకు వాఁకిళు లన్నిటిని మూసివైచిరి. అప్పుడొకద్వారము తెరచుకొని

నవకుమారుఁడు లోపలఁ బ్రవేశించెను. అందరిదృష్టులు నాతనిపైఁబ్ర సరించెను. పద్మావతి యొకప్రక్కకొత్తిగిలి యాతని జూచెను. పద్మా వతీ నవకుమారులదృష్టులు సమ్మిళితము లయ్యెను. తోడనే యామె యధరమునందు మధురమందహాస మగపడియెను. ఆమె ముఖమున భావాంతరము తోఁచెను. అట్టియాతన—అట్టిక్లేశము — అంతయు నప్పుడే నశించిపోయెను. నవకుమారుఁ డావ్యాధిగ్రస్తురాలి శయ్యా పార్శ్వమున మెల్లమెల్లఁగఁగూర్చుండెను. పరిశీలించి చూడఁగాబద్మా వతి యీనాల్గుదినములనుండి కాయుచున్న జ్వరముచే మిగులఁ గృశిం చియుండెను. శరీరము పాలిపోయెను. కన్నులుగుంటలుపడియుండెను. ఆమె నవకుమారునిమీఁద నొకచేయి వేసికొనియెను. నవకుమారుఁ డాచేతిని తనచేతితోఁ బట్టుకొనియెను. మఱియొకచేతి నామెలలాట మున నుంచి "పద్మా! చెమట పట్టుచున్నది. ఇందువలన జ్వరము వదలుచున్నదని తోఁచుచున్నది." అనియెను.

పద్మా—విడువ వచ్చును—అయినను మిగుల కష్టముగ నున్నది.

నవ—ఇఁక నొకటిరెండుదినములుమాత్రము కష్టముగా నుం డును. ఏమిచేయును చెప్పు! తరువాత నారోగ్యము కలుగవచ్చును.

పద్మా—నవకుమారునిమొగముచూచి కొంచముగ నవ్వి ఆరోగ్యము కలుగునని మీకెవ్వరు చెప్పిరి?

నవ—ఇదేమి?—సామాన్యజ్వరము—దీనివలన భయమే మి?

పద్మా—భయమేమియును లేదు. నవకుమారా! ఏమిభయ ము! మరణమునకు భయమా? ఆభయము నాకు లేదు. నాశరీరావ స్థను నేను తెలిసికొనునట్లుగా నితరు లెంతబుద్ధిమంతులైనను తెలిసి కొనలేరు. నవకుమారా! రోగము సామాన్యమైనదనియు, నాకు వే

గనే యారోగ్యము కలుగుననియు నాశ యున్నయెడల దానిని వేగముగ విడిచిపెట్టుము.

నవకుమారుఁడు దీర్ఘనిశ్వాసమును విడిచెను.

పద్మా—మీరు దుఃఖించుచుంటిరా? నాకేమియును విచారము లేదు. మీరు పురుషులనియు నాకంటె ధైర్యముకలవా రనియు ననుకొంటిని. ఆధైర్యమువలననే నేను మీకీమాటను చెప్పితిని! ఏమైనఁ గానిండు—కావలసినది కాకమానదు. అందుకొఱకు మీరేల వికలహృదయులు కావలయును ?

పద్మావతి నవకుమారునిమనస్థితిని తెలిసికొని యామహూర్తమునుండియు రోగబాధను సాధ్యమయినంతవఱకుఁ గప్పిపెట్టుటకుఁ బ్రయత్నించుచుండెను.



## ముప్పది యెనిమిదవ ప్రకరణము



### వైకల్యము.

"మరణం ప్రకృతి శ్శరీరిణాం వికృతి ర్జీవిత ముచ్యతే బుధైః
క్షణమ ప్యవతిష్ఠతే శ్వసన్ యది జంతు ర్ననులాభవానసౌ
అవగచ్ఛతి మూఢచేతసః ప్రియనాశం హృది శల్య మర్పితం
స్థిరధీస్తు తదేవ మన్యతే కుశలద్వారతరా సముద్ధృతం"

రఘువంశము.

పద్మావతి మంచముపట్టి కొన్నిదినములైనది. రోగము క్రమముగా హెచ్చుచుండెను. నేఁడు మొదటచెప్పియున్న చికిత్సకుఁడు వచ్చి చూచిపోయెను. కొంతసేపైనతరువాత నవకుమారుఁడు గదిలోనికి వచ్చెను. ఏగదియందు పద్మావతి సుస్థిరయై యున్నయవస్థలయం

దును నానందము ననుభవించుచుండెనో, ఏగది యామెయధ్యయన రచనాచిత్రలేఖనాది ప్రియతమకార్యములకు స్థానమైయుండెనో, ఏస్థలమునందామెతనపరిచయముఁగూర్చుకొనుటకు, తనభర్తృహృదయమునందు ప్రేమను గలిగించుటకు, వివిధములైనవినయవాక్యములఁజెప్పుచు సంతోషానందములను గలిగించి తుదకాతనిపాదములమీఁదఁబడి యేడ్చినదో, మఱి యందువల్లనైనను కృతార్థురాలు కాకగర్వముతో విస్ఫురితనేత్రమై నిలిచితన్నుఁగూర్చి తెలిపికొన్నదో, ఏస్థలమునం దతికష్టము అనుతాపము మొదలగువానిచే స్వామియొక్కయనురాగరహితమైన శుష్కహృదయమును ప్రేమమయమైనదిగను, సరమైనదిగను, జేసి యాతని నాలింగనముచేసికొని యానందాశ్రువులచే నాతనివక్షమును దడిపినదో, ఏగదియందామె తనయిష్టదైవమగు నవకుమారుని స్నేహసుఖమందుఁ గొన్నిదినములుమాత్రము స్వర్గసుఖము ననుభవించినదో, ఆగదిలోనికి, ఆయామోదమయమైనగదిలోనికి-నవకుమారుఁడు నేఁడువిషణ్ణవదనుఁడై ప్రవేశించెను. ఆగదియందిప్పుడాకాంతి లేదు. ఒక్కటె కాంతివిహీనయగుటచే నంతయు—ఆగది యంతయు కాంతివిహీనమై పోయెను. రోగి శయ్యపైఁ బరుండియుండెను. పార్శ్వమునం దొకపీటపై దీపము వెలుఁగుచుండెను. కానియంతయు నంధకారమయమైయుండెను. నవకుమారుఁడు వచ్చి యాదీపపువెలుతురున నిలుచుండెను. ఆతఁడు నడిచివచ్చినశబ్దము పద్మావతి చెవిని బడియెను. ఆమె యాప్రక్కకుఁ దిరిగెను. ఇద్దఱిదృష్టులును కలిసికొనియెను. పద్మావతి నగు మొగము కలదయ్యెను. కాని, యానవ్వు ఆమెకు స్వాభావికమైనదానివలె నగపడలేదు. ఆమెయీయున్నయవస్థయందును నవకుమారుని సంతుష్టికొఱకు బలవంతముగా నవ్వెను.

నవ—పద్మావతీ! ఇప్పుడెట్లున్నది?

పద్మావతి హీనస్వరముతో "బాగుగనేయున్నది" అనెను.

పద్మావతి నిజమైనసంగతిని బయలుపఱుపలేదు. నిజమును చెప్పినయెడల నవకుమారుని మనస్సునకు విచారముకలుగునని రోగమే ప్రకారముగాఁ దన్ను దిగనార్చుచున్నదో దానిని వ్యక్తపఱుపలేదు. కాని నవకుమారుఁడు దానినంతను గనిపెట్టెను. చికిత్సకుఁడు వచ్చి పద్మావతిని చూచిపోవునప్పుడు నవకుమారునిచూచి "రోగియవస్థ సరిగా లేదు. నిన్నటి కొకవారము గడచిపోయినది. ఈవారమందు కొంచెము శ్రద్ధతీసికొని క్రమముగఁ జూడనియెడలఁ దిరిగి యపాయము కలుగుట సంభవించును. బలమైనయౌషధములను బ్రయోగించితిని. కాని, లక్షణము లేమో సరిగా నగపడుట లేదు" అని చెప్పెను.

నవకుమారుఁడు పద్మావతి శయ్యాపార్శ్వమునఁ గూర్చుండి యుండెను. పద్మావతి యెట్లో లేనిశక్తి తెచ్చుకొని లేచికూర్చుండెను నవకుమారుఁడామెను పట్టుకొనియెను. పద్మావతి కూర్చుండలేక కొంచెమొఱగి నవకుమారుని వక్షమునందు శిరము నుంచుకొనియెను. ఆమె యొకకన్ను మూసికొని మఱియొకకంటితో నవకుమారుని జూచుచుండెను. ఇద్దఱును నిశ్శబ్దముగనుండిరి ఇద్దఱిహృదయములందును దారుణమైనశోకప్రచండమారుతము తీవ్రముగ విసరుచుండెను. ఎవ్వరు మాటలాడఁగలరు ? అప్పుడు మాటలాడుటకు స్థైర్యమెక్కడిది ? నవకుమారుఁడు శోకవికలితనయనములతోఁ జూడ నారంభించెను. ఆతనిహృదయమును, మనస్సును, ప్రేమపాశముచే దృఢముగాబంధించియున్న యాసమ్మోహనమూర్తి యస్పష్టముగ నంతర్హితమైపోయినదని తెలిసికొనియెను. మఱియును పద్మావతియొక్క మనోహరవదనచంద్రమండలము వాడిపోయెను. మేనంతయు కృశించిపోయెను. కనుగొలుకులయందు కప్పు దోఁచెను. అధరమునందలికెంపుచాయ వదలి

తెల్లవడియెను. స్త్రీస్వభావసులభమై, గర్వపూర్ణోజ్జ్వలమై యున్న యామె దేహకాంతి—ఇప్పుడు మునుపటివలె నుండలేదు.

నవకుమారుని దేహమునందు రక్తము మిగుల వేగముగఁ బ్రవహింపఁజొచ్చెను. అతఁ డింక స్థిరముగా నుండలేకపోయెను. తత్తరపాటుతోఁ బద్మావతిని పట్టుకొని యామెముఖమును మాటిమాటికిని ముద్దుపెట్టుకొననారంభించెను. అతికష్టముచే నడచిపెట్టియున్న మనోదార్ఢ్యము శిథిలమయ్యెను. అందువలన నాతనికన్నులనుండి ధారాపాతముగ నశ్రువులు గురియనారంభించెను.

పద్మావతి నవకుమారునితత్తరమును జూచి కొంచెము వికలస్వరముతో—ఏడువవలదు. భయ మెందులకు ? తుద కేమగునో దాని నెవ్వరు నిశ్చయింపఁగలరు ? మీస్పర్శవలన నాబాధ యంతయును దూరమైపోయినది. నేను పవిత్రసుఖము ననుభవించుచుంటిని. మీరిప్పుడు విచారింపకుఁడు''

ఈమాటలు చెప్పుచుండఁగా పద్మావతినయనములనుండియొకటిరెండశ్రుబిందువులు వెడలి నవకుమారునివక్షస్స్థలముపైఁబడియెను. నవకుమారుఁ డున్మత్తునివలె పద్మావతిముఖమును పరికించి చూడసాగెను. చూడఁగా పద్మావతి యప్పుడును నవ్వుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆమె నవకుమారునివక్షముననున్న తనతలను తీసికొనియొక తలగడపై నుంచుకొనియెను. నవకుమారుఁడు తీవ్రశోకానలము నార్పివేయుట కెంతయో ప్రయత్నించెను. అదిసులభమైనపనియా? మాటిమాటికి దీర్ఘనిశ్వాసమును, కంపమును, తోఁచుచు హృదయము నందలి శోకావేగమును బ్రకటించుచుండెను.

చాలసేపు మౌనముగనుండి తరువాతనవకుమారుఁడు ''పద్మా! మనుష్యునిగతియే యింతటిది! అదృష్టమున కిదియే తుది! ఈస్థితిసర్వసాధారణమైనది, మరియు నప్రతివిధేయమైనది. కానున్నది కావల

చిరకాలమునుండి వచ్చుచున్న యీనియమప్రభావముచేత పద్మావతి నోటినుండి యట్టిసాహససూచకములైనమాటలు వెడలినవి. నవకుమారుఁడు పద్మావతి మాటలనుగూర్చి బాగుగ నాలోచించుచుండెను.

## ముప్పదితొమ్మిదవప్రకరణము

### పరితాపము.

ఆసన్నమైనయాపద యనివార్యమైనదని తెలిసికొని నవకుమారుఁడు దుఃఖముచేఁ గ్రుంగిపోయెను. పద్మావతి లేచి కూర్చుండుటకు గూడ దార్ఢ్యముచాలని దయ్యెనని తెలిసికొనియెను. అందువలన గలిగినయీయశుభసంఘటనముకొఱకు మిగుల వ్యాకులపడియెను. పద్మావతియొక్క సహవాసముచే నవకుమారుఁ డెల్లవిషయములందును శాంతిననుభవించుచుండెను. ఆతఁడు మిగిలినయెల్లవిచారములను కష్టములనుగూడ నీసుఖానుభవముచేమఱచిపోయెను. ఆపద్మావతి తనహృదయమును వశపఱచుకొని మోహింపఁజేసి విరక్తిజనకము లగు తన యభిప్రాయములను దొలఁగించి యానందింపజేసి యింతటి స్వల్పకాలముననే యీభూలోకమును విడిచిపోవుచున్నదని యాతఁడు మిగుల విచారించుచుండెను.

పద్మావతి యాస్థితియందుండఁగా నవకుమారుఁడు చూడలేక మఱియొకగదిలోనికిఁ బోయి యక్కడ నేమో యోచించుకొనుచున్నవానివలె నూరక తిరుగుచుండెను. కొంచము చలిగాలి వీచుచున్నను నవకుమారుఁడు గవాక్షముకడకుఁబోయి యేమియును తోఁచక కిటికీతలుపులను తెఱచెను. చల్లని యారాత్రియందు స్వభావసిద్ధమైనయంధకారముచే నావరింపఁబడిన రాజవీధి యెదురుగ నగపడెను

ఆవైపుననున్న కొన్ని చిన్నచిన్న యిండ్లా చీఁకటియందు స్థూలాకృతులతోఁగానవచ్చుచుండెను. వాని కవ్వలివైపున నొకపెద్ద బయలుండెను. అక్కడనున్న వృక్షములును, మార్గమందున్న యిండ్లును గూడ నాగాఢాంధకారమున నొకేవిధముగ గానవచ్చుచుండెను. ఆ గవాక్షమునకు సమీపమున నొక మంచమున్నది. నవకుమారుఁడు గవాక్షమువైపు మొగముంచుకొని యామంచముపై గూర్చుండి యుండెను. అతని శరీరమందలి దుస్తులు నొక్కొక్కటిగఁ దీసివేయుచుండెను. అయినను శరీరము చల్లనగుట లేదు. ఆకారణమువలన గవాక్షద్వారమున కెదురుగఁ దనవక్షమునందుంచుకొని కిటికీకమ్ములపై ముఖము నాను కొనియెను. రివ్వురివ్వునఁ జల్లనిగాలి వచ్చి యాతని వక్షమున సోకుచుండెను. కాని యేమాత్రమును శరీరము చల్లఁబడ లేదు—విభ్రాంతుఁడా! ఏమిచేయుచుంటివి! ఇంతసులభముగాఁ జల్లనగునా! ఈపరితాపము గాలి, నీరు, మంచుగడ్డ మొదలగుశీతలపదార్థసేవనమువలనఁ జల్లఁబడునది కాదు—నవకుమారునియప్పటి మానసికావస్థ యతిభయంకరమైయుండెను. అప్పు డతఁడనిత్యమైన ప్రపంచముయొక్క యనిత్యతనుగూర్చి యాలోచించుచుండెను. గవాక్షము వెలుపల నున్న ఘోరాంధకారమును భేదించుకొని దృష్టిపోయి నంతదూరము చూచుచుండగా రోగము, శోకము, మరణము మొదలగునవి యనేకాకృతులతోఁ దిరుగుచున్నట్లు కానఁబడుచుండెను. ఆతని మనస్సు ఈవిధమైనవిచారమందు మునిఁగియుండఁగా మఱియొకరెవ్వరో యాగదిలోఁ బ్రవేశించిరి. నవకుమారుఁ డదియేమియును చూడలేదు. ఆగంతుకుఁడు మెల్లమెల్లగ నవకుమారునియొద్దకు వచ్చి యాతనిభుజముపైఁ జేయివైచెను. నవకుమారుఁ డులికిపడియెను. ఆతడు వికలహృదయుఁడై యాగంతుకుని ముఖము చూచెను. ఆతఁడు మూపతియై యుండెను.

ఉమాపతి—అన్నా ! ఏమియాలోచించుచుంటివి? మనకసాధ్యమైన భవిష్యద్విషయమును గూర్చి విచారించుట మూఢులపనియై యున్నది.

నవ—కాదు. నేనట్టి మూఢుఁడను కాను. నేను మఱియొక యాలోచనమునం దుంటిని. ఈప్రపంచ మనిత్యమైనది. ఇక్కడ నెవ్వరును చిరకాల ముండుటలేదు. మనుష్యదేహములయొక్క యస్థిరత్వము, ప్రపంచముయొక్క యనిశ్చితత్వము, అనువానింగూర్చి ప్రతిదినము ననేకదృష్టాంతములను చూచుచున్నను ఏదో యొక మాయ వచ్చి యావరించికొని వానినన్నిటిని గప్పివేయుట యాశ్చర్యముగ నున్నది. దీనికుదాహరణముగ నామనస్సునం దెన్నిమాఱు లీవిషయములు తోఁచలేదు? అయినను ఆజ్ఞానము రెండుదినములైనను మనస్సునందు స్థిరముగా నుండుటలేదు.

ఉమా—ఇది పరమేశ్వరుని సృష్టినైపుణ్యము—మనుష్యుఁడిట్టి మాయకు లోఁబడకపోయినయెడల సృష్టికిభయంకరమైనయవస్థ తటస్థించును. ఎట్టిదురంతమైనయవస్థ కలుగునో దాని నూహించుట కూడ యసాధ్యము. అది యేమైనను గానిమ్ము—ఇప్పుడు పద్మావతి యెట్లున్నది ?

నవ—(దీనవదనుఁడై) నేనిప్పుడు పోయి యామెను చూడలేదు.. ఇఁకఁ జూచుట కేమున్నది? పద్మావతియొక్క జీవితమునుగూర్చి యందఱికి నాందోళనముగ నున్నది. ఇట్లు చెప్పి—నవకుమారుఁడు నిట్టూర్పు విడిచెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము

## ఆరిపోవుచున్న దీపము.

"పతిరంకనిషణ్ణయా తయా కరణాపాయవిభిన్నవర్ణయా
సమలక్ష్యత బిభ్ర దావిలాం మృగలేఖా ముషసీవ చంద్రమా."

రఘువంశము.

కాలయముఁడు క్రమముగాఁ బద్మావతి జీవితాపహరణము నకు చేయుచున్న యుపాయములను విస్తరించి వర్ణించుట చాలకష్టతరమైనపని. మేము వానినన్నిటిని వ్రాసిచెప్పఁజాలము. నవకుమారుఁడు పగలంతయు రోగిపార్శ్వమునందుఁ గూర్చుండియుండనిదిన మొక్కటియును లేదు. అయినను దినదినమును నిరాశ హెచ్చుటతప్ప యాశ గలుగుట లేదు.

చూచుచుండఁగనే పదునేడుదినము లయ్యెను. పద్మావతియవస్థచూచుటకు మిగుల భయంకరముగనుండెను. వైద్యులందఱు నీదినమే యామె గతించునని స్థిరపఱచిరి. సాయంకాలమందు నవకుమారుఁడు రోగిగదిలోనికిఁ బోవుసరి కామె నిద్రపోవుచుండెను. ఆతఁడు మెల్లమెల్లగ నక్కడనుండి వెలుపలికి వచ్చి యాప్రక్కనున్న గది లోనికిఁబోయెను. అక్కడ నొకవైద్యునితో "రోగి పడుండియున్నది. ఒకసారి పోయి చూచినయెడల మంచిది కాదా?" అనియెను.

వైద్యుఁడు పోయి రోగిని చూచివచ్చెను. నవకుమారుఁడు ఎట్లున్నదని యడుగఁగా వైద్యుఁడు "నాడిని బట్టిచూడఁగా రాత్రి ప్రథమయామాంతమందు పద్మావతియొక్క జీవనము తుదముట్టునట్లు తోఁచుచున్నది" అనిచెప్పెను.

నవకుమారుఁడునిట్టూర్పువిడిచెను. దానితోఁగూడకన్నులనుండి యశ్రువులును వెడలెను. వైద్యుఁడు వెడలిపోయెను. నవకుమారుఁడు రహస్యముగఁ గూర్చుండి తన యదృష్టమును గూర్చి యాలోచించు కొనుచుండెను. పద్మావతియొక్కయు, తనయొక్కయు, నదృష్టమును గూర్చి యాలోచించుచుండఁగా నాతనిహృదయము బ్రద్దలై పోయెను. కాని, విచారముమాత్రము పోలేదు. కొంతసేపటిలోనే యొకపరిచారిక వచ్చి పద్మావతికి నిద్రాభంగమై దానితో రోగముకూడ హెచ్చెయ్యె నని చెప్పెను. నవకుమారుఁడు "నీవుపోయి వైద్యునకుఁ దెలియజేయుము. నేను పోయి చూచెదను" అనియెను.

నవకుమారుఁ డతిత్వరితముగ పద్మావతిగదిలోనికిఁ బోయెను. పోవునప్పు డాతనికాళ్లు వడఁకసాగెను. గుండెదడదడ యతిశయించెను. దారుణమైన భయము హృదయమునఁ బ్రవేశించెను.

పద్మావతి ప్రణయముచేతను, స్నేహముచేతను, పరిపూరితమైయున్న నగుమొగముతో నవకుమారునిమొగమును పరికించిచూచెను. నవకుమారుఁడు సమీపించి శయ్యాపార్శ్వమునఁ గూర్చుండెను. పద్మావతి మెల్లమెల్లగ "ప్రాణేశ్వరా!" అనిపిలిచియాతనిచేతిని పట్టుకొనియెను. కొంతసే పూరకుండి తరువాత తిరిగి "ప్రాణేశ్వరా! నీకు చాల చెప్పవలయునని యాశయున్నది. కాని, యిప్పుడేదియును జ్ఞాపకమునకు వచ్చుట లేదు. మీరునాయం దపారమైనయనుగ్రహమును చూపించితిరి. నేనంతటియనుగ్రహమునకు పాత్రురాలనుకాను. కాని, మీరనుగ్రహించితిరి. దానికిఁ దగినట్లు నేను మీయందు కృతజ్ఞురాలనై యుండుటయసంభవము. దానికంతయావశ్యకమునులేదు. మీరు నన్ననుగ్రహింపకున్నయెడల నీక నెవ్వరనుగ్రహింతురు? మీవిధాయకకృత్యమును మీరొనర్చితిరి. కాని, మందభాగ్యురాలనగు నేను నా జీవితమునందు మీకు సంతోషకరమైన యొకపనినైనను చేయలేకపో

యితిని. ఎప్పుడు మీసుఖమునకొఱకు నేను ప్రయత్నించితిని? మీరు అటువంటి నాయపరాధములనన్నిఁటిని క్షమించితిరి. మండిపోవుచున్న నాహృదయమును చల్లఁజేసితిరి. మీయుదారగుణములకవధిలేదు—లెక్కలేదు—కాని నేనేమో పోవుచున్నాను. మీయనుగ్రహమునకుఁ బ్రతిగనేమైన నణుమాత్రమును చేయనైతిని. మీరీపాపాత్మురాలికిఁజేసిన హితమునకు మారుగఁ బ్రత్యుపకారము నించుకయు నాశింపలేదు—అయినను అదినాకు సాధ్యమైనదియునుగాదు. నాకు సాధ్యమైనను, కాకపోయినను భగవంతుఁడు తప్పక మీగుణములకుఁదగిన ప్రత్యుపకృతి చేయఁగలఁడు. ఆతఁడు మీకు విధాయకముగ శుభము నిచ్చుఁగాక'' అని చెప్పుచుండఁగా నామెకన్నులనుండి యశ్రుబిందువులు వెడలుచుండెను. నవకుమారుఁడు విశేషపరితాపముచేతలవంచికొని యన్నిమాటలను వినుచుండెను. ఆకస్మికముగ నాతఁడు తలను పైకెత్తెను. ఇద్దఱి చూపులును కలిసికొనియెను. నవకుమారుఁడు కన్నీటి నాఁపలేకపోయెను. ఆతఁడు పద్మావతిచేతినెత్తి తనకన్నులపై నుంచుకొని యేడువఁదొడఁగెను.

ఈసమయమందు నలుగురువైద్యులు లోనికి వచ్చి రోగియవస్థను పరిశీలించిరి, వారందఱు నాలోచించుకొని వారియం దొకఁడొక పాత్రయందు నీరుపలెనున్న యొకానొకయౌషధము నుంచి దానిని నవకుమారునిచేతి కిచ్చి యాతనిచెవిలో "వెంటనే రోగికి మూర్ఛరానైయున్నది. ఆమె కీయౌషధము నీయవలయును. మేమీసమీపమునసే యుండెదము. దానివలన నేమియు లాభము లేనియెడల మాకు వర్తమాన మంపవలయును'' అనియెను.

వైద్యులు వెడలిపోయిరి. నవకుమారుఁడు గద్గదస్వరముతో జాలకష్టముమీఁద "ప్రియా! పద్మావతీ! నాయదృష్టము మిగుల చెడ్డది. నేను నిన్ను—''

పద్మావతి యామాటను వినకయే కష్టముతో "నవకుమారా నాకు చాల బాధగ నున్నది—నేనింక నెన్నోనిమిషము లీలోకమున నుండఁజాల నని తోచుచున్నది. నాకాలుసేతులు నాగికొనిపోవుచు న్నవి" అనియెను.

నవకుమారుఁడు భయముతోఁ బద్మావతిని పరిశీలించి చూచు చుండెను. పద్మావతి భ్రూమధ్యము విస్తృతమయ్యెను. కన్నుగ్రుడ్డు నుమీఁదికిఁ బోయెను. తల వఁడకుచుండెను. చూచుచుండఁగానే చైతన్యము పోయి నవకుమారునిసమీపమున సోలి యొక్కప్రక్కగా బడిపోయెను. నవకుమారుఁడు చాలఁ దత్తరముఁ జెంది యొకచేతితో బద్మావతితలను పట్టుకొని మఱియొకచేతితో నిదివరకు వైద్యు లిచ్చి పోయినయౌషధము కొంచెము కొంచముగ నామెనోటిలోఁ బోయు చుండెను. అతిప్రయత్నముచే నతికష్టముమీఁదఁ జాలసేపటికి ద్రవరూ పముననున్న యౌయౌషధము కొంచెము లోపలికిఁబోయెను. సిద్ధౌ షధ మెంతగావలయును! అది దానిపని చేసినది. కొంచెముకొంచెము చైతన్యము కలుగఁజొచ్చెను. కొంతసేపటిలోననే తెలివివచ్చెను. తోడనే యుమాపతియును వైద్యులును లోపలఁ బ్రవేశించిరి.

వైద్యులు ముందుగా రోగియొక్కయు, రోగముయొక్కయు లక్షణములను బాగుగఁ బరిశీలించిరి. తరువాత నొకప్రక్కకుఁబోయి నవకుమారుని చెవియందు "ఇఁక నొకగంటసేపటికి పద్మావతికి మఱి యొకసారి మూర్ఛ రాగలదు. ఆమూర్ఛనుండి మఱి తెలివివచ్చుట కష్టము, దానితోడనే పద్మావతిప్రాణములుపోవునని తోచుచున్నది" అనిచెప్పిరి.

నవకుమారుఁడు నిట్టూర్పువిడిచి, రోగియొక్కసమీపముననే గూర్చుండి యుండెను. పద్మావతి యాతనిముఖమును తదేకదృష్టితో జూచి కన్నుల నీరు పెట్టుకొనియెను. కొంచెముసే పూరకుండి తరువాత

"జీవితేశా! నవకుమార! (మఱి మాట్లాడలేక కొంతసేపటికి మరల) నీకు-అనేకములైనమాటలను చాలసారులు చెప్పియుంటిని—(నిస్తబ్ధయయ్యెను.) మఱి చెప్పవలసినమాటలు లేవని తోఁచుచున్నది— కాని—ఇఁక నొక్కటే మాట—చెప్పెదను—నేను చెప్పినదానిని—మనస్సునందుంచుకొనవలయును—అదియే—నాకడపటివిన్నపము—అది విధాయకముగ జరిగింతు నని యభయ మీయవలయును—ప్రాణేశ్వరా! వినుము—ఇఁక ముందు—కపాలకుండల—(కంఠస్వరము రుద్ధ మయ్యెను.)కొఱకు—సాధ్యమైనంతవఱకు వెదుకప్రయత్నింపుఁడు—(కొంచెమునే పాఁగి) అట్లుచేయుట కంగీకరించితిరేని—నేనేమో చచ్చిపోవుచునే యున్నాను—అయినను—ఇట్టియవస్థయందుగూడఁ—గొంతఱకు శాంతిని వహించి—సుఖముగాఁ బ్రాణములను విడువఁగలను—ఇఁక—ముందు—మఱి—యేమియును—చెప్పఁజాలను—ఆ—యూ—ప—"

పద్మావతి మఱి మాటాడలేకపోయెను. ఆమె కేదోయనిర్వచనీయమైన యాతని సంభవించెను. చాల నలఁగిపోవుచుండెను. నవకుమారుఁడు కన్నీరు విడుచుచు "ప్రియా! నీసుఖముకొఱకు నేను విషపానముచేయుటకైనను సిద్ధముగ నుంటిని. అట్టిస్థితిలో నీవు నన్నుఁ గోరినది సామాన్య ప్రార్థనము. అట్లే చేసెదను" అనియెను.

అప్పు డందఱును చూచుచుండఁగనే పద్మావతికి మొదటివలెనే మూర్ఛవచ్చులక్షణములు కనుపట్టెను. ఆమె యతికష్టముచే ఖిన్నకంఠయై "ఇఁక నాలస్యములేదు—నవకుమారా! జీవితేశ్వరా! స్వామీ! నాకు సెలవిమ్ము—నేను—ఈజన్మ—

పద్మావతికంఠము రుద్ధమయ్యెను. ఇంకను వాక్యము పూర్తికాలేదు. మాట నిలిచిపోయెను. దుఃఖపూరితహృదయుఁడైన నవ

కుమారుఁడు గద్గదస్వరముతో "భయములేదు, భయములేదు" అని యామె శిరస్సునుతనతొడఁపై నుంచికొనియెను. అప్పటికప్పుడే పద్మావతిచేష్ట లుడిగిపోవుచుండెను. స్మృతి తప్పిపోవుచుండెను. ఆమెకను దమ్ములు ముకుళించుకొనిపోవుచుండెను. అయినను బలవంతముచే నామె నవకుమారు నెట్లో తదేకదృష్టితోఁజూచుచుండెను. ఒకటిరెండు నిమిషములలో నామెయాశలు తీరిపోయినవి. కన్నులు మూసికొనిపోయినవి. అంత్యకాలము సమీపించెను. ఇట్టియవస్థలోనుఁడియు పాపము! పద్మావతి బలవంతముగా మఱియొకసారి మాటాడవలయునని యెంతో ప్రయత్నము చేసెను.

"న——వ——"అని యెట్లోపలికి ముందుమాట చెప్పలేకపోయెను. ప్రాణావసానసమయమున సామాన్యముగఁదోఁచులక్షణము లన్నియు నామెయెడఁ గన్పట్టుచుండెను. ఆమె యప్పు డొకటిరెండు సారులు ప్రేళ్ళనల్లలాడించెను. దానియర్థము నెవ్వరుచెప్పఁగలరు ? మూఁడుసారులు నిశ్వాసమువలన నోరు తెఱవఁబడియెను. పద్మావతి దేహపంజరమునువిడిచి యామె జీవనవిహంగమ మెగిరిపోయెను. ఆ వికృతిమైన పవిత్రభావముతో పద్మావతి తనజీవితనాటకముయొక్క కడపటియంకమును సంపూర్ణముగఁ బ్రదర్శించెను. ఆమె యతిప్రయత్నముచే సంపాదించుకొన్నదియు, ఆమెయాదరమునకుఁ బాత్రభూతమైనదియు, ఆమె ప్రాణమానధనస్వరూపమైనదియు నగు నవకుమారుని పవిత్రనామము ఆమెజీవితమునకుఁ గడపటిమాటమై నిలిచిపోయెను. జీవనవిహీనమైన యామె యుత్తమాంగము సుఖమయమైన యాధానముండి జారి పడిపోయెను. సూర్యదేవుఁ డపరసముద్రమునఁ బడిపోయెను. ఆతనితేజముతోఁగూడఁ బద్మావతి తేజోమయమైన యాత్మప్రదీపమును ఆరిపోయెను. ఆజీవితమునందా మెకు సుఖముకలు

గలేదు. సుఖసంపాదనమునకై యామె చేసినప్రయత్నము లన్నియు నట్లేయుండెను. పాపమామె యొక్కసంవత్సరముమాత్రము కొంచెము సుఖ మనుభవించెను. ఆసుఖమున కిదియే కడపటిదినము. అదియును ముగిసిపోయినది.

---

## నలువది యొకటవ ప్రకరణము

### మూర్ఛావస్థ.

"He turned to the left-he is sure of sight,
There sat a lady youthful and bright."
Byron.

పద్మావతి లోకాంతరగతురాలయి మూఁడుపక్షము లయినది. కాలనగంజికి దక్షిణపుదిక్కున నున్నయొకమార్గముగుండ గంగామధ్యమునుండి యొకపడవ యుత్తరముగాఁ బోవుచుండెను. అదిపుష్యమాసము. రాత్రివేళ. దారుణమైన యంధకారమును, దారుణమైన చలియును గలిగి యుండెను. పడవయందున్నవారు చలిబాధ కోర్వలేకుండుటచే పడవ నొడ్డునకుఁ జేర్చి కట్టివేసిరి. తెల్లవారినతరువాత లోపలినుండి యిరువురుమనుష్యులు బయటికి వచ్చిరి. అందొకఁడు నవకుమారుఁడు. మఱియొకఁడు ఉమాపతి. పడవ నెక్కడఁ గట్టివైచిరో, ఆప్రదేశ మెక్కడకుఁ జేరువ నున్నదియో, రాత్రివేళ తెలిసినదికాదు. ఇప్పుడుచూడఁగా నెదుట నొకరమణీయమైన గ్రామము కాన్పించుచుండెను. వారావిషయమునుగూర్చి మాటలాడుకొనుచుండిరి.

ఆప్రసంగముతోనే వారిద్దఱును పడవనుండి బయటికి వచ్చిరి. ఒకొక్కక్కయడుగు ముందునకు వేయుచు వచ్చుచుండిరి. స్నానముచే

సిపోవుచున్న యొక బ్రాహ్మణు నాదారియందుఁ జూచి "స్వామీ! ఈయూరు పేరేమి?" అని యడిగిరి.

బ్రాహ్మణుఁడు—ఇది యశిపురము.

యశిపురమని వినినంతమాత్రమున నవకుమారుఁ డులికిపడి యెను. ఆభావముచాలసే పుండలేదు. అంతయును. మఱచిపోయెను. క్రమక్రమముగా వారాతీరమును వదలి మార్గములోనికి వచ్చిరి. ఈ మార్గ మాయూరిలోనికిఁ బోవును. ఆదారినిబట్టి కొంచెము దూరము పోయినమీఁదట నూరిలోనికి పోయి చూడవలయు నను నుద్దేశముకలి గెను. ఏమేమో మాటలాడికొనుచుఁ బరధ్యానముగా నిద్దఱును చాలదూరము పోయిరి. అచ్చట నెదురుగా నున్నయొకగృహము వారి దృష్టుల నాకర్షించెను. ఇట్టి సామాన్యమైనగ్రామమునం దట్టిగృహ మున్నందుల కందలి ప్రజలు గర్వపడవలసినదే. వారిద్దఱు నాయింటిని వింతగాఁ జూచుచుండిరి. నవకుమారుని చూపు లామేడగదిలోనికిఁ బోయెను. అప్పు డుమాపతిదృష్టి మఱియొకచోట నుండెను. నవకుమారుఁడు చూడఁగా—జడలుగట్టియున్న కుంతలములుగల యొక సుందరీమణి తదేకదృష్టితో పార్శ్వమునందున్న యుద్యానవన రామణీయకమును దిలకించుచుండెను. ఆరమణీమణి ముఖమండలమునందలి యొకభాగముమాత్రము నవకుమారునికన్నులఁ బడియెను. ఉన్న ట్లుండఁగా నాతరుణీమణి హృదయమునం దేదియో భావాంతరము కలిగెను. తోడనే యాయువతీరత్న మాప్రదేశమును వదలి వెలుపలికిఁ బోయెను. అట్లు పోవుచుండఁగా నామెమనోహర వదనచంద్ర మండలము సంపూర్ణముగ నవకుమారునిదృష్టి పథమున బడియెను. అంతమాత్రమునకు సంతుష్టి కలుగ లేదు. ఆతనిహృదయమం దేదియో యొకవిధమైనయగ్ని రగులుకొనియెను. ఆ దారుణానలప్రతాపము నెవ్వఁడు సహింప గలఁడు? చైతన్యశూన్యమైననవకుమారునిశరీ

రము మొదలు తెగినవృక్షమువలె నేలపైఁ బడిపోయెను. ఆకస్మికముగా నింతటిదురవస్థకు లోనైన నవకుమారుని జూచి యుమాపతి మిగుల వ్యాకులపడియెను. నవకుమారునకు స్మృతికలిగినఁగాని యిట్టి యవస్థయెందువలనఁ గలిగినదో తెలిసికొనుట యసాధ్యము. అదిగాక యాతనికి తెలివివచ్చువఱకు వేచియుండుటయును సరికాదని యాతనికిఁ దోఁచెను. ఆకారణముచే నుమాపతి యొకబండి తీసికొని వచ్చి చైతన్యహీనమైన నవకుమారుని దేహము నాబండిపై నుంచుకొని పడవలోనికిఁ గొనిపోయెను.

ఆనాఁటిసాయంకాలమునకు పడవ నవద్వీపమునకుఁ బోయెను ఇంతసేపటివఱకు నవకుమారునకు నడుమనడుమ స్మృతికలుగకపోలేదు ప్రతినిమిషమునకును తెలివినంది యాతఁ డేమేమో కలవరించుచుండెను. దానియర్థముమాత్ర ముమాపతికిఁ దెలియలేదు. అట నవకుమారుని మధురానాథుని గృహమునం దుంచెను. వివిధోపచారములఁ జేసినమీఁదట నారాత్రి వేకువజామున నాతనికిస్మృతికలిగెను.అప్పు డాఁతడు "కపాలకుండల" యున్నది—అందులకుసం దేహము లేదు. ఇకనాలస్యము చేయఁగూఁడదు. మీఁరు నడువుఁడు—ఈదినమే నేనక్కడకుఁ బోయెదను—నన్నిక్కడ కెందులకుఁ దీసికొనివచ్చిరి?" అనియెను

ఉమాపతి, మధురానాథుఁడు, అధికారిణి మొదలగువారందఱునామాటలను విని యేమిచెప్పుటకును దోఁచకుండిరి. ఈమాటలను త్రోసివేయుటకును సమర్థులైయుండలేదు. నవకుమారుఁడు యశిపురమునకుఁ దిరిగిపోవలయునని తొందర పడుచుండెను. కాని యాతనిశరీరము మిగులబలహీనమైనదై యుండెను. ఇఁక నాలుగైదు దినములుండి పోవలయునని స్థిరపఱచిరి.

అధికారిణి తనతో వచ్చినబ్రాహ్మణునితోఁ గూడ నవద్వీపమునకు వచ్చి నెలదినములకు పైగానయ్యెను. నవకుమారుఁడు నేడు

వచ్చెను. నేఁడో రేపో వచ్చునని యధికారిణి యక్కడనే కనిపెట్టుకొని యుండెను. ఆమె భవానీదేవిసేవకొఱకు చాల తొందర పడుచుండెను. నవకుమారుఁడు వచ్చినను ఆమె వెంటనే వెడలిపోవుటకవకాశము కలుగునట్లు తోఁచలేదు. నవకుమారున కారోగ్యము కలుగనిదే పోవుట మంచిదికాదు. అదియునుగాక కపాలకుండలాసంబంధమైన ప్రవాదము నమ్మఁదగినదిగా నుండకపోయినను దానియాథార్థ్యమును తెలిసికొనకయే పోవుటకు వలనుపడదు. ఆకారణముచే నధికారిణియు నామెతో వచ్చినబ్రాహ్మణుఁడును కొన్నిదినములుండి మఱిపోలయు నని నిశ్చయించుకొనిరి.

---

## పదునది రెండవ ప్రకరణము

### రహస్యప్రకాశము.

"Yet heavens are just, and time suppresseth wrongs"
Shakespeare.

రెండుదినములైన తరువాత నవకుమారుఁడును, ఉమాపతియు మధురానాథుని యింటిప్రక్క నున్నవీథియందు వివిధవిషయములం గూర్చి మాటలాడుకొనుచు నన్యమనస్కులై యుండిరి. ఇట్లుండఁగా నుమాపతి "భట్టాచార్యులవారు వచ్చుచున్నారే! వారెక్కడనుండి వచ్చుచున్నారో" అనియెను.

నవ—ఆయన యెవ్వరు?

ఉమా—ముక్తకేశినితండ్రి.

ఇంతలో భట్టాచార్యుఁడును వారిసమీపమునకు వచ్చెను. ఉమాపతియును నవకుమారుఁడును ఆయనకు నమస్కరించిరి. ఉమా

పతి యాశ్చర్యముతో "ఇదేమి? మీరిక్కడకు దయచేసితిరి ? అంద అును క్షేమముగ నున్నారా?" అనియెను.

భట్టా—అందఱును క్షేమముగ నున్నారు. ఒకపనిమీఁద నేనీ ప్రదేశమును గూర్చివచ్చితిని. ఆపని కాలేదు. ఇప్పుడు తిరిగి యూరికి పోయెదను. నీవిక్కడ కెందులకు వచ్చితివి ?

ఉమాపతి నవకుమారుని జూపించి, "ఇతఁడు నాకుఁ బ్రాణబంధుఁడు. మేమిద్దఱము నొకయూరియందే యున్నాము. ఇది యాతని చెల్లెలియత్తవారి యూరు. ఈయెదుటనున్న దీతనిబావగారియిల్లే. ఆతనికిని నాకునుగూడఁ బరిచయము కలదు. ఆతని జూచిపోవలయు నని మేమిరువురము నిచ్చటికివచ్చితిమి. మేమును రేపే యూరికిఁబోవుదుము. ఇప్పుడు చాల బాగుగ నున్నది. మన మందఱమును కలసియే పోవచ్చును" అనియెను.

భట్టాచార్యుఁ డందుల కంగీకరించెను. అందఱును లోపలకుఁ బోయిరి. అక్కడ భట్టాచార్యుఁడును, అధికారిణి కాత్మబంధువుఁడైన బ్రాహ్మణుఁడును. పరస్పరము సమీపించిరి. అప్పుడు వారొకరిమొగము నొకరు చూచుకొనసాగిరి. ఒకరినొకరు పరస్పరము గుర్తించుటకు మొదలుపెట్టిరి. తుదకు వారిరువురకును సందేహము తీఱిపోయినవి. అధికారిణిబంధువుఁ డొడలు తెలియనియానందముతో భట్టాచార్యుని పాదములపైఁ బడి "అన్నా ! నీవు బ్రదికియుంటివా? నిన్నుమరల నీజన్మమునందుఁ జూతునని స్వప్నమునందుఁగూడ ననుకొనలేదు. నేనును, వదినెయు, ఊరికిఁ బోయి మనవా రెవ్వరున్నారో, మనయిల్లెట్లున్నదో చూచి రావలయు నని వచ్చితిమి" అనియెను.

వృద్ధుఁడైనభట్టాచార్యుఁడు బాష్పపూరితనయనుఁడై "శాంతిచరణా" అని పిలిచి యతిప్రేమముతోఁదమ్ముని బిగ్గఁగౌఁగిలించుకొనియెను. ఆతనికన్నులనుండి యానందాశ్రువులు వర్షింపనారంభించెను.

ఆతఁడు తనమాటలవలన హృదయమునందలి ప్రేమభావమును దెలియఁబఱుచుటకు సమర్థుఁడు కాక యుండెను. కాని హృదయభావములను పట్టియే వాక్యస్ఫూర్తియు నగుచుండెను. "వదినె యింకను బ్రదికియున్నదా? ఇన్నిదినములవఱకు నెక్కడ నున్నది? ఎక్కడ నేమి చేయుచుఁ గాలక్షేపము చేయుచున్నది?" అనియెను.

హరిచరణుఁడు "వదినె నాతోఁగూడ వచ్చి యిప్పు డిక్కడనే యున్నది. ఆమెయు నేనును మనదేశమును వదలిపోయినది మొదలుకొని మేము హిజలిపురమునందు నివసించుచుంటిమి. నేఁటికి చాల సంవత్సరములనుండియు నచ్చటనే యుంటిమి. అక్కడ భవానీదేవి యాలయ మొకటి యున్నది. ఆదేవస్థానమునందు వదినెయే యధికారిణియై యుండెను. నేనందందుఁ బోయి తిండి కేమైనను సంపాదించుకొని వచ్చుచుండెడివాఁడను. వదినెయా దేవస్థానమునందలి యెల్ల కార్యములను నెఱవేర్చు చుండును" అని చెప్పెను.

ఆమాటలను విని నవకుమారుఁడును, ఉమాపతియును తమ కేమియుం దెలియకుండుటచే విస్మితులై యాయిరువుర నూరక చూచుచు నిలువఁబడిపోయిరి. వారికి వీరు సంభాషించుకొన్నమాటల యర్థము తెలియలేదు.

అధికారిణిమఱఁదియైన హరిచరణుఁడు "మీరిద్దఱు నేమో యాశ్చర్యపడుచున్నట్లున్నారు. ఆశ్చర్యపడనక్కఱలేదు. నేను మీ కన్ని సంగతులను విశదముగఁ జెప్పెదను—మీరది యంతయును వినినయెడల నింతకంటెను మిగులనాశ్చర్యమును పొందుదురు—నవకుమారా! మావదినె, కపాలకుండలయొక్క వృత్తాంత మంతయు నెప్పుడైన నొకప్పుడు నీకుఁ జెప్పెదు నని యన్నది కాదా? పరమేశ్వరునిదయవలన నిప్పు డాసమయము వచ్చినది. అది యంతయును చెప్పినయెడల నీవు విస్మితుఁడ వగుదువు. మాయన్నగారును విస్మితు

మేము హిజలియందు భవానీసేవ సేయుచు నక్కడ నివసించి యుండఁగా నొకనాఁడు జటాజూటధారియైన యా కాపాలికుఁ డొక యాఁడుబిడ్డ నెత్తికొని మా పార్శ్వమునకు వచ్చెను. అప్పుడు మాకు చాల నాశ్చర్యము కలిగెను. ఆబిడ్డ మాయన్నగారికుమార్తెవలెనే యుండెను—కాపాలికుఁడు "నాకీపిల్ల సముద్రతీరమున దొరకినది. దీనిని మీయింట నుంచుకొని కాపాడవలయును. ఈబిడ్డవలనముందు ముందు నాకెన్నియో ఘనకార్యములు సిద్ధింపవలసి యున్నవి. నే నెప్పుడు నొక్కచోట నుండువాఁడనుగాను. ఎప్పు డెక్కడ నుందునో నాకును తెలియఁబోదు. సంసారులవలె పిల్లలను పెంచి పెద్ద వారిం జేయుట నాకెట్లు సాధ్యమగును ?. కాఁబట్టి మీరీపిల్లను మీయింట నుంచుకొని కాపాడవలయును" అనియెను.

మేము బాగుగఁ బరిశీలించి చూడఁగా నాశిశువు మాపిల్లవలెనే యుండెను. "మేమాబిడ్డను తీసికొననియెడలఁ గాపాలికుఁడు బిడ్డను మరల సముద్రతీరమునకుఁ దీసికొనిపోయి విడిచిపెట్టును. అక్కడ నేమియున్నది ? మహారణ్యము. అక్కడ నాబిడ్డకు దిక్కెవ్వరున్నారు? అప్పుడామెగతి యేమికావలయును?" అని యోచించుకొంటిమి. మేము సంసారమందు విరక్తులమై యున్నటిని త్యజించితిమి. కాని రక్త సంబంధము నెట్లువిడువఁగలము? మాకును, ఆపిల్లకును గలసంబంధము కాపాలికునికి తెలిసినయెడల నాతఁడు దానిని మాయొద్ద నొప్పగించిపోవుట కంగీకరింపఁడు. పిల్లయునుమాయొద్దనుండకపోయినయెడల బ్రతుకుట దుర్లభము. ఈకారణములచే నన్నిసంగతులను గప్పిపుచ్చిపిల్లను మాయొద్ద నుంచుట కంగీకరించితిమి. కాపాలికుఁ డాపిల్లను మాకొప్పగించి పోయెను. కాని ప్రతిదినమును వచ్చి పిల్లను చూచికొని పోవుచుండెను. కాపాలికుఁ డాబిడ్డకు కపాలకుండల యని పేరుపెట్టెను. కపాలకుండల మాచేఁ బెంపఁబడుచుండెను.

కపాలకుండల యానిర్జనారణ్యమున కెట్లువచ్చినదో దానిని తెలిసికొనుటకు మొదటినుండియును కుతూహలముగలవారమై యుంటిమి కాని యెట్లు తెలియఁగలము? ఆసంగతి నెవ్వరు జెప్పగలరు? కపాలకుండల నోరెత్తుఁగని చిన్నబిడ్డ—ఆమె నేమని యడుగము? నేనే యింటికి వచ్చి యదియంతయును తెలిసికొనిరావలయునని యనుకొంటిని గాని యట్లు చేయుటకు వలనుపడదయ్యెను. వదినెయొక్క తెయే యున్నది. కూడ నెవ్వరును లేరు. క్రమక్రమముగా నాపిల్లయు నందందుఁబోయి యాడుకొనుట కారంభించెను. అప్పుడు నేనొకటిరెండు దినములు మాత్ర మూరువదలిపోవుట కనుకూలముగ నుండెను. కొన్నిదినములయిన తరువాత నేను కాపాలికునియొద్దకుఁబోయి యాతనిజూచి "స్వామీ! మేము చాలకాలమునుండి మాయింటికిఁ బోవుటలేదు—మా సంసారము, కుటుంబము, మొదలైనవానినన్నిటిని డిడిచి సర్వసంగపరిత్యక్తులవలె నిక్కడకు వచ్చి వాసము చేయుచున్నను జన్మభూమిని చూడవలయు ననునాశకలిగి యిప్పుడుమనస్సు కొంచెముకలవరపడుచున్నది. మేము మా దేశమునకుఁ బోయి జాగ్రతగఁ దిరిగివచ్చెదము. అంతవఱకు నీబిడ్డను తామే చూచుకొనుచుండవలయును" అనిచెప్పితిని. కాపాలికుఁ డందుల కంగీకరించెను. భవానీదేవిపూజకొఱకు వేఱొకబ్రాహ్మణుని నియమించి మేమింటికి వచ్చుటకు బయలుదేఱితిమి. మేము వచ్చునప్పు డేమేమియాలోచించుకొను వచ్చితిమో అది యంతయు నిప్పుడు చెప్పవలసినపనిలేదు. ఊరికి వచ్చిచూడఁగా మాకుఁ జాల నాశ్చర్యముకలిగినది. మాయన్నగారియిల్లు శిథిలమైపడిపోయియుండెను. అక్కడ నెవ్వరును లేరు. ఇరుగుపొరుగువారిని బిలిచి యడుగఁగా వారు "మీయన్నగారు జాతిభ్రష్టుఁ డయ్యెను—ఆతనికి బహిష్కారమగుటవలన నీయూరు విడిచిపోయెను. ఎక్కడకుఁ బోయెనోమాత్ర మెవ్వరికిని దెలియదు" అని చెప్పిరి. నేను తిరిగి "మాయన్న పార

మార్థిక చింతగలసత్పురుషుఁ—జాతిభ్రష్టుఁడు కావలసినంత చెడ్డపని చేయఁదగినవాఁడుకాఁడు" అని చెప్పితిని. అందులకు వారు "ఆతనియిం టిలో పరంగివారు ప్రవేశించిరి. ఆతఁడు వారు ముట్టికొనినయన్నము ను తినియెను. ఆమ్లేచ్ఛులాతనిపెద్దకుమా ర్తె నెత్తికొని పోయిరి" అని చెప్పిరి. అప్పుడునాహృదయమునందలి సంశయాంధకారము చాలవ ఱకు దూరమైపోయెను. తరువాత "నాతఁడు మ్లేచ్ఛులు ముట్టుకొనిన యన్నము నెట్లు తినియె"నని యడిగితిని. వారామాటకుఁ గోపగించు కొని "అది మాకుఁ దెలియదు—మేము, తెలిసినదానిని చెప్పెదము వినుము—కొన్నిదినములక్రిందట కొందఱు పరంగు లోడపైఁబోవు చుండిరి. మాగ్రామసమీపమున లంగరువైచి వారందఱు నూరి లోనికివచ్చిరి. విధివిధానముచే నాదొంగలు నీయన్నయింటికి వచ్చి యింటియందున్న సర్వస్వమును దోఁచుకొని తుద కాతని పెద్ద కుమార్తె నెత్తికొనిపోయి యోడలోఁ బ్రవేశించిరి. ఓడవెడలి పోయెను. పరంగివారు మీయన్నను క్రైస్తవునిగాఁ జేసిపోయి రని యాగ్రామమునం దందఱును చెప్పుకొనసాగిరి. అది నిజమో కాదో భగవంతుఁడే యెఱుఁగును. ఏమైనఁ గానిమ్ము ఈకారణము చేతనే మీయన్నను సంఘమునుండి బహిష్కరించిరి. అందఱునాతని జూచి యధిక్షేపించుట కారంభించిరి. అయిననాతఁడు చాలదినము లిక్కడనే యుండెను. కాని చాలదినము లాస్థితిలో నిచ్చటనుండుట కిష్టము లేక యీయూరువిడిచి వెడలిపోయెను. అప్పు డాతఁడెక్కడ నుండునో,యేమయ్యెనో తెలియుట లేదు" అని చెప్పిరి. నేనది యం తయును విని యూరకుంటిని మాయన్నమిక్కిలి యధైర్యస్వభావము కలవాఁడయ్యెనని యనుకొంటిని. ఆతఁడు చాలకాలమునుండి మహ మ్మదీయప్రభువుల యుద్యోగములో నుండెడివాఁడు. అన్యాయమైన పనులచే గ్రామస్థులకుపకారముచేసి ప్రభువులకు నష్టము కలిగించుట

యాతనిస్వభావమునకు విరుద్ధముగా నుండెను. అందువలననూరిలోని వారందఱు నాకాలముననే యాతనిపై ద్వేషమును వహించియుండిరి అట్లైనను ఉద్యోగము నుండి తప్పించుటకు వారి కెంతమాత్రమును సాధ్యము కాకపోయెను. ఆపగ మనసునందుంచుకొని యిప్పుడీయుపాయముచే నాతని నీయూరినుండి వెడలఁగొట్టిరి. ఏమైనఁగానిమ్ము— అప్పుడు మాయన్నగారిని వెదకుట యావశ్యకమని భావించుకొంటిని ఆచుట్టుపట్ల నున్నయనేకగ్రామములను వెదకి చూచితిని. ఏమియును కార్యము లేకపోయినది. నేను హిజలియందున్న సంగతి మాయన్నగారి కెంతమాత్రమును తెలియదు. నేనక్కడ నుంటినని మఱి యెవ్వరునెఱుఁగరు. తెలిసినయెడల మాయన్నగారిసమాచారమును నాకు దెలిపియే యుందురు. ఏమియును దోఁచక హతాశుఁడనై భవానీ సేవ చేయుటకు నిశ్చయించుకొని తిరిగి హిజలికిఁ బోయితిని.

నేనక్కడకు జేరుసరికిఁ జాలదినము లాలస్యమయ్యెను. తిరిగి వచ్చి చూడఁగా కాపాలికుడుకపాలకుండలను సముద్రతీరమునందొక వనమునందుంచి పెంచుచుండెను. కపాలకుండల యోగినీవేషమును ధరించుకొనితిరుగుచుండెను. అక్కడ కాషాయవస్త్రములుదక్క మఱియొకవిధమైనవస్త్రములు దొరకుట దుర్లభము. కపాలకుండల కప్పటి కేడు సంవత్సరములవయసువచ్చెను. సౌందర్యము నతిశయింపఁజేయుటకుఁ గావలసినవన్నియు కపాలకుండల శరీరమునందే యుండెను. యోగినుల కర్హమైనకాషాయవస్త్రములను ధరించినప్పుడు కూడ నామెయెట్లు ప్రకాశించుచున్నదో దానిని వర్ణించిచెప్పుట యసాధ్యము. ప్రతివనమునందును వనదేవతవలెఁ దిరుగాడుటయామెకు స్వభావమయ్యెను. అక్కడనున్న యడవులలో నామె యెఱుంగని ప్రదేశమే లేదు—ప్రతిదినమును ఎప్పుడైన నొకసారి మాయొద్దకు వచ్చుచుండెడిది. ఆమెను జూడవలయునని యున్నమనోవేగము నంత

నుకష్టముచే నణఁచిపెట్టుకొనుచుంటిమి. ఆమెకొఱకనేకవిధముల నా లోచించుకొనుచుంటిమి. దారుణతంత్రములచే దూషితమైనమతము నవలంబించియున్న దురాత్ముఁడైనకాపాలికుఁ డేయభిప్రాయముతో నామెనింతటిప్రయత్నపూర్వకముగఁ బెంచుచుండెనో అది మాకు తెలియక పోలేదు. కపాలకుండల నాతని బారినుండి తప్పించి రక్షిం పవలయునను ప్రయత్నమున మేమిద్దఱమును మిగుల వ్యాకులపడు చుంటిమి.

తండ్రియెవ్వరో, తల్లియెవ్వరో, ఇల్లెక్కడనున్నదో, అక్కడ కెందులకువచ్చినదో, అనునీవిషయములనుగూర్చి యణుమాత్రమై నను కపాలకుండలకు తెలియదు. ఇందును గూర్చి ఆమె యెప్పుడు నొక్కమారైనను నాతోఁ బ్రశంసించి యుండలేదు. నేనును సాధ్య మైనంతవరకాసంగతు లన్నియునురహస్యముగనే యుంచితిని. ఆమె కాసంగతి తెలిసికోవలయు ననుజ్ఞానమేలేదు. ఆమెజ్ఞానమం దదియే ప్రపంచము. ప్రపంచ మంతయు నామెకక్కడనే యుండెను. ఆసము ద్రతీరమునందలి మహావనము, ఆవిశాలశాఖాసమేతము లైనవృక్ష ముల సమూహము, ఆభయంకరమైనజంతుసంతానము, ఆదురాత్ముఁ డైన కాపాలికుఁడు మాత్రమే యామెకుఁ బ్రపంచమైయుండెను. సర ళహృదయ యగు నామెకు మఱియేమియును దెలియదు. ఆకారణము వలననే యామె కెప్పుడును విచారము కలుగుట కవకాశము లేకపో యెను. ఒక్కొక్కప్పుడు కాపాలికుఁడెవ్వనినో గ్రహచారము చాలని వానిని పట్టితెచ్చి బలిపెట్టుచుండుటను చూచి ప్రపంచమునందింకను కొందఱు జను లున్నారని కపాలకుండల తనయంతట తానే తెలిసికొ నఁగలిగెను. మఱియు బలిపెట్టుటకొఱకు కట్టివారిని కొందఱిని కాపాలి కుఁ డెక్కడనో భద్రముగ నుంచి రక్షించుచుండె ననియు, ఆతనికిఁ గావలసినప్పుడు వారినొక్కొక్కరినెపట్టి తీసికొనివచ్చుచుండె ననియు

నామెయూహింపఁగలిగెను. కపాలకుండల యొకదినమున నాయొద్దకు వచ్చి నాతో "బలియిచ్చుటకొఱకు కాపాలికుఁడు తీసికొనివచ్చినమనుష్యు లెక్కడ నున్నారు." అనియడిగెను. ఆమాటలకు నాకునవ్వు వచ్చినది. మేమప్పుడప్పుడామెకు ప్రపంచవృత్తాంతములనుసాధ్యమైనంతవఱకు తెలుపుచుండెడివారము. కాపాలికుఁడుతన్నెందుకొఱకింతప్రయత్నముతో రక్షించుచుండెనో ఆసంగతి యిప్పటి కామెకుఁ గొంచెము లీలగాఁదెలియవచ్చినది. కపాలకుండల ఆవర్తమానమును తెలిసి భయాశ్చర్యములకులోనగుచుండెను. సతీరత్నమే స్త్రీజాతికి శిరోభూషణ మని యామె తెలిసికొనియెను. ఆమె అప్పటితనయవస్థనుగూర్చి యనేకవిధముల విచారించుచుండెను. మిగుల సంభ్రమముతో నామె తనకు ముందేమి కానైయున్నదో, ఎట్లుజరుగనైయున్నదో తెలిసికొనుట కాధార మేమున్నది." అని విచారించుచుండెను. అందులకుపలాయనముతప్ప మఱియొకయుపాయము లేదని నేనామెకు బోధించితిని. ఆతని తప్పించుకొనిపోవుట కనేకములైన యాతంకము లుండయుండుటచేత సమయమును కనిపెట్టి యాపని చేయువలయునని కూడ జెప్పితిని.

పాఱిపోవుట కొకసమయము దొరకెను. ఉత్తర దేశమునుండి నాశిష్యుఁడొకఁడు నన్నుఁ జూచిపోవుటకు వచ్చెను. ఆతఁడు తిరిగి యింటికిఁ బోవునప్పుడు తానుగూడ నాతనితోఁ దప్పించుకొనిపోయెదనని కపాలకుండల నాతోఁ జెప్పెను. కాని, అది నాకెంతమాత్రమును సరిగానున్నట్లు తోఁచలేదు. ఎన్నఁడు నెఱుఁగనియొక పురుషునితోఁగూడ నామె నొక్కతెను పంపించి వేయుటకు నామన సంగీకరించినదికాదు. భవానీదేవియనుగ్రహ మెట్లున్నదో యట్లే జరుగునని యూహించి యప్పు డాతనితోఁగూడ నామెను పంపక యూరకుంటిని. అప్పటికి కపాలకుండల పన్నెండువత్సరములవయస్సు కలది. క్రమక్రమముగా

నామెయా వనమునం దడుగుపెట్టుచుండెను. వనమధ్యమునందలి యడవి పూవువలెనే యామె సౌందర్యశోభారాశి తనంతట తానే యథేచ్ఛముగ వికసింప నారంభించెను. అదిమాకు మఱింతవిచారమునకుఁ గారణ మగుచుండెను. నిద్రావస్థయందును, స్వప్నావస్థయందును జాగ్రదవస్థయందును, అనునిమిషమును మాకు కపాలకుండల వివాహమునుగూర్చినకోరికతప్ప మఱియొకయాలోచనమే లేకుండెను. తుదకు ఆమెగతి యేట్లగునోయని యదేపనిగ నాలోచించుకొనుచుండుటచే మాయిద్దఱకును దేహస్వాస్థ్యము తప్పిపోయినది. శరీరము దుర్బలమయ్యెను. రక్తము క్షీణించెను.

స్త్రీలహృదయము సహజముగ నితరులదుఃఖమును చూచుటతోడనే కరఁగిపోవును. కాపాలికుఁడు మాటిమాటికిని మార్గస్థులను పట్టితెచ్చి బలియిచ్చుచుండుటను చూచి కపాలకుండల చాల దుఃఖించుచుండెను. కొన్నిదినములైనతరువాత దైవయోగముచే నీనవకుమారుఁడు కాపాలికుని బలిలోఁబడియెను, కపాలకుండల యతిప్రయత్నముచే నాతనిబ్రదికించి మా దేవాలయమునకుఁ దీసికొనివచ్చెను. అప్పుడు నేను మఱియొకచోటికిఁ బోయి యుంటిని. అధికారిణియైన మావదినె యీతప్పించుకొనివచ్చుటవలన కపాలకుండలకును, నవకుమారునకును విపత్తు కలుగుట తప్పదనియు, నవకుమారుఁడు కులీన బ్రాహ్మణుఁ డనియు తెలిసికొనియెను. ఆమె నవకుమారునితో నీవీ కపాలకుండలను పెండ్లిచేసికొనియెదవా? అని యడిగి యాతనియంగీకారముమీఁద యథాశాస్త్రీయముగ భవానీదేవియాలయమునందు గపాలకుండల నాతనికిఁ గన్యాదానము చేసెను. అన్నా! ఈనవకుమారుఁ డందఱ్ "యుపాధ్యాయుఁడే యానీయల్లుఁడు" అని చెప్పెను.

భట్టాచార్యుఁడు ఇంతవరకు నిశ్చేష్టుఁడై యుండి యాతనిమాటల నన్నిటిని వినుచుండెను. ఇప్పు డాతఁడు మిగుల దుఃఖముగలవా

డైన నవకుమారుని నాలింగనము చేసికొనుట కాతని సమీపించెను. హరిచరణుం డాతనిని పట్టుకొని మరల సిట్లని చెప్పంజొడంగెను.

"ఆమెయునాఁడు మూవది నె కపాలకుండలను, నవకుమారుని తోఁబంపివైచెను. అప్పుడు నేనును గ్రామాంతరమునుండి వచ్చితిని. అప్పటికి కపాలకుండలవయస్సు పదునేడుసంవత్సరములు. ఆమె తన మగనితో వెడలిపోయినతరువాత మేము నిశ్చింతులమైతిమి. ఆమె భర్తతోసుఖముగాఁ గాపురముసేయుచుండగా నెప్పుడైనఁజూడవల యునని యాసపడి యుంటిమి. అదియంతయును విపరీతముగాఁ బరిణ మించిపోయినది. మనము యోచించినట్లేమియును జరుఁగబోదు."

ఇట్లు చెప్పి హరిచరణుఁడు బాలకునివలె నేడ్చెను. కొంతసేపై నతరువాత కొంచె మూఁటడిల్లి తిరిగి చెప్పుట కారంభించెను.

"మేము భవానీదేవ్యాలయమునువిడిచివచ్చియిప్పఁటి కాఱు నెల లైనది. భవానీదేవిని విడిచి వచ్చుటకు ముందొకసంవత్సరము క్రిందట దేవి, సింహవాహనయగుమాహేశ్వరీరూపముతో నాకలలో నికివచ్చి "మీకపాలకుండల మిగుల కష్టములో నున్నదే! నీ వెందు లకుఁబోయి చూడవు? నీహృదయము పాషాణమయమైనదా?" అని చెప్పెను. ఈస్వప్నమైనతోడనే అందునుగూర్చి చాలవఱకు యో చించితిని. వెంటనే బయలుదేరి రావలయుననిన చాల తొందరపను లుండెను. తరువాత నామెయోగక్షేమములను తెలిసికొనిపోవలయున నివచ్చితిమి. తిన్నగా సప్తగ్రామమునకు పోయితిమి. అక్కడనప్పుడు నవకుమారుఁడులేఁడు. అక్కడ తెలిసికొనఁగా నాతడు సపరివారము గనవద్వీపము నందున్నతన చెల్లెలిమగఁడైన మధురానాథునియింటికి బోయెనని తెలియవచ్చెను. అక్కడనుండి తిరిగి మీనవద్వీపమునకు వచ్చితిమి. ఇక్కడ నవకుమారునివలన మందభాగ్యురాలగు కపాల కుండల గంగానదిలోఁబడిపోయినదని తెలియవచ్చినది" అనిచెప్పెను.

ఇంతవఱకును భట్టాచార్యునిమనస్సునందుతనకుమార్తె విషయమై యాశకలిగియుండెను—ఇప్పుడు తమ్ముని మాటల నన్నిటిని విన్న తరువాత నాయాశ పోవుటయేకాక విశేషముగ దుఃఖముకూడఁగలిగెను. కొంతసేపైనతరువాతఁ గొంచెము మనసు కుదురుపఱచుకొని "ఆమె నాయొద్దనుండి యెప్పుడు పోయినదో యప్పుడే లేదనుకొంటిని ఆమె తిరిగి దొరకుననుకు నాశయే లేదు. అయినను నాబిడ్డ జీవించి యీమహాపురుషునకు వివాహముచేయఁబడి మనయూరి కింతటిసమీపమునందున్నను ఒకదినమైనను దానిని చూడలేకపోయితి నన్నెడు దుఃఖము నాహృదయమును పరితపింపఁ జేయుచున్నది. కాని, యెంతటి దుఃఖమైనను ఇది నాకానందమయమైన దినమైనది. తలఁపని తలంపుగా, నీదినమున వదినెను, తమ్ముని, అల్లుని చూచుట తటస్థించినది. అన్నా! నవకుమారా! నాకుమార్తె నీకు సహధర్మచారిణియైనది. ఆమెయదృష్టమం దింతవఱకై నజరుగుట యాశ్చర్యకరమైన విషయము. నేనీదినమున నిన్నుఁజూచి పరమానందభరితుఁడనైతిని" అనియెను.

ఆదినమున, నవకుమారుఁడు కపాలకుండలను ఏవిధముగా నే భావముతోఁ జూచెనో అది యంతయును భట్టాచార్యునకును, అతని తమ్మునకును, వారివదినెగారైన యధికారిణికిని గూడ నివేదించెను. ఆవిషయమై యితరులకెట్టిసందేహమున్నను నవకుమారునకు మాత్ర మెంతమాత్రమును సందేహము కలుగలేదు. భట్టాచార్యుఁ డంతగా నానందమును పొందలేకపోయెను. అతఁడు "ఏకపాలకుండల జీవితమునందు లేశమాత్రమును సుఖపడి యుండలేదో యంతటి దురదృష్టవంతురాలు గంగాజలమునమునిఁగిపోయి తిరిగి యసంభావ్యమైన యేదో యుపాయముచేతఁ గాని, కేవల పరమేశ్వరానుగ్రహముచేతఁ గాని తిరిగి జీవించియుండెనని యూహించుకొనుట కేవలమును దురాశయే,

నేను నామార్గముననే వచ్చెదను. మీమనసునందు సందేహమేమైన నున్న యెడల నింటికిఁ బోవునప్పు డక్లే చూచికొని పోవచ్చును" అని చెప్పి నిట్టూర్పు విడిచెను.

తమ్ముఁడైన హరిచరణుఁడు, అన్నగారినిగూర్చి "నీవు ఊరు విడిచిపోయినదిమొదలు ఎక్కడ వాసముచేయుచుంటివి?" అనియెను.

భట్టా—ఇదివఱకు నీవు చెప్పినదంతయును నిజము. నేను సంఘమునుండి బహిష్కరింపఁబడి మనయూరఁ జాలకాలము నిలువలేక పోయితిని. కాని యెక్కడకుఁ బోయియుండను? ఎవ్వరి సాహాయ్యముచే నీకష్టములనుండి విడివడుదును? సప్తగ్రామమునకుసమీపమున నున్న గోపాలపురమందు నాకత్యంతాప్తుఁడైన మిత్రుఁడొకడుండెను. ఆతనికి నేనే సర్కారులో నుద్యోగమిప్పించితిని. ఆతఁడు క్రమముగా దనయసాధారణబుద్ధిప్రభావముచే నున్నతపదవికి వచ్చెను. ఆతనిపేరు హరిహరుఁడు. ఆతఁ డీయుమాపతికి మేనమామ. వివేకమందును, పరిశీలనమునందును, నేనుహరిహరునికంటెఁ జాలఁదక్కువైయున్నను ఆతఁడు తన సౌజన్యముచే నాయందు గురుభావమునుజూపుచుండెను. ఆతఁ డాగ్రామమునందు చాల ధనాఢ్యుఁడై యుండెను. మంచిబుద్ధిమంతుఁడును, విద్యావంతుఁడును కూడనై యుండెను. ఆకారణముచే గ్రామస్థులందఱు నాతని కధీనులై యుండిరి. నేనాతని యిష్టానుసారముగ గోపాలపురమునందు గోప్యముగ నివసించియుంటిని. హరిహరునిప్రయత్నముచే నూరివారందఱును నన్ను గౌరవించుచుండిరి. మనయూరివారికి నేనెక్కడకుఁ బోయితినో తెలియదు.

నేను సంపాదించిన దంతయు పరంగులు దోఁచుకొనిపోయిరి. ఉన్నభూమి నమ్మివైచి యక్కడనుండివచ్చిదూరముననున్న గోపాలపురమందు నివాసయోగ్యమైన యొకగృహమును గట్టికొంటిని. ఖర్చి

హారునియాశ్రయమువలన నచ్చుటనే యుంటిని. దొంగ లెత్తికొనిపో యినపిల్లనుగూర్చి చాలవఱకు హరిహరుఁడే వెదకించెను. కాని దొరకలేదు——.నేను మన యూరును గృహమును విడిచిపెట్టి వచ్చుటకు మునుపే నాకింకొక కుమార్తె కలిగినది. దానిపేరు ముక్తకేశిని.

ముక్తకేశినికి పెండ్లియీడు వచ్చినది. కాని, యామె వివాహ విషయమై యనేకములైన యంతరాయములు వచ్చినవి. సంబంధమెక్కడను కుదురలేదు. ఆత్మబంధువులందఱును గర్భశత్రువులైపోయిరి. హరిహరుఁడు చెప్పిన మాటలవలన నింకను పెండ్లిచేయక యాఁపి యుంచితిని.ముక్తకేశినియదృష్టమువలనను,దైవానుగ్రహమువలనను ఆమెనుమాపతికిచ్చి పెండ్లిచేయుటకునిశ్చయమైనది. ఈసంవత్సరము మాఘ మాసమునందు వివాహముచేయవలయు నని స్థిరపఱచుకొంటిమి. ఈసమీపమునందు మనజ్ఞాతు లొకరిద్ద ఱున్నారని నీకును తెలియును. నేను సంఘమునుండి బహిష్కరింపఁబడితి నని విన్నయెడల వారు నన్ను తిరస్కరింతు రని భయపడి వారిని నేను చూచుటకు పోనేలేదు. వారి కీసమాచారమును తెలుపనులేదు. పిల్లకు పెండ్లియెట్లు చేయుదునని యాలోచన ముండెడిది. ఇప్పుడావిచారము తప్పిపోయినది. ఇఁక నాకు భయ మెందులకు? నేను వారినందఱిని పెండ్లికిఁ బిలిచిపోవలయు నని యిక్కడకు వచ్చితిని. ఇప్పుడు తిరిగి యింటికిఁ బోవుచుంటిని. దైవానుగ్రహముచే నీమార్గమున మిమ్మును జూచు నదృష్టము కలిగినది. కలలోనైనను మిమ్ము మరలఁజూతునని యనుకొనలేదు. అందుకొఱకు నిరీక్షించుటయును లేదు. అవశాత్తుగ నింతటిభాగ్యము కలిగినది. నాకింతటియదృష్టము పట్టుననుకొనలేదు. ఇఁక పరమేశ్వరునికటాక్ష మెట్లున్నదో యెవ్వరికిఁ దెలియును? నవకుమారునిహృదయమునందుజనియించినయనుమానము అసంభవమైనదియు

అలభ్యమైనదియు నైనను ఇంటికిఁ బోవుట కిదియే మార్గమగుటచే నాత్రోవనేపోయి యాసందేహమును గూడఁ దీర్చుకొని పోవచ్చును. ఇట్లు మాటలాడుకొనుచు నందఱును ఆనందవిచారములతో నాదినమును గడపిరి.

---

## నలువది మూడవ ప్రకరణము

### శుభవార్త.

"క ఈప్సితార్థం స్థిరనిశ్చయం మనః"

కుమారసంభవము.

మఱునాఁటియుదయమున కందఱునుబయలుదేఱిసకాలమునకు యశిపురము చేరిరి. తోడనే వారందఱును జమీందారుఁడైన రామదాసరాయనియింటికిఁ బోయిరి. అక్కడకుఁ బోయివిచారింపఁగా నందఱకును నాశాభంగ మయ్యెను. రామదాసరాయఁడు పరివారసమేతముగ తీర్థయాత్రకొఱకు వెడలిపోయె ననియు, ఆయనవ్యాపారముల నన్నిటిని జూచుట కొకకార్యాధ్యక్షుఁడు నియమింపఁబడియె ననియును వారికిఁ దెలియవచ్చెను. ఈసమాచారమువలన నితరులకు విచారము కలిగినదో, లేదో, యెవ్వరు చెప్పఁగలరు? కాని నవకుమారుఁడుమాత్రము మిగులఁ బరితపించెను. ఇతరు లాతనిమాటలను నమ్మలేదు. సరికదా—ఆవిషయమైన యాశకూడ వదలుకొనిరి. వారికీసమాచారము సామాన్యమైనదిగనే యుండెను. కాని, యేమనుష్యుఁడొకవిషయమునుగూర్చి దానియొక్క సుఖపరిణామమందు స్థిరనిశ్చయుఁడై యుండునో యట్టివానికది వేఱువిధముగఁ బరిణమించినయెడల నాతనికి గుల దుఃఖము కలుగకమానదు. ఈసమాచారమువలన నవకుమా

రునికి విశేషవిచారము కలిగెను. కపాలకుండల జీవించియున్నదనిగాని, ఆమె మరలఁ దమకు దొరకుననిగాని మఱియెవ్వరికిని నమ్మకము లేకపోవుటచేత నీసమాచారమువలన వారికి క్రొత్తగా మఱియేవిచారమును కలుగలేదు. అయినను నవకుమారుఁడు కపాలకుండల నిశ్చయముగ జీవించియున్నదను నమ్మకము కలవాఁడై యుండెను. సామాన్యముగా మనుష్యులకుఁ దమయూహాలే నిశ్చయములైనవిగాఁ దోఁచుట స్వభావము. నవకుమారునకును కపాలకుండల నిజముగ జీవినచియున్నదని తనకుఁ గలిగిన నమ్మకమునుగూర్చి కొంచెమైనను సందేహము కలుగలేదు. ఆకారణమువలన నాతనికి విచారము మిగుల నతిశయించినదని చెప్పవలసినపని లేదు.

ఇఁక నిక్కడవ్యర్థముగాఁ గాలక్షేపము చేయుటవలనఁబ్రయోజన మేమియున్నదని భావించుకొని యందఱును వెడలిపోవుటకు నిశ్చయించుకొనిరి. నవకుమారుఁ డందుల కంగీకరింపలేదు. వృథాగానిచ్చటనుండుటవలన లాభ మేమున్నదని యందఱును నవకుమారునకుఁ దెలిపిరి. నవకుమారుఁడు "నేనీవిషయమునుగూర్చి చాలవఱకుఁ దెలిసికొనకుండ బయలుదేరి రాఁజాలను. మీకు తొందరయున్న యెడల మీరు పోవచ్చును—నేను వచ్చుటకు వలనుపడదు." అనిచెప్పెను.

తక్కినవారందఱును ఆతనికి మాఱుమాట చెప్పుట మంచిది కాదని యోచించి అట్లైనయెడల నిప్పుడు చేయవలసినపని యేమి" అని యడిగిరి.

నవకుమారుఁడు వారినందఱను తనతోఁగూడఁ దీసికొనిరామదాసరాయని కార్యాధ్యక్షునియొద్దకుఁ బోయెను. కార్యాధ్యక్షుఁడు జాతియందు కాయస్థుఁడును, ప్రాచీనుఁడును, బుద్ధిమంతుఁడును, జ్ఞానియునై యుండెను—బ్రాహ్మణులు వచ్చుటనుచూచి లేచి నిలువఁబడి భక్తిపూర్వకముగ నమస్కారము చేసి కూరుచుండవలయు నని

చెప్పెను. అందఱును కూరుచుండిరి. కార్యదర్శిమాత్రము నిలువబడి యేయుండెను.

నవకు— మీ పేరెవ్వరు?

కార్య— శ్రీమధుసూదనవనుఁడు.

నవ— మీరీయింటియందు వాసముచేయుచుండిరా?

మధు— తాతతండ్రులనాఁటినుండియును మేమీయింటనుండి వీరియన్నము దిని జీవించుచుంటిమి. మీరిచ్చటకు దయచేసినపని యేమి?

నవ— క్రమముగా నదియే తెలియఁగలదు. ఈగృహాయజమాను లిప్పు డెచ్చట నున్నారు?

మధు— వారు తీర్థయాత్రకుఁ బోయి రెండుదినము లైనది. వారు తమకుసంతానములేక పోయిన దనువిచారముచే రాజ్యసంబంధమైన వ్యాపారములనుగూర్చి యంతయాసక్తితోఁ జూచుటలేదు. ఇట్లే తీర్థయాత్రలు, మొదలైన ధర్మకార్యములయందే కాలము గడపుచుందురు.

నవ— వారు కుటుంబసహితముగఁ బోవుటసరియే. మఱి యెవ్వరైన వారితోఁగూడఁ బోలేదా?

మధు— మఱియొక బ్రాహ్మణకన్యగూడ వారితో నేగినది. ఆమె మాజమీందారిణికి మిగుల స్నేహపాత్రురాలై యున్నది. వారామె నొకనిమిషమైన చూడకుండ నుండజాలరు. వారికి వేఱుగసంతానము లేకపోయిన కారణముచేత వారామెను ప్రాణముకంటె నధికముగఁ జూచుకొనుచున్నారు. నిజముగా నామెను సంతోషింపఁజేయుట కెవ్వరికిని సాధ్యము కాదు.

నవ— ఆమెవయ సెంత?— ఆమె స్వభావమెట్లుండును?

మధు—ఆమెకు కొంచెమెచ్చుతగ్గుగ నిరువదిరెండుసంవత్సరము లుండును. ఆమె యెప్పుడును విచారించుచునే యుండుసని చెప్పవచ్చును. అంతటి ధైర్యవతియు, నంతటి శాంతమూర్తియు, నంతటి నిర్మలహృదయయు నగు సతీమణీ ప్రపంచమందు మఱియెచ్చటనైన నుండునని చెప్పవలనుపడదు. అయినను ఆమె హృదయమందు సుఖముమాత్రము లేదు. ఆమె యెల్లప్పుడును విచారించుచుండుటను చూచినయెడల మనకును విచారము కలుగకపోదు. కాపట్యము, ఖలత్వము, అనువానిపేరులైన నామె యెఱుంగదు. మా యజమానుఁడును, ఆమెయం దాదరణముకలవాఁడై యామెకు "ఉన్మాదిని" అనిపేరుపెట్టెను. ఇప్పుడును ఆమె కదియే పేరు.

నవ—ఆమె వారికెక్కడ దొరికినది?

మధు—మాయజమానులామెను తీసికొనివచ్చిరి. వారేదో పనికొఱకు పడవయందుఁ బోవుచుండిరి. అరుణోదయసమయమున నుండి దిగిరి. అక్కడ గంగాతీరమం దున్మాదినియొక్క మృతప్రాయమైన శరీరముపడియుండెను. వారామెయొక్కయసామాన్యసౌందర్యమును, జీవించి యున్నట్లుగనే కనఁబడుచున్న సౌమ్యభావమును చూచి యాశ్చర్యపడిరి. అప్పుడు వారాచిన్నది యింకను జీవించి యుండునని యనుకొని సేవకులను బిలిపించి జాగ్రతగా నుపచారములు చేసి బ్రదికించి యింటికిఁ దీసికొనివచ్చి కుమార్తెవలెనే ప్రేమతోఁ బెంచుకొనుచుండిరి.

నవ—ఆమె పూర్వవృత్తాంతమేమైనఁ దెలియునా?"

మధు—నేనును మాయజమానుఁడును తప్ప మఱియెవ్వరును ఆమెయొక్క పూర్వవృత్తాంతమునెఱుఁగరు. అయినను దానిని రహస్యముగదాఁచియుంచవలయునని ప్రతిజ్ఞచేసినకారణమువలన నిప్పుడు చెప్పఁజాలనందులకు మన్నింపవలయును. అయినను మీరు బ్రాహ్మ

మధు—మహాశయా! మీరు వ్యాకులపడఁగూడదు. కపాలకుండల జీవించియున్నమాట నిజము—నేఁడు కాక మఱి పదిదినములకైన మీరామెను చూడఁగలరు.

నవ—మహాశయా! ఇంతవఱకు కపాలకుండల చచ్చిపోయినదనియే నమ్మి గుండె రాయి జేసికొని యుంటిని. కాని, యిప్పుడొకనిమిషమైన సహింపఁజాలను. వారందఱును ముందుగా నేతీర్థదర్శనమునకుఁ బోయెదరో తప్పక చెప్పఁగోరెదను. మేమిప్పుడే వారిని వెంబడించి పోయెదము.

మధు—వారు మొట్టమొదట మహాకాళీదర్శనమునకై కాళీఘట్టమునకుఁ బోవవలయునని సంకల్పించుకొనిరి.

నవ—నేనును పోయెదను—ఎట్లయినను పోయి కపాలకుండలను తిరిగి చూడకయే భుజింప నొల్లను. మీరు కూర్చుండవచ్చును. మేము పోయెదము.

ఇందుల కందఱును నంగీకరించిరి—అందఱును లేచిరి.

మధు—మీరందఱును చాల నలసియున్నట్లున్నది. కొంచెమసేపు విశ్రమించి పోవచ్చును.

హరిచరణు—మేము మీకు హృదయపూర్వకముగ నాశీర్వాదమును చేయుచుంటిమి. మీయెడ మేమెల్లప్పుడును కృతజ్ఞులమైయుందుము. భగవంతుఁడు దయజూచినయెడల మరల మేమనేకపర్యాయములు మీదర్శనము చేయుదుము. ఇప్పుడాజ్ఞయిచ్చితిరేని పోయి వచ్చెదము.

మధుసూదనుఁ డందఱకును నమస్కరించెను. అందఱు నాతని నాశీర్వదించి వెడలిపోయిరి.

---

## నలువది నాలుగవ ప్రకరణము

### గతచింతనము

"Thou art too good' and I indeed unworthy;
unworthy of so much virtue."

Ottway

నేడు పుష్యసంక్రాంతి—త్రివేణియందు జాతరజరగుచున్నది—జను లిసుకవేసిన రాలకుండఁ గ్రిక్కిరిసి యుండిరి. ఈపుణ్యకాలము నందు గంగాస్నానము చేయుటవలనఁ జాల పుణ్యము గలుగుననునాశ చేత నానాదేశములనుండి యాత్రికులు వచ్చియుండుటచే నాపుణ్యస్థలము జనారణ్యమైపోయెను. యాత్రికులతోఁగూడ వర్తకులును నానాదేశములనుండి వివిధవస్తువులను దెచ్చి, ఇహపరములురెంటికిని సాధనములైన యంగడులను వరుసలుతీరియున్న పటకుటీరములం దుంచుకొనియుండిరి. యాత్రికులు నివసించుటకొఱ కనేకములైన పూరిండ్లుకట్టబడి యుండెను. గంగాతీరమును, గంగాగర్భమును పడవలతో నిండిపోయెను. వచ్చిపోవుచుండు పడవలకు లెక్కయే లేదు. నవకుమారుఁడు మొదలగువారు కూరుచున్న పడవయు వచ్చిచేరెను. వారందఱును నిన్నటిదినము యశిపురమునుండి బయలుదేరి రని పాఠకులకు జ్ఞాపక ముండవచ్చును. నిన్నటిదినమంతయును వారికి భోజనమే లేదు. అందువలన నేడక్కడనుండి త్రివేణీసంగమమున స్నానము చేసికొని భోజనము చేసినతరువాత ప్రయాణముచేయవలయు నని యోచించుకొనిరి. అంగడు లున్నచోట నుండుటకు రెండిండ్లను తీసికొనిరి. ఆపార్శ్వమం దింకను చాల యిండ్లున్నవి. ఆమధ్యమున రాజవీథి—ఆవీథి కిరువంకలను వరుసగ నిండ్లున్నవి—వారు విడిసియున్న యింటికి పార్శ్వమునయున్న గృహమునం దెవ్వరో నివసించియుండిరి,

నవకుమారుని హృదయావస్థ చాల భయానకముగ నుండెను. ఆశ, భయము, సందేహము, లజ్జ ఆనందము మొదలగు భావము లాతనిహృదయమునందు క్రమక్రమముగా నుదయించి యెట్లు పరిణమించుచున్నవో వర్ణించి చెప్పఁజాలకున్నాము. ప్రపంచము ఆశయొక్క మాయచేత నావరింపఁబడియున్నది. అత్యంత దుఃఖసమయమందును ఆశవచ్చి సుఖవార్తలను దెల్పుచుండును. సుఖమనాయాసముగ లభించునని తోఁచునట్లు చేయును. అప్రతిహతవేగముతో మనుష్యుఁడు దానిని వెంబడించును. కుత్సితమైనయాశ నవకుమారుని చెవియందును ఏదో యుపదేశించుచుండెను. దిగంతవ్యాప్తమై శీఘ్రగమనముగల యాశావిహంగముపై నధిష్ఠించి యెగిరిపోవుచున్న యాతని మనస్సు ఒకసారి నిష్కపటమై, దరహాసకలితమైన కపాలకుండల దన చంద్రమండలమును ముద్దుపెట్టుకొనుచుండెను. ఒకసారి యామె చరణకమలములపైఁబడి తప్పులనన్నిటి నొప్పుకొని క్షమింపవలయునని ప్రార్థించుచుండెను. ఒక్కొక్కసారి యామె గాఢాలింగనముచే బంధింపఁబడి పోయినదుఃఖములనన్నిటిని ఆలోచించుచుండెను—ఉత్తరక్షణముననే ఆశయొక్క మాయమాటలలోఁబడి కపాలకుండల దొరకుట యసంభవమనితోఁచి కలఁగిపోవుచుండెను—ప్రేమాస్పదురాలైన మృణ్మయి యొక్కసమక్షమునఁ దానేమి మాటలాడవలయునో, ఎట్లు నీచమై, నిష్ఠురమై యున్నతద్దృష్టి నామెదృష్టితోఁ గలపవలయునో, యోచించుకొనుచు మిగుల సిగ్గుపడుచుండెను. ఒక్కొక్కసారి కపాలకుండల జీవించియున్నయెడల నేఁడు గాకపోయినను మఱి పదిదినములలోనైనను చూడఁగలనను సంతోషముచే నుప్పొంగిపోవుచుండెను. ఇట్లింతయు నాలోచించుచున్నప్పుడు కపాలకుండల సంబంధమైన వృత్తాంతమంతయు నాతనితలంపునకు వచ్చెను. నవాంబుదసన్నిభంబగు నానీల సముద్రతీరమునందున్న వనాభ్యంతరమున ఆగుల్ఫలంబితకేశపాశయు,

ఆకర్ణచుంబితవిశాలనేత్రయు, ఆరక్తమంజులతరాధరోష్ఠయు, ఆలోక మోహనమనోజ్ఞమూర్తియు నగు రమణీరత్నమును జూచి ఆసుందర చిత్రప్రతిమయో, దేవతాకాంతయో, యని యాతఁడు విభ్రాంతుఁడై చూచినసంగతి జ్ఞాపకమునకు వచ్చెను. మొదట నాతని చూచినప్పు డామె "ఓపథికుఁడా! నీవు మార్గమును తప్పిపోయితివి" అని వీణా ధ్వనివలెనే మధురస్వరముతో నాడిన మాటయును జ్ఞాపకమునకు వచ్చెను. ఆకలస్వరమును, ఆముద్దుపలుకులును, ఇప్పుడుగూడఁ జెవికి వినఁబడుచున్నట్లే యుండెను, ఆశబ్దమన్ని దిక్కులందును ప్రతిధ్వనించు చున్నట్లుండెను. కపాలకుండలవిషయమై జరిగినమాటలింక నేమేమో జ్ఞాపకమునకు వచ్చెను. ప్రతి దినమునను, ప్రతి ముహూర్తమునను జరిగినమాట లన్నియు జ్ఞాపకమునకు వచ్చుచుండెను. దీర్ఘనిశ్వాస మును విడిచి నవకుమారుఁడు మెల్లగా "అయ్యో! ఆ కపాలకుండల యెక్కడనున్నది? నేనెంతటినరాధముఁడను! ఇంతటిహితకారిణియైన దానికి సుఖమును గూర్చుటలేదు. సరికదా మీఁదుమిక్కిలి చాలకష్ట పెట్టితిని. ఆకపాలకుండల జీవములతో నున్నదా?" అని యనుకొని యెను. ఆమెచచ్చిపోలేదని యాతనిహృదయమునకు దోఁచినతోఁడనే "ఆమెయెదుటకుఁ బోయి యేమి చేయవలయునో" అనుదానినిగూర్చి యోచింపఁ దొడఁగెను. అందువలన తన దుష్ప్రవర్తనమును గూర్చి సందేహము కలిగెను. తరువాత కపాలకుండలచరిత్రమునందలి సరళ తయు, మాధుర్యమును పరిపూర్ణమై యున్నట్లు తోఁచెను. రాగద్వే షాదిదుర్వృత్తులేవియు నామె హృదయమం దగపడలేదు. "నేనామె యెడలఁ జాలద్రోహము చేసితిని. ఐనను ఆమె నన్ను క్షమించును. క్షమింపకపోయినయెడల నే నామె పాదములపైఁబడి ప్రార్థించెదను. కాని యీ యనుమానము నిష్ప్రయోజనమైనది. కపాలకుండల నన్ను క్షమింపకపోవుట యసంభవము. ఆమెస్వభావము నాస్వభా

వముపలె నీచమైనదిగాదు. నేను దురాచారుఁడను. ఆమె నావంటిది, కాదు. రమణీమఃఖలహృదయమే దయామయమైన ది. విశేషించి కపాలకుండలహృదయము—నాకును కపాలకుండలకు నులక్ష యోజనములదూరము—ప్రణయముమాట యటుండనిమ్ము. నేనామెతో మాటలాడుటకైన యోగ్యుఁడనుకాను. కపాలకుండల స్వర్గరాజ్యలక్ష్మి—నేను ఘోరపాతకుఁడను—నేనేమొగము పెట్టుకొని యామెయెదుట నిలువఁబడి క్షమాపణము వేఁడుకొందును? ఏమనిచె ప్పుదును? నేనామెపాదములపైఁ బడి సర్వాపరాధములను మన్నింప వేఁడెదను. ఆమెచరణకమలములను నానయనజలములచే దడిపెదను ఆమెక్షమింపకపోయినయెడల నేనీప్రాణములతో జీవించియుండలేను కపాలకుండలను ధ్యానించుచు ప్రజ్వలించుచున్న యగ్ని హోత్రము నందీనాపాపుశరీరమును విడిచివైచెదను. ఆమె క్షమింపకపోయినయె డలఁ బ్రాణములతో నుండిన ప్రయోజనమేమి?'' అని యీవిధము గా నేకాంతముగఁ గూరుచుండి యేమేమోయాలోచింపదొడఁగెను. కపాలకుండలకేమి చెప్పవలయునో యోచించుకొనియెను. ఈదినము ననాతఁడొకచోట స్థిరముగాఁ గూర్చుండియుండలేకపోయెను. ఆతని గంభీరస్వభావమున నాశ్చర్యకరమైనచాంచల్య ముదయించెను. ఏకా ర్యమందును మనసు నిలుచుట లేదు. ఇది మనస్సుయొక్క స్వభావ మైయుండును.

---

## నలువదియైదవ ప్రకరణము

### సమ్మేళనము.

''ఉపరాగాంతే శశిన స్సముపగతా రోహిణీయోగమ్''

అభిజ్ఞాన శాకుంతలము

ఏస్థలమందుఁ గూర్చుండి నవకుమారుఁడు చింతామగ్నుఁడై యుండెనో, ఆస్థలమునందు చాలసేపు కూర్చుండలేక యుమాపతిని

పిలిచెను. ఇద్దఱును ఆయింటి యావరణముననున్న మామిడిచెట్టు నీడకుఁబోయి కూర్చుండియుండిరి. అక్కడ నింక నెవ్వరును లేరు. ఆస్థలమును ఆయింటికి ముందటివాఁకిలియని చెప్పినను చెప్పవచ్చును. ఆముంగిలికి మూఁడువైపులను ఆవరణమున్నది. మఱియొకవైపునపొరుగువారి యిల్లున్నది. ఈవాఁకిలి ఆయింటికి వెనుకవైపున నున్నది. ఆయింటిగోడయందు దొకచిన్న గవాక్షము కలదు. నవకుమారుఁడును ఉమాపతియు నాయింటిసమీపమున నున్న యాచెట్టునీడనుగూర్చుండిమాటలాడుచుండిరి.

నవ—చూచితివా? నేనూరక యాశపడలేదు. కన్నులారఁ జూచియున్నవాఁడ నగుటచే నింతటిదృఢమైన నమ్మకము గలవాఁడ నైతిని.

ఉమా—అట్లే కావచ్చును. కాని మన మెట్లు తెలిసికొనగల ము? నీవు చూచుట నిజమైయుండును. అయినను దానిని మేము సంపూర్ణముగ నమ్మఁజాలకున్నారము. అది నీమనస్సునందలి భ్రాంతియో యేమో యని యనుకొంటిమి. దైవానుగ్రహమువలన నది నిజముగాఁ బరిణమించినది.

నవ—అది యేమైనను గానిమ్ము. ఇప్పుడే పోయి కపాలకుండలను తప్పక చూడఁగలము. కాని, నామనస్సు అందువలనను శాంతి వహించి యుండఁజాలదు. అందునుగూర్చి నీకు వివరముగా నెట్లుచెప్పఁగలను? కపాలకుండల పడినకష్టముల కన్నిటికిని నేనే కారణుఁడను. ఆమెచిన్నతనమునం దరణ్యమునందున్నప్పుడు కష్టమనుదాని నెఱుఁగదు. ప్రతివనమునందును మనసువచ్చినట్లు పరమానందముతోఁదిరుగుచుండెను. నేను దానిని పెండ్లిచేసికొని ప్రపంచమునకుఁ గొనితెచ్చి

దుఃఖసాగరమున ముంచివై చితిని. అప్పటినుండియే దానికష్టములకారంభ మైనది. ఒకదినమైనను సుఖ మెఱుఁగదు. తుదకు నావలనదానికకాలమరణముకూడ సంభవించినది. అది భవానీసేవాపరాయణ యగుటచే దేవియనుగ్రహముచే నెట్లో తిరిగి బ్రదుకుఁగాంచినది. ఇప్పుడదియొకవిధముగా సుఖించుచున్నది. తిరిగి నాయొద్దకు వచ్చిన మరల దానికి విపత్తును, క్లేశమును, కలుగవచ్చును. నామరదృష్టము వలన నదికూడఁ గష్టములకు గుఱికాఁగలదు.

ఉమా.—కపాలకుండలకు మనసునందు సుఖములేదని మధుసూదనుఁడు చెప్పినమాట మఱచిపోయితివా ?

నవకుమారుఁడు మనసునందు "అయ్యో! దానిని తిరిగి కలిసికొనుదిన మెట్లువచ్చునో" అని యనుకొనెను.

ఉమా.—నవకుమారా! నీకు రెండుదినములనుండి భోజనము లేదు. పోయి యేమైన ఫలాహారమును తీసికొని వచ్చెదను.

నవకుమారుఁడు దానికేమియును బ్రత్యుత్తరమీయ లేదు. ఉమాపతి లేచి వెడలిపోయెను. నవకుమారుఁడు చూచుచుండఁగనే యాచెట్టుమీఁదఁ గూర్చున్న రెండుపక్షులాతనికన్నులఁ బడియెను. అందొకటి యెగిరివచ్చి నేలపై వ్రాలెను. మఱియొకటి దానితోఁగూడ వచ్చి వ్రాలెను. ఒకటి యాహారమును వెదకుటకై ప్రయత్నించుచుండెను. రెండవదియు నట్లే చేయ నారంభించెను. ఒకటి నోరు దెఱచి మనోహరముగఁ గూసెను. దాని ప్రతిధ్వనివలెనే రెండవదియుఁగూయసాగెను. ఒకటి యెగిరిపోయి చెట్టుకొమ్మమీఁదఁ గూరుచుండెను. మఱియొకటియు నట్లే యెగిరి యక్కడనే కూర్చుండెను. అదియంత

యను జూచి నవకుమారుఁడు నిట్టూర్పు విడిచెను. ఈపక్షుల చేష్ట లను చూచుటచే నాతనిమనస్సున నెట్టివిషాదము కలిగినదో మనము చెప్పఁజాలము.

నవకుమారుఁ డేమియుం దోఁచక నలువంకలను చూచుచుం డెను. క్రమముగా నాతనిదృష్టి పార్శ్వముననున్న యింటిగవాక్షము వంకకుఁ బోయెను. అక్కడవికసించినకమల యాతనికన్నులఁ బడియెను. అక్షణమే పులకితశరీరుఁడై యాతఁడు తిరిగి యావంకఁ జూడఁగా నది యొకరమణీమణిముఖకమలమై యుండెను. నవకుమారుఁ డాప ద్మముఖిని గుర్తించెను. మరల నాచూపు వెనుదిరిగి రాలేదు. శరీర మంతయుఁ గంపింపసారంభించెను. చైతన్యము లోపించిపోయెను.

మృణ్మయీ!

అని గట్టిగా బిలిచి నవకుమారుఁడు మూర్ఛితుఁడయ్యెను. తో డనే రమణీముఖమును గవాక్షమునుండి యదృశ్యమయ్యెను. తత్క్షణ మ యాసుందరీమణి చైతన్యశూన్యుఁడై పడియున్న నవకుమారునియొ ద్దకు వచ్చి యాతని కుపచారమును సేయనారంభించెను. ఆమె కన్ను లనుండి వెడలుచున్న యశ్రుధారలు విస్మృతుఁడై పడియున్న నవ కుమారుని మొగమును తడుపుచుండెను. భయంకరనీలమేఘమాలికా మధ్యంబునుండి దివ్యమైన మెఱపు క్షణక్షణమును ప్రకాశించుచు న్నట్లే ఆగుల్ఫలంబితనీలచికురజాలమధ్యంబున నాసుందరీమణి సుస్థిర సౌదామినీ లతికవలె విరాజిల్లుచుండెను. ఆమె తనచీర చెఱ గుతో నవకుమారుని మొగముపై విసరుచుండెను. క్రమముగా నవ కుమారునిముఖమునందు స్మృతిఁదోఁచులక్షణము లగపడుచుండెను. కొంతసేపటి కాతఁడుకన్నులు తెఱచిచూచెను. అప్పుడును ఆసుందరీ

మణికన్నులనుండి యశ్రుబిందువులు జాలువారుచుండెను. నవకుమా రుండున్మత్తునివలె లేచి యామణిమణిచరణకమలముపైఁ బడి "ప్రియా! కపాలకుండలా! నన్ను క్షమించితివా? చెప్పు! నేనునీయెడ మహాపరాధమును చేసితిని. అయినను నన్ను క్షమింపవలయును. నేను ఘోరపాపాత్ముఁడను—నేను నిన్నెన్నొకష్టములపాలుచేసితిని—నా సంస్పర్శమువలన నీపవిత్రమైనశరీరము కలుషితమైపోయినది. మృణ్మయీ! నీవు నన్ను క్షమింపకపోయినయెడల నీపాపజీవనమును భరింప జాలను" అనియెను.

నవకుమారుఁడు దుఃఖమాఁపుకొనలేకపోయెను. అతనికి తిరిగి నోటమాటరాలేదు. కపాలకుండల నవకుమారునిచేయిపట్టుకొనియూ ఱడించి "ప్రాణేశ్వరా! మీయపరాధ మేమున్నది? మీరు విచారించుట యెందులకు? భవానియనుగ్రహ మిట్లున్నది. దుఃఖముల నను భవింపవలయు నని నానుదుట వ్రాయఁబడి యున్నది. అందులకు మీ రేమి చేయఁగలరు? దైవానుగ్రహముచేఁ దిరిగి మనమిద్దఱమునుగలి సికొంటిమి. ఇప్పుడును దుఃఖమెందులకు?" అనియెను.

వీణ మధురమైనస్వరముచే వినువారిమనస్సు నెట్లు మోహింపఁజేయునో యట్లే యామాటలు నవకుమారుని వీనులను మోహింపఁజేసెను. అతఁడు వినుచున్నస్వరము కపాలకుండలస్వరమే. ఆస్వరమే మనోహరమై మధురమై యాతనిహృదయమున కింపు గూర్చుచుండెను. అతఁడు కన్నెత్తిచూచుసరికి కాకపాలకుండలయే సాక్షాత్కరించినది! నవకుమారుఁడు కపాలకుండల నానందముతోఁ గౌఁగిలించుకొనియెను. వారిద్దఱు నాయవస్థయం దెంతసేపుండిరో యెవ్వరు నెఱుంగరు.

ఇంతలో నుమాపతి యక్కడకు వచ్చెను. అతని వార్ధకమును చూడలేదు. ఉమాపతి కపాలకుండలను బాగుగ నానవాలుపట్టెను. చూచినతోడనే యాతని కది స్వప్నమువలె దోచెను. తుదకాతనిసందేహముతీరిపోయినది. అతడు వేగముగ బోయి, భట్టాచార్యుడు అధికారిణి హరిచరణుడు, మధురానాథుడు మొదలగువారికా శుభవార్తనుదెలియజేసెను. వారందఱునతిత్వరితముగ నచ్చటకువచ్చిరి. వారి యానందమునకు మేరలేదు. హరిచరణుడును, అధికారిణియు కపాలకుండల మూర్ధమును మాటిమాటికిని ముద్దుపెట్టుకొను చుండిరి. అందఱికన్నుల నుండియు నానందబాష్పము వరదవారు చుండెను. వృద్ధభట్టాచార్యుడు కపాలకుండలను చూచి శోక కాలమునందే సంతోష దుఃఖములపాలయ్యెను. హరిచరణుడామె కందఱివృత్తాంతమును దెలిపి యామెకును, తనకును, అధికారిణికిని గల సంబంధబాంధవ్యములను గూడ దెలియజేసెను. ఆనందమువలన కన్నీరు విడుచుచు కపాలకుండల తండ్రి, పినతండ్రి, అధికారిణి మొదలగువారి కందఱికిని నమస్కారములను చేసెను. హరిచరణుడు జరగినవృత్తాంత మంతయు నామెకెఱింగించెను. కొంత సేపటిలోనే రామదాసరాయని కీసమాచారమంతయు తెలిసి యచ్చటికింవచ్చెను అతని కన్నిసంగతులును తెలిసినవి. అతడు "ఈబిడ్డవంటి సతీమణి యీభూమండలమున లేదు. ఈమె నాబిడ్డవలె నున్నది,, అని చెప్పి "ఉన్మాదినీ! నీవు నాకు పరాయిదానవైనను నాబిడ్డవై యుంటివి. నీ మీద నాకు పుత్రికాప్రేమము కలిగియున్నది. ఇప్పుడు నీవు నా కంటెను సమీపబంధువులతో జేరితివి. పరమేశ్వరానుగ్రహముచే నీవు సుఖింపగలవు. చిరాయుష్మతివై సౌభాగ్యమును పడసి చిరకాలము సుఖము ననుభవించెదవుగాక! నేను నీతో మీయత్తవారింటికి వచ్చెదను" అనియెను,

అంతయు నానందమయ మయ్యెను. ప్రపంచమం దిప్పుడెచ్చటను నిరానందమే లేకుండఁబోయెను. మహానందముతో నందఱును సప్తగ్రామమునకు బయలుదేరిరి.

చిరదుఃఖినియైన కపాలకుండల యిన్నిదినములైనతరువాత, నింతటికష్టమున ననుభవించినతరువాత, పతితోడను, జననీజనకులతోడను సోదరిమొదలగు నాత్మబంధువులతోడను గలసికొనియెను. చిన్నతన మందుఁ దల్లిదండ్రులకుఁ బూర్ణకేశినియు, అరణ్యమునందుఁ బెంచిన కాపాలికునకుఁ గపాలకుండలయు, సప్తగ్రామమునకు భర్తకు మృణ్మయియు ప్రాణరక్షకుఁడైన రామదాసరాయునికి ఉన్మాదినియునై తిరిగి యామె బంధుబృంధమున కానంద మూర్తియై భర్తతోఁగూడ సుఖ మనుభ వించుచుండెను. గ్రంథకర్త కపాల కుండలయొక్క నిగూఢమైన యీయితిహాసమును పాఠక మహాశయులకు కానుకగా నొసంగి సెలవు తీసికొనుచున్నాఁడు.

---

# ఉపసంహారము

ఈసామాన్యగ్రంథముయొక్క ప్రధానోద్దేశము సఫలమైనది. కాని తెరపడిపోవుటకుముందు గ్రంథమునందు చెప్పఁబడిన యితరపాత్రముల విషయమై యొకటి రెండు మాటలను చెప్పకయేయూరకుండుట ఈగ్రంథకారునకు న్యాయమైన పనిగాదు.

కొలదికాలములోనే ఉమాపతిని, ముక్తకేశినికిని వివాహమహోత్సవము జరిగినదని వేఱచెప్పవలయునా? శ్యామసుందరికీశుభవర్తమానము తెలిసి యామె యత్తవారి యూరినుండివచ్చెను. ముక్తకేశిని పెండ్లియగువఱకు మృణ్మయి పుట్టినింటనే యుండెను.

ఇది జరుగుటకు కొంచెము పూర్వమే గోపాలకృష్ణరాయలు (దేలవరుఁడు) దొంగలనందఱను సర్కారున కొప్పగించి యింటికి వచ్చి తల్లిదండ్రులకానందము గూర్చెను. రాజాజ్ఞవలన రహీము మొదలగు వారికి మరణదండనము విధింపఁబడెను. గోపాలకృష్ణుఁడు సర్కారువారిచే బహూకరింపఁబడి యున్నతోద్యోగము పొందెను.

అధికారిణియు హరిచరణుఁడును సప్తగ్రామమందు చాలదినములుండి తిరిగి భవానీసేవకొఱకు వెడలిపోయిరి.

శ్యామసుందరిమొదలగువారు అన్నివిధములచేతను తమయభీష్టము నెఱవేఱుటచే నపరిమితానందమును పొందిరి.

"సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం
చక్రవత్పరివర్తంతే దుఃఖానిచ సుఖానిచ"

సమాప్తము.

# జ్యోతిష గ్రంథములు

| | | | రు | అ |
|---|---|---|---|---|
| జ్యోతిష ప్రథమబోధిని | | | 0 | 8 |
| జాతకమార్తాండము | 1 | వ భా | 2 | 0 |
| డిటో | 2 | ,, | 2 | 0 |
| డిటో | 3 | ,, | 2 | 0 |
| జ్యోతిషరహస్యము | 1 | వ భా | 2 | 0 |
| డిటో | 2 | ,, | 2 | 0 |
| జ్యోతిషవిద్యాప్రకాశిక | | | | |
| సంజ్ఞాధ్యాయము | 1 | వ భా | 1 | 0 |
| గణితాధ్యాయము | 2 | ,, | 1 | 0 |
| భావఫలాధ్యాయము | 3 | ,, | 3 | 0 |
| ద్వాదశభావఫలము | 4 | ,, | 3 | 0 |
| అదృష్టదీపిక | | | 0 | 10 |
| హస్తసాముద్రికము | | | 0 | 6 |
| జ్యోతిషఫలప్రదర్శిని | | | 0 | 10 |
| స్వప్నఫలదీపిక | | | 0 | 8 |
| సకలసమస్తగుణ అదృష్టఫలదీపిక | | | 0 | 12 |
| గౌతమసంహిత | | | 0 | 8 |
| శాంభానాడీయము | | | 0 | 8 |
| కోడిపుంజులశాస్త్రము | | | 0 | 6 |
| అంగసాముద్రికము | | | 0 | 8 |
| జాతకదర్పణము | | | 0 | 8 |
| జాతకపారిజాతము | | | 0 | 8 |
| జాతకరాజీయము | | | 1 | 0 |
| జ్యోతిషఫలగ్రంథము | | | 0 | 4 |
| శకునశాస్త్రము | | | 0 | 12 |
| ఉత్తమప్రశ్నశాస్త్రము | | | 1 | 0 |
| స్త్రీజాతకము | | | 0 | 12 |
| యవనజాతకము | | | 0 | 8 |
| జ్యోతిషార్ణవనవనీతము | | | 1 | 8 |
| దశాభుక్తిఫలచంద్రిక అను వృద్ధపారాశరి | | | 1 | 0 |
| పుట్టుమచ్చలశాస్త్రము | | | 0 | 8 |

| | | | రు | అ |
|---|---|---|---|---|
| జాతకచంద్రిక గోపాలరత్నాకరం | | | 0 | 8 |
| నవగ్రహచింతామణి | | | 0 | 4 |
| స్త్రీఋతుశాస్త్రము అను రజస్వలాజాతకము | | | 0 | 8 |
| మూలస్తంభము (శైవగ్రంథము) | | | 0 | 8 |
| రత్నపరీక్ష | | | 0 | 6 |
| గర్గసంహిత | | | 0 | 4 |
| జయమినీసూత్రము | | | 1 | 0 |
| అనుభవజాతకతరంగిణి | | | 0 | 8 |
| పూర్వపారాశరి | | | 0 | 8 |
| బృహత్పారాశరసంహిత | | | 0 | 4 |
| ఆంధ్రజాతకతత్వము సూత్రము | 1 | భా | 1 | 8 |
| డిటో | 2 | ,, | 1 | 8 |
| గో[illegible]సంహిత | | | 0 | 12 |
| కాలామృతము | | | 1 | 0 |
| శిల్పసంగ్రహము | | | 0 | 6 |
| [illegible]యోగము | | | 1 | 6 |
| [illegible] | | | 1 | 0 |
| రట్టమతశాస్త్రము 60 సంవత్సరముల పంచాంగము | | | 0 | 12 |
| సర్వార్థచింతామణి | | | 1 | 0 |
| అష్టకవర్గు | | | 0 | 10 |
| జలార్గళశాస్త్రము | | | 0 | 6 |
| శ్రీపతి | | | 2 | 0 |
| ఛప్పన్నము (ప్రశ్నశాస్త్రము) | | | 0 | 6 |
| అరూఢరత్నసిద్ధాంజనము | | | 0 | 12 |
| సమ్మోహనశాస్త్రము అను అదృష్టయోగము మెస్మరిజమ్ అండ్ హిప్నాటిజమ్ | | | 1 | 8 |
| సోమనాథరేఖాశాస్త్రము | | | 0 | 12 |
| సహదేవగురుతుశాస్త్రము | | | 0 | 8 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.